# ప్రముఖుల అభిప్రాయాలు

సామాజిక, రాజకీయ! ఆర్థిక ఇత్యాదిరంగాల లో ఎన్టీఆర్ వైఫల్యాలకు మూలకారణాల్ని ఈ పుస్తకంలో ఎత్తిచూపారు —ఈనాడు

ముఖ్యమంత్రిరామారావు పైవచ్చిన పుస్తకాల్లో ఆయనను హెచ్చుగా పొగడడమో, గట్టిగా విమర్శించడమో జరిగిఉండవచ్చు ఇది ఆటువంటికోవకుచెందినరాజకీయగ్రంథంకాదు

—ఆంధ్రజ్యోతి

ఎన్ టి ఆర్ రాజకీయ వ్యక్తిత్వంగురించి,సునిశితమైన అరమరికలులేని మనోవిశ్లేషణ ఈగ్రంధం ఇంతవరకూ ఎవరిరాజకీయ మనస్తత్వం గురించి మానసిక శాస్త్రపరంగా ఒక గ్రంధం తెలుగులోరాలేదు ఈపుస్తకం వ్రాయడమే ఒక పెద్ద సాహసం —ఆంధ్రభూమి

...సమాజాన్ని, రాజకీయాల్ని గురించివచ్చే ...కాలే తక్కువ వచ్చినవికూడా నాసి...ంటున్నాయి ఈగ్రంధం చాలాఉన్నత ...శాలతో నిండివుంది ఒకటికి పదిసార్లు ...న పుస్తకం ఇది

...యభాస్కరరెడ్డి మాజీముఖ్యమంత్రి

... రావడమే ప్రధానమనుకొనేవ్యక్తు... ప్రజల్ని ఎలాతప్పుత్రోవ పట్టిస్తారో ...గా వివరించారు

...ంకట్రామ్ మాజీముఖ్యమంత్రి

...వడం ...చ్చినవారందరూ ఇటువంటి పుస్తకా... చదివితే మన ప్రజలిలావుండరు మనరాజకీ...యాలిలా వుండవు —ఎస్ జయపాల్ రెడ్డి

మన ముఖ్యమంత్రిని గాఢంగా, మూఢంగా పొగిడేఅభిమానులు, అలాగే ఆయనను అతితీవ్రంగా విమర్శించే రాజకీయ వాదులు తప్పనిసరిగా చదివవలసిన పుస్తకంఇది

—ఎం వెంకయ్య నాయుడు

వా... లా... 200/-... చె పున... ఏర్పాటు తెల్ల కాగి...

## ఈదశాబ్దపు అద్భుతగ్రంథంగా అందరూకొనియాడుతున్న

# ఎన్.టి.రామారావు రాజకీయ.మనోవిశ్లేషణ



సి.నరసింహారావు

ముఖ్యమంత్రిగా ఎన్ టి రామారావు ఈ రాష్ట్రాన్ని ముందుకుతీసుకు వెళుతున్నారా? వెనక్కు నడిపిస్తున్నారా? ఆయన చేసే విచిత్ర పనులను, గైకొనే ప్రమాదకర నిర్ణయాలను ఎలా అర్థం చేసుకోవాలి? ఎన్టీఆర్ ను ప్రజలు ఎందుకు ఆరాధించారు? ఎందుకు వ్యతిరేకిస్తున్నారు? ఎన్ టి ఆర్ అనుసరించే రాజకీయాలేమిటి? ఆయన మనసులోని ఆలోచనలేమిటి? ఆయన ప్రవర్తనలో వైపరీత్యాలకు కారణాలేమిటి? ఉదయం దినపత్రికలో నెలరోజులపాటు ధారావాహికంగా వెలువడిలక్షలాది పాఠకుల, ప్రముఖ రాజకీయవేత్తల, పత్రికల ఏకగ్రీవ ప్రశంసలు పొందిన అపూర్వ గ్రంధము తెలుగులో వెలువడిన పుస్తకాలన్నింటికంటే అత్యంతఆకర్షణీయంగా ముద్రితమైంది

## ఉచితం! ఉచితం!!

ఈపుస్తకంతోపాటునిత్య జీవితంలో మీకెంతగానో ఉపకరించే ఒక విలువైన పత్రికను ఉచితంగా పంపిస్తాము

అతివిలువైన ఈపుస్తకాన్ని పొందటం ఎలా?

- ఇక్కడ జతపరచిన కార్డుపై మీ చిరునామావ్రాసి మీ సంతకంపెట్టి పోస్టుచేయండి
- మీరు ఈ కార్డుకు స్టాంపులు అంటించవనవసరం లేదు
- పోస్టుఖర్చులు మేమే భరించి ఈ పుస్తకాన్ని రూ 30 లకు వి పి పి ద్వారా పంపిస్తాము
- దీనితో పాటు మీకో విలువైన పత్రికా ప్రతిని ఉచితంగా పంపిస్తాము

*Nanı International,*
Eluru Road Vııavawada 2

## మీరు చదివిన ఇతరపుస్తకాలన్నీ ఒకఎత్తు. ఈపుస్తకం ఒక్కటే ఒకఎత్తు.

## వీక్లీ పోస్ట్

### సూపర్ హిట్

ఒక పత్రిక తారాపథంలోకి దూసుకు పోవాలన్నా మార్కెట్‌ని పెంచుకోవాలన్నా, కావలసింది ఒక్కటే పాఠకుల నిర్మొహమాటమైన అభిప్రాయాలు ప్లస్ సంపాదక వర్గం కృషి పాఠకుల అభిరుచికి తగ్గట్టే పత్రికను తీర్చిదిద్దాలని సంపాదక వర్గం ప్రయత్నిస్తుంది ఇలా తీర్చిదిద్దడంలో పూర్తిగా సఫలమయినది లేనిది తెలిసేది పాఠకుల అభిప్రాయాల ద్వారా మాత్రమే ఈ విధంగా పత్రిక మంచి చెడుల విషయంలో పాఠకుల పాత్ర ఎంతైనా ఉంది

ఓ మహాకవి అన్నారు "నిన్ను విమర్శించే వాళ్ళనీ నీ తప్పులు ఎత్తి చూపేవారిని తీసుకొచ్చి నీ ఇంటి ప్రక్క గుడిసె వేయించి అందులో ఉంచు అప్పుడు నీవు తప్పక గుణవంతుడవుతావు " దీనిలో ఎంతైనా నిజం ఉందని తెలుస్తుంది ఆలోచిస్తే ఈ విధంగా ఒక పత్రికకు నాలుగు పొగడ్తలే కాక ఆరు మంచి విమర్శలు కూడా ఉండాలన్నది నా అభిప్రాయం

### బహుమతి పొందిన ఉత్తరం

ఇక మా(మీ) 'ఆంధ్రసచిత్రవారపత్రిక' విషయానికొస్తే ఈ మధ్య పత్రిక సర్వాంగ సుందరంగా వస్తుందని చెప్పకతప్పదు తాజాకాలమ్ నుండి "వ్యాఖ్య పోటీ" "టిట్ ఫర్ టాట్" "గళ్ళనుడికట్టు" అన్నీ సూపర్ హిట్ శీర్షికలే ఇలాంటి'శీర్షికలు మరెన్నో' ప్రవేశ పెట్టవలసిన అవసరం మన పత్రికకు ఎంతైనా ఉంది

పత్రికలో మరో మంచి విషయం నాకు కనిపిస్తున్నది అది ఏమంటే ఒక్క "గళ్ళనుడికట్టు" శీర్షికకు తప్ప మిగతా శీర్షికలకు కూపన్ అవసరం లేకపోవటం ఇలా ఉండటం వల్ల పాఠకులు పోస్ట్ కార్డ్ ద్వారానే శీర్షికలలో పాల్గొనుటకు అవకాశం ఉన్నది మరో లాభం ఏమంటే పరిశీలనకు కూడా సమయం కలసివస్తుంది "గళ్ళనుడికట్టు" కూపన్ తప్పనిసరి అన్నది గమనించవచ్చు

ఫొటో వ్యాఖ్య, టిట్ ఫర్ టాట్ ఫలితాలతోపాటు లక్కీ పేర్లు ప్రచురించడం వల్ల కొందరికైనా సంతృప్తి అందించిన వారవుతున్నారు

ఇక మార్పుల విషయానికొస్తే సినిమా పేజీ, సీరియల్ టైటిల్స్ కలర్‌లో ప్రచురిస్తే ఆకర్షణీయంగా ఉంటుందని నా అభిప్రాయం అలాగే "వీక్లీ పోస్ట్"లో ఎక్కువ మందికి అవకాశ మివ్వాలని మనవి "ముఖచిత్రం" విషయంలో మన ఆంధ్రపత్రిక ఎంతో ముందంజలో ఉందని చెప్పవచ్చు "మనలో మాట" ముందు మాట వలె ఆకర్షణీయంగా ఉన్నది సంపాదకీయం గురించి చెప్పనవసరంలేదు ఇంకో విషయం ఏమంటే ఈ మధ్య కథలు బోర్ కొట్టడం, భలారే చిత్రం లాంటివి మరిన్ని శీర్షికలు మిస్ అవుతున్నాయి గమనించవలసినదిగా మనవి

పి |కరీంఖాన్, మదనపల్లి రోడ్(ఆర్ యస్ )

(74 వ పేజీ చూడండి)

## పసందైన పత్రిక!

విడి ప్రతి వెలరు 3 50



ముఖచిత్రం
వజ్రాల నగలు
మైమరిపించే మంత్రాలు'
మాడల్ ఉమాదేవి
(ఫోటో విజయ మహేష్)

వజ్ర సంకల్పం సీరియల్ 37వ పేజీ చూడండి'

పై సంచికలో
ఉదర వ్యాధులపై ప్రత్యేక వ్యాసం'

### ఈవారం ప్రత్యేకం –



### కథలు –



### సీరియల్ నవలలు –



### వ్యాసాలు శీర్షికలు



ముఖ్య సంపాదకుడు **శివలెంక రాధాకృష్ణ** సంపాదకుడు **వీరాజీ**

ముద్రాపకుడు, ప్రచురణకర్త **శివలెంక నాగేశ్వరరావు**

ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ 3, ఫోన్‌లు 75667, 61247, 61248, 75569.

**తెలుగువారి నిరంతర సేవలో మాకిది 81వ సంవత్సరం**

# గెలవండి

# బంగారు బహుమతులు

## కొనండి గాంధిటెక్స్ కాటన్ చీరలు



మీకోసమే 25 బహుమతులు

**1** మొదటి బహుమతి నగల సెట్టు బంగారపు నెక్లెస్ దిద్దులు, ఒకజత గాజులు, ఒక వుంగరం బరువు 65 గ్రాములు 22 క్యారెట్లు

**2** రెండవ బహుమతి బంగారపు గొలుసు, ఒకజత లోలాకులు బరువు 28 గ్రాములు 22 క్యారెట్లు

**3** మూడవ బహుమతులు (రెండు) ఒక్కొక్క జత బంగారపు గాజులు, ఒక్కొక్క గాజు 10 గ్రాములు, మొత్తం 40 గ్రాములు, 22 క్యారెట్లు

**4** నాల్గవ బహుమతులు 21 ఒక్కొక్క జతలోలాకులు, బరువు 8 గ్రాములు, మొత్తం 168 గ్రాములు

## చీరచీరకి కూపన్
## ప్రతి కూపన్‌కీ బహుమతి పొందే అవకాశం

వరించి మీ గడపలోకి వస్తోంది మహాలక్ష్మి ఆహ్వానించండి పొందికగా గాంధిటెక్స్ చీర కట్టుకుని మెడలో బంగారపు నెక్లెస్ చెవులకి దిద్దులూ చేతికి గాజులూ వేలికి వుంగరం ఇవన్నీ అలంకరించుకుని అద్దం ముందు నిల్చోండి మీ యింట్లో వాళ్ళు మురిసిపోతారు మీ అంద చందాల్ని చూసి ఇంతకీ మీరు చెయ్యవలసిందల్లాయింతే తిన్నగా బట్టల షాపుకు వెళ్ళి మీకు కావలసిన రంగుల్లో డిజైన్లలో మీ మనసును ఆకట్టుకునే గాంధిటెక్స్ చీరల్ని కొనండి మీరు కొనే ప్రతి చీరకీ ఒక కూపన్ చీరలెన్ని కొంటే కూపన్లన్ని ప్రతి కూపన్‌కీ బహుమతి పొందగల బంగారు అవకాశం కూపన్లని జాగ్రత్తగా పెట్టుకోండి జూన్ 30వ తేదీన పెద్దల సమక్షంలో లక్కీ డ్రా తీస్తారు ఆ అదృష్టం మీ యింటి గడపే తొక్కొచ్చు ఆనాడు



బంపర్ లక్కీ డ్రా
విజయవాడలో
జూన్ 30వ తేదీ 1989

**గాంధిటెక్స్©** నిలువెల్లా అందం!
**కాటన్‌సారీస్** వంటెనిండా బంగారం!!

అధికృత డీలర్లు సునీల్ ఎంటర్‌ప్రైజెస్, 111 వస్త్రలత, విజయవాడ 1 * గిరిజా శారీ ట్రేడర్స్, 136, ఏ, వస్త్రలత, విజయవాడ 1 * శ్రీ శాయిబాబా టెక్స్‌టైల్స్, వస్త్ర భారతి, షాపు నెం 27, ప్రొద్దుటూరు * ప్రీతీ టెక్స్‌టైల్స్, చిన్నవీధి, విజయనగరం * శ్రీ బాలాజీటెక్స్‌టైల్స్, సుభాష్ రోడ్, సికిందరాబాదు * నవీన్ టెక్స్‌టైల్స్, తారాచంద్ మార్కెట్, రికాబ్ గంజ్, హైదరాబాదు

# ఆంధ్రసచిత్రవారపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్

సంపుటము 81 | స్థాపితం 1908 బొంబాయి 1914 మద్రాసు | సంచికలు 42 43

వ్యవస్థాపకులు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు

9/16-6-1989 విజయవాడ | (1938-1972 సంపాదకులు) శివలెంక శంభుప్రసాద్ | శ్రీ శుక్లనామ సం వైశాఖ శు షష్ఠి


# పొగ త్రాగెడివారి సంగతి!

“పొగత్రాగని వాడు దున్నపోతై పుట్టున్”అన్నాడు గిరీశం- అయితే దీనికి దాఖలా కష్టం- పొగత్రాగెడివారు మరునటి జన్మ సంగతి అట్లా వుంచి యీ జన్మలో ఏమవుతారు అన్న సంగతి గిరీశం కనీసం బుచ్చమ్మ దగ్గరయినా ఓ లెక్చర్ దంచలేదు- “కావర్స్” వున్నా లేకపోయినా విదేశీ చుట్టలు అంటే ‘సిగార్స్’ లేందే గిరీశం బ్రతకలేడు కనుక- పుగాకును యేదో విధంగా నోటిద్వారా ముక్కుద్వారా సేవించే వారికి దానివల్ల లభించే సుఖం అమరం- మధురం కాగల అవకాశాలుండబట్టే మొన్న మే 31వ తేదీ నాడు ప్రపంచ ఆరోగ్య సంస్థ వారు ధూమపాన వ్యతిరేక దినం పాటించమంటే ధూమపాన ప్రియులు- పాన్ మసాలా ప్రియులు ఆ హెచ్చరికని “ఉఫ్”మని వూదేశారు- అయితే అంత మాత్రాన పుగాకు మనిషికి చేసే అపకారం ఎక్కడికి పోతుంది? దానివల్ల ఆయుర్దాయాన్ని తగ్గించే క్యాన్సర్ వంటి వ్యాధులు చాలా ఎక్కువ అని “హూ”?- అంటే ప్రపంచ ఆరోగ్యసంస్థ ఒక ప్రత్యేక సుదీర్ఘమైన సుస్పష్టమైన నివేదికలో వివరంగా చెప్పుకొచ్చింది ఈ సంగతులలో కొత్త విషయమొకటుంది పుగాకు సేవనం వల్ల పురుషులకన్నా ఎక్కువగా స్త్రీలకే ప్రమాదం- వారి శరీర నిర్మాణాన్ని బట్టి స్త్రీలు ధూమపానం, పుగాకు నములడం- అడ్డపొగ పట్టడం ద్వారా మగవారికన్నా నిస్సందేహంగా యెక్కువ వ్యాధులకి గురి అవుతారని యీ నివేదిక నొక్కి వక్కాణిస్తున్నది బ్రిటన్ దేశంలో స్త్రీలలోనే వూపిరితిత్తుల క్యాన్సర్ ఎక్కువగా రావడానికి- రోజురోజుకి అక్కడ లతాంగులు సిగరెట్‌లు కాల్చే అలవాటు ఎక్కువ చేసుకోడమే! స్త్రీలలో రొమ్ము క్యాన్సర్‌కి, గొంతు క్యాన్సర్‌లకీ కూడా ‘ధూమపానం’ ఎక్కువగా దారితీస్తున్నట్లు దేశదేశాలలో సర్వేలు చేసి తీసిన లెఖ్ఖలు చూపిస్తున్నాయి అయితే ఈ సంగతి అతివలు ఖాతరు చేయటం లేదట అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఇప్పుడిప్పుడు పట్టణ వాసపు స్త్రీలు కూడా ‘సిగరెట్’ల మోజులో పడిపోతున్నారు- పారిశ్రామిక ప్రాంతాలలో యిటీవల “లంగ్ క్యాన్సర్” చావులు రెట్టింపై పోయాయి

నలభై దేశాలలో “డబ్ల్యు హెచ్ వో సంస్థ (హూ) సర్వే చేసింది తృతీయ ప్రపంచ దేశాలలోని వో 10 దేశాలు- “స్మోకింగ్” అలవాటులో రికార్డులు బద్దలు కొడుతున్నాయి! పాపువా, న్యూగినీదేశాలలో ఈడొచ్చిన అమ్మాయిలలో కనీసం 80 శాతం మంది- చుట్టా బీడీ సిగరెట్ వగైరాలు- మక్కువతో సేవిస్తున్నారు స్వాజిలాండు, కిర్బతి, బొలివియా, నవురు, మన ఉపఖండంలోని నేపాల్ - అటు వైపు బ్రెజిల్, మెక్సికో, ఫిజీ దీవులు మొదలైన దేశాలలో “ధూమపాన”మే తరుణోపాయం అన్నంత ఎక్కువగా “పొగాకు”కి దాసోహమంటున్నారు జనం సుమారు ఒక యాభై వేల కేసులు ప్రత్యేకించి పరిశీలించారు పొగాకు సేవనం ద్వారా సంక్రమించిన కారణంగానే క్యాన్సర్, బ్రాంకైటిస్ వంటి వ్యాధులు వస్తున్నట్లు వెల్లడైంది ప్రపంచంలో “టొబాకో డెత్స్” (తెలుగులో ఏమందాం?) ప్రతీ 13 సెకన్‌లకి ఒకటి సంభవిస్తున్నాయని ప్రపంచ ఆరోగ్య సంస్థ గట్టిగా హెచ్చరిస్తోంది!”

భారత దేశంలో కూడా పొగాకు పదార్థాల వాడకం రానురాను యెక్కువై అది ప్రభుత్వ “బొక్కసాని”కి ఆదాయం పెంచుతున్నదన్నమాట నిజమే కాని ఏటా మన దేశంలో ధూమపానం తత్సంబంధంగల యితర అలవాట్ల వల్ల సంభవించిన వ్యాధుల కారణంగా ఆరు లక్షల ముప్ఫయి వేల మంది చనిపోతున్నారట!- కార్మిక వర్గాలలో స్త్రీలు గర్భవతులుగా ఉన్నప్పుడు కూడా అడ్డపొగ విపరీతంగా పట్టేస్తూ వుంటారు- దానివల్ల పుట్టబోయే శిశువుకు చాలా నష్టమని ఆగ్నేయాశియా ఖండం ప్రపంచ ఆరోగ్య సంస్థ డైరెక్టర్ డా ఉకోకోగారు ఉద్ఘాటిస్తున్నారు అయితే “హూ కేర్స్?” అని జనులు యీ “హూ” (ప్రపంచ ఆరోగ్య సంస్థ) హెచ్చరికని త్రోసివేస్తున్నట్లుగా అనుకోవాలి ఎందుకంటే ఆశియా దేశాలలోనే “ధూమపానం” గడిచిన కొద్ది సంవత్సరాల కాలంలోనే 22 శాతం దాకా పెరిగిపోయింది! అంచేత అలవాటు పడ్డవారిని ప్రపంచ ఆరోగ్య సంస్థయే కాదు ఆ సంస్థను ఏర్పాటు చేసిన వారు కూడా ఆపలేరుకాని అలవాటుపడకుండా ఉన్న- యింకా సిగరెట్ త్రాగటానికి ఆకర్షితులు కాకుండా ఉన్న యువలోకానికి మాత్రమే ఈ సందర్భంగా- పొగాకుకి దాని పొగకి కూడా దూరంగా వుండమని హెచ్చరికచేస్తున్నాం ఎందుకంటే ప్రక్క వాడు పీల్చి వదిలే పొగ వల్ల కూడా వూపిరితిత్తుల క్యాన్సర్ రాగల ప్రమాదం వున్నదట! ●

# మీ పాపాయికి ఇవ్వండి కూరగాయలలోని మంచి పుష్టి



ముందుగానే వండిన

# ఫారెక్స్®-వెజ్




## 6 నెలల నుంచి

క్రొత్త ఫారెక్స్-వెజ్ విటమిన్లు సమృద్ధిగా గల కాయగూరలు-క్యారట్లు, టమాటాలలోని మరియు పెసరపప్పులోని సహజమైన పోషణ గుణములతో కూడినది.

ముందుగానే వండినది, కనుక మీ పాపాయి యొక్క సున్నితమైన జీర్ణశక్తికి అనుకూలమైనది.

**ఫారెక్స్-పెరుగుదల కోసం రుచికరమైన విధానం.**



ఫారెక్స్ పోషకాహారాల శ్రేణిలో ఇప్పుడు కలవు: 1. పాలతో కూడిన ఫారెక్స్-సిరియల్ 2. ఫారెక్స్-వెజ్ 3. ఫారెక్స్-ఎగ్

# ‘తెలుగుదేశ కోలాహలం’

మినీ మహానాడు కోలాహలం రాజదానీ నగరాన్ని మూడు రోజులపాటు వొక వూపు వూఎ వదిలిపెట్టింది 23 జిల్లాల నుంచి రెండు వేల లారీలు బస్సులు తీసుకొచ్చిన ఎన్ టి ఆర్ అబిమానులు తమ ప్రియతమ నాయకుడి జన్మదిన మహోత్సవ వేడుకలుగానే యీ తెలుగుదేశం సబల్ని జరుపుకున్నారు అక్కడ ఎన్ టి ఆర్ ఒక్కడే మూలపురుషుడు తతిమ్మా వారంతా ప్రకృతి మాత్రమే అరవై ఏడు వసంతాలు చూసిన తారకరామారావు– యువకులందరికి తారకమంత్రం ఉద్బోదిస్తూ– వృద్ధతరం అంతా వెనక్కి పోవాలని గర్జించినప్పుడు ఒక్కడైనా ఎన్ టి ఆర్ యువకుడా? వృద్ధుడా? అని చర్చించుకోలేదు దండలు పాదాబివందనాలు– జేజేలు మంగళారతులు అన్నీ కురిఎంచి మురిసిపోయిన జనంలో కొందరు ఎన్ టి ఆర్ కి 60 ఏళ్ల తర్వాత తిరిగి బాల్యం ప్రారంబమైంది కనుక యిప్పుడు స్వీట్ సెవెన్‌టీన్ యియర్స్ మాత్రమేనని వాదించుకున్నారుట" అందుకే తెలుగుదేశం విదాత– యువతరం వోట్లను దృష్టిలో పెట్టుకుని పదే పదే మాట్లాడారు – యాభై శాతం పార్టీ టిక్కెట్‌లు కొత్తవారికి ముఖ్యంగా యువకులకి యిస్తామన్నా కూడా కిమ్మన్న వాడు లేదు

తెలుగు యువత క్రాంతి యాత్రకి యీ మినీ మహానాడు అత్యంత ప్రాముఖ్యతనిచ్చింది– జనం వచ్చారా? కొని తేబడ్డారా? లాంటి ప్రశ్నలు యివాళ దేశంలో ఎవ్వడూ అడగడు జనం నేల ఈనినట్లు వచ్చారు అరవై అడుగుల యిరవై అడుగుల ఎన్ టి ఆర్ విష్ణుమూర్తి వేషం చెక్క విగ్రహాలను చూసి ఆనందించారు పదివేల ఉద్యోగాలను వెంటనే వర్తి చేస్తాం– అయిదు వేలమంది యువ పారిశ్రామికవేత్తలకి 43 కోట్ల రూపాయిలు ఆర్థిక సహాయం అందజేస్తాం– ఈ శతాబ్దాంతందాకా రిజర్వేషన్‌లు కొనసాగిస్తాం వంటి జనాకర్షణ తీర్మానాలను ముఖ్యమంత్రి ప్రకటించటంతో – రానున్న ఎన్నికలకిది సన్నాహక సమావేశం అన్నది కూడా స్పష్టం అయిపోయింది

అంతర త ప్రజాస్వామ్యం అన్నవాడు లేడు– అన్నా యిదేమిటన్నా అని ప్రశ్నించినవాడు లేడు పార్టీ శిబిరం నుంచి వెళ్లిపోయిన తమ్ముళ్లను తల్చుకున్నవాడూ లేడు

* * *



కేంద్రాన్ని– పంచాయతీరాజ్ బిల్లునూ తెగ తిట్టిన రాజకీయ తీర్మానంలో నైనా నేషనల్ ఫ్రంట్ వూసెత్తకపోవడంతో అన్నగారి మనసులోని మాట ఎవ్వరికీ తెలియలేదు– కాంగ్రెసును తిట్టడంలో కొత్త కొత్త రకం ప్రయోగాలెన్నో చేసిన యీ మినీ మహానాడు తెలుగుదేశం పార్టీ మీద ఎన్ టి ఆర్ నాయకత్వం ఎట్టి సడలలేదన్న విషయాన్ని స్పష్టం చేసింది– అన్నగారి ప్రక్కన తల ఎత్తుకున్న నెంబర్ టూ నాయకుడే కాన రాలేదని అబిమానులు అనుకుంటూ తిరుగుముఖం పట్టినప్పుడు– పార్టీ సబలో వున్న చాలామంది ఎం పీ లు ఎమ్ ఎల్ ఏ లు– దిగులు దిగులుగా రేపటి ఎన్నికల్లో తమకు టిక్కెట్ దొరకదేమోనన్న భయంతో పైకి మాత్రం గంబీరంగా కనపడడానికి ప్రయత్నాలు చేశారని ప్రత్యక్ష సాక్షుల కథనం!– పెరిగిన పాల దరలు కాని విద్యుత్ రేట్లు గాని– పెరగనున్న ఆర్ టి సి బస్సు రేట్లుగాని యీ కోలాహలంలో పాల్గొన్న వేలాది ప్రతినిదులకు యీ సమయంలో జ్ఞాపకమే రాలేదా? బహుశా ఎన్ టి ఆర్ అన్నట్లు సగటు మనిషికి నొప్పి కలిగించకుండా ధరలు పెంచాం అన్న మాటలు యీ కోలాహలంలో పాల్గొన్నవారికే వర్తిస్తాయేమో– బహుశా వీరేనేమో సగటు మనుషులు!– మొత్తం మీద మూడు రోజుల మినీ మహానాడు ఎన్ టి రామునికి మెనీ హ్యాపీ రిటన్స్ ఆఫ్ ది డే చెప్పి వెళ్లిపోయింది!

మినీ మహానాడు కోలాహలం



# చైనాలో ‘ఖైయాసు’

బీజింగ్‌లో నేల యీనినట్లుగా వచ్చి– బలప్రదర్శనలు చేస్తున్న విద్యార్థుల ఆందోళనకు ప్రతిగా గవర్నమెంటు లారీలు తుపాకులు ప్రదర్శించడానికి బదులుగా తాము కూడా కర్షక వర్గాలను శకటాల మీద తీసుకొని వచ్చి నాయకత్వంలో మార్పు ఉండరాదని పెద్ద పెట్టున ప్రదర్శనలు చేయించటం ఒక తాజా పరిణామం

బీజింగ్‌లోని సువిశాల తియనాన్మెన్ స్క్వేర్‌లో యువతీ యువకులు యింకా చిందులు త్రొక్కుతూనే ఉన్నారు కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి– విద్యార్థుల కోరికల పట్ల సానుభూతి గల ఝూవో జియాంగ్‌ని ఆయన యింట్లోనే కదలకుండా నిర్బంధించారు – విద్యార్థులు నాలుగు షరతులు పెట్టారు అందులో ఒకటి నాయకత్వంలో వెంటనే మార్పు అందరికి తెలుసు రెండోది పత్రికల మీద ఆంక్షలు ఎత్తివేయాలి సైనిక శాసనం తొలగించాలి – కాని శ్రీపెంగ్ డెంగ్‌ల నాయకత్వం వీరి మాటలను లెక్క చేయలేదు కొంతమంది విద్యార్థి నాయకుల్ని కూడా అరెస్టు చేశారు– అకస్మాత్తుగా మేనెల 30వ తేదీనాడు తియనాన్మెన్ స్క్వేర్‌లో మావో చిత్రపటానికి మృతవీరుల స్మారక చిహ్నానికి మధ్య తెల్లని పాలరాతి విగ్రహ మొకటి మొలిచింది విద్యార్థులు దీన్ని ప్రతిష్టించారు దానిమీద చైనా జెండా ఎగురుతున్నది ఈ బొమ్మ ఎవరిది అంటే చైనా ప్రజాస్వామ్యమాత అంటున్నారు చైనా యువతీ యువకులు! నలభై రోజులుగా లక్షలాది విద్యార్థులు విప్లవ పంథా త్రొక్కుతున్నా– లక్షా యాభై వేలమంది సైన్యం దూరాన విడిసి వున్నా రక్తపాతం లేదు! అదే విశేషం! నాయకత్వంలో

మార్పుకైయీ పోరాటంలో అమెరికా చెయ్యి వున్నదన్న వాదం ఒక్కటి తప్ప తతిమ్మా డ్రామా ఎందుకో ఎమిటో అంతు చిక్కటంలేదు వెదురు తెర వెనుక వున్నది నేటి చైనా స్థితి అయితే ఖియాసులో వున్నది అని చెప్పగలం–

## యుద్ధ భయం ఎందుకు?

ఆటమ్‌బాంబుతో వెలిగించు
నీ ప్రపంచంలో రాతిరే వుండదు
అనే పాలసీకి బదులు
హెచ్‌బామ్‌బులను ప్రేల్చు
నీ లోకంలో వెలుతురే వుండదు– అన్న విధానాన్ని కొంతకాలం అగ్ర ఉగ్ర రాజ్యాలు అనుసరించాయి నలభై ఎళ్ల క్రితం నాటో (ఉత్తర అట్లాంటిక్ దేశాల కూటమి) ఉద్భవించటానికి కారణం యుద్ధ మేఘాలు అలుముకుని వుండటమే కాని మొన్న బ్రస్సెల్స్ నగరంలో నాటో కూటమి రాజ్యాల సమావేశం జరుగుతున్నప్పుడు పరిస్థితులు వేరు శ్రీ మిహాయిల్ గార్బచేవ్ దేశంలోను విదేశాలలోను కూడా చాలా దిగ్భ్రాంతి కలిగించే హడావుడి చేసేస్తున్నారు మీరెలా పోతే నాకేం– నేను ఆయుధాలు తీసేస్తాను సైన్యాల్ని ఎలిమించుకుంటాను యుద్ధ బజట్‌లో కోత విదిస్తాను అంటూ గార్బచేవ్ ప్రపంచ శాంతిదూత అవతారంగా మారిపోతూ వుండటంతో అమెరికా


అమెరికా అధ్యక్షుడు జార్జి బుష్

కూడా జార్జి బుష్ ఆధ్వర్యంలో తాను పశ్చిమ ఐరోపాలో యిరుక్కున్న ప్రాంతాల విషయం ఆలోచించవలసి వచ్చింది బ్రస్సెల్స్ సమావేశంలో జార్జి బుష్– పశ్చిమ ఐరోపాలో సద్ధంగా వుంటూ వచ్చిన అమెరికన్ బలగాలలో యిరవై శాతం దాకా వెనక్కి తీసుకోవడానికి నిర్ణయించామని చెప్పారు ప్రపంచంలో ఉద్రిక్తత సడలిపోవడానికి యీ యిరవై శాతం ఉపసంహరణ అరవై శాతం సహాయం చేస్తుందని పశ్చిమ జర్మనీ నమ్ముతూ వున్నా బ్రిటన్ మాత్రం నమ్మటంలేదు అయితే నాటో కూటమిలోని 15 మంది నాయకులు అమెరికన్ అధ్యక్షుని నిర్ణయం కాదన వీలులేదు – నాటో సభకి నాలుగు అంశాల పథకం వొకటి సమర్పించిన జార్జి బుష్– గార్బచేవ్‌కు అతని బాషలోనే సమాధానం చెప్పాడన్న ప్రశంసలు ప్రపంచ నాయకులు యిప్పుడు వెలిబుచ్చుతున్నారు హెలికాప్టర్‌లు యుద్ధ విమానాలు మారణాయుదాలు కూడా పశ్చిమం నుంచి తగ్గించాలన్న బుష్ నిర్ణయం అమలు జరగటానికి కాలం పట్టవచ్చును కాని సూత్రప్రాయంగా జరిగిన యీ అంగీకారం వల్ల– ప్రపంచ శాంతికి జరిగే బృహత్ ప్రయత్నాలు మరో అడుగు ముందుకు వెళ్ళినట్లే అయితే షార్ట్ రేంజ్ న్యూక్లియర్ వెపన్స్ ని తగ్గించుకోవాలన్న ఒప్పందం అమలు మీద అమెరికా రష్యాలు మరోసారి బల్ల దగర కూర్చుంటే తప్ప ఉభయ నాయకుల నిజాయితీ కార్యరూపం దరిస్తున్నది అన్న నమ్మకం ప్రపంచ జనాలకి కలుగదు

జార్జి బుష్ మిహాయిల్ గార్బచేవ్‌లు ఎక కోణంలోంచి చూడగలగటం ఐరోపా దేశాలకు ఎట్లా వున్నా ఆశియా దేశాలకి మాత్రం చాలా మంచిది!

(31–5–89)





మ ధ్యాహ్నం

సమయం రెండు గంటలు కావ-స్తోంది

అకౌంట్స్ సెక్షన్ సందడిగా ఉంది

ఆఫీస్ సిబ్బంది ఎవరి సీట్లలో వాళ్లు బిజీగా ఉన్నారు

అర్జంటు లెటర్స్ టైపు చేస్తూ యథాలాపంగా తలెత్తిన మందాకిని ఉలిక్కి పడింది

ఎదురుగా కాస్త దూరంలో ఆఫీసు గుమ్మం దగ్గర ఎవరో అపరిచిత యువకుడు నిల్చుని తననే తదేకంగా చూస్తున్నాడు

మందాకిని కనుబొమలు ముడుచుకున్నాయి

"ఎవరతను? ఇంతమంది ముందు సభ్యత మరచి తన కేసి అలా చూస్తున్నాడు?"

ఆలోచిస్తూనే మిషన్ మీద కాగితాలు తీసి వేరే లెటర్ పెట్టి తిరిగి టైపు చెయ్యటంలో నిమగ్నం అయ్యింది



# మందాకిని

కొసని కమల

యాంత్రికంగా వేళ్లు కదులుతున్నాయ్

కాని మునుపటిలా ఏకాగ్రత కుదరటం లేదు

"ఆ వ్యక్తి వెళ్లిపోయాడా లేక ఇంకా అక్కడే నిల్చున్నాడా ?"

ఓరగా తలెత్తి గుమ్మం వైపు చూసింది

ఆ వ్యక్తి ఎవరోగాని ఇంకా అక్కడే అలాగే చూస్తూ నిల్చున్నాడు

"ఛీ ఛీ చదువు సంస్కారం వున్న వాడిలాగే ఉన్నాడు కాని ఎందుకలా దీక్షగా ఇటే చూస్తాడు? అతడ్ని ఎక్కడా చూసిన జ్ఞాపకం కూడా లేదు ఛ్ఛ ఏమిటో కొంత మంది అంతే ఆడపిల్ల కనిపిస్తే తినేసేలా చూస్తారు?" విసిగించుకుంటూ మనసులోనే తిట్టుకుంది

ఇంతలో అటెండరు యాదగిరి ఫైల్స్ ట్రే పట్టుకొని అటుగా వెళ్తూ గుమ్మం దగ్గర తచ్చాడుతున్న ఆ వ్యక్తిని చూసి "ఎవ్ ఎవర్ను కావాలండీ?" అన్నాడు

"నా నాకు అకౌంటెంట్ ధనుంజ యంగారు కావాలి"

"ఆఫీసరుగారి ఛాంబర్‌లోకి వెళ్లారు పది నిమిషాల్లో వస్తారు అదిగో అక్కడ కూర్చోండి" అంటూ వెళ్లబోతున్న వాడల్లా రెండు అడుగులు వెనక్కి వేసి "అదిగో ఆయన వస్తున్నారు మాట్లాడండి" అన్నాడు యాదగిరి

కాగితాలు పట్టుకొని ఆఫీసరుగారి ఛాంబరులోంచి హడావుడిగా అప్పుడే బయటికి వస్తున్న ధనుంజయం " ఏమిటి యాదగిరి" అన్నాడు

"మీకోసం ఎవరో వచ్చారు సార్ "అంటూ ఆ నూతన వ్యక్తిని చూపించాడు యాదగిరి

ప్రక్క సెక్షన్‌లోకి వెళ్లబోయిన ధనుంజయం జారుతున్న కళ్ళజోడుని సవరించుకొని ఆ వ్యక్తి కేసి పరిశీలనగా చూస్తూ "ఎస్ ఆయామ్ ధనుంజయం"అన్నాడు

ఆ వ్యక్తి చేతులు జోడించి నమస్కారం చేస్తూ" నా పేరు సుధాకర్ నన్ను ఈశ్వర్రావ్ పంపించాడు మీతో చిన్న పని ఉండి వచ్చాను" అన్నాడు

తన బావమరది ఈశ్వర్రావు పేరు వినటంతోనే ధనుంజయంగారి మొఖంలో చిరునవ్వు వెలిగింది

"ఓ ఐ సి ఈశ్వర్ పంపించాడా! వెరీ గ్లాడ్ ఈజ్ దేర్ ఎనీ ఆఫీషియల్ వర్క్?"

"నో జస్ట్ పర్సనల్ మేటర్"

"ఒకె నాకు కొంచెం పక్క సెక్షన్‌లో అర్జంటు వర్క్ ఉంది ఒక అరగంటలో మాకు లంచ్ బ్రేక్ అంతవరకు వెయిట్ చెయ్యగలరా?"

"వైనాట్ ?" సుధాకర్ నవ్వాడు

"థాంక్స్" ధనుంజయం పక్కకు తిరిగి " యాదగిరి " అంటూ అటెండర్‌ని పిలిచి "చూడు ఈయన్ని మన రిక్రియేషన్ రూమ్‌లో కూర్చోపెట్టు " అని సుధాకర్ కేసి తిరిగి "మీరు కాస్సేపు ఆరూమ్‌లో కూర్చోండి అక్కడైతే మేగ్‌జైన్స్ ఉంటాయి మీకు మంచి కాలక్షేపం అరగంటలో లంచ్‌కి నేనూ అక్కడకే వస్తాను" అంటూ గబగబా పక్క సెక్షన్ లోకి వెళ్లిపోయాడు ధనుంజయం

సుధాకర్ యాదగిరి వెంట రిక్రియేషన్ రూమ్‌లోకి వెళ్లాడు

మందాకిని తేలిగ్గా ఊపిరి తీసుకుంటు తిరిగి దీక్షగా తన పనిలో నిమగ్నం అయ్యింది ఆ సుధాకర్ వెళ్లిపోవటంతో హాయిగా అనిపించింది

మిగిలిపోయిన మూడు లెటర్స్ పావు గంటలో పూర్తిచేసి మిషన్‌లోంచి కాగితాలు తీస్తుంటే "రంగ్" మని గడియారం అరగంట కొట్టింది

రెండున్నర !

ఒకరొకరిగా అంతా ఫైల్స్ కట్టిపెట్టి సీట్లోంచి లేవసాగారు

లంచ్ టైము కావటంతో చాలావరకు ఆఫీసంతా ఖాళీ అయ్యింది

ధనుంజయం కూడా తన డెస్క్‌లోంచి లంచ్‌బాక్స్ తీసుకొనిరిక్రియేషన్ రూమ్ లోకి వెళ్లాడు

ఆ రోజు కాస్త హెవీ వర్క్ ఉండడంతో మందాకినికి కొంచెం అలసటగా అనిపించింది

టైపు చేసిన కాగితాలు ట్రేలో పడేసి వాష్ బేసిన్ దగ్గరికి వెళ్లి చేతులు శుభ్రం చేసుకొని వచ్చి " ఇవ్వాళ అమ్మ ఏం చేసిందో" అనుకుంటూ లంచ్ బాక్స్ బయటికి తీసింది

అలుగెడ్డకూర పరోటాలు బాగా ఆకలిగా ఉంది పైగా తన కిష్టమైన డిష్ కావటంతో వుత్సాహంగా తినటంలో నిమగ్నం అయ్యింది

తరువాత క్యాంటిన్ నుంచి కాఫీ తెప్పించుకొని తాగింది అప్పటికి పది నిమిషాలు తక్కువ మూడు కావస్తూంది మూడు దాటితే గాని ఎవ్వరూ సీట్లలోకి రారు

బోర్‌గా అనిపించి "ఏవైనా మాగ్జైన్సు వచ్చాయేమో"

అనుకొంటూ సీట్లోంచి లేచింది



# మందాకిని

ఆఫీసుకి వెనక వైపుగా ఉన్న రిక్రియేషన్ రూమ్‌లోకి వెళ్లబోయిన మందాకిని గభాల్న గది తలుపు దగ్గరే ఆగిపోయింది

కారణం

లోపల్నుంచి ధనుంజయంగారూ ఆ నూతన వ్యక్తి సుధాకర్ మాట్లాడుకొంటున్న సంభాషణలు లీలగా వినిపిస్తున్నాయి

వాళ్ల మాటల్లో మందాకిని అన్న తన పేరు వినిపించటంతో లోపలికిపోబోయిందల్లా తలుపుదగ్గర కర్టెన్‌కి కాస్త ఇవతలగానే ఆగిపోయింది సంకోచంతో

లోపల్నుంచి మాటలు మందంగానే అయినా స్పష్టంగా వినిపిస్తున్నాయ్

సుధాకర్ అంటున్నాడు

"అయితే ధనుంజయంగారూ ఆ అమ్మాయి క్యారక్టరు, నడవడి, మంచిదే అంటారా?"

"అవున్నాయనా ! నాకు తెల్సున్నంతవరకు మందాకిని పేరుకి తగ్గట్లే మంచి అమ్మాయి చప్పన తలెత్తి సూటిగా ఎవరి వంకా చూడదు తన పనేమో తనేమో ఎవరితో ఎంతలో ఉండాలో అంతలో ఒద్దికగా నమ్రతగా ఉంటుంది "

" అలాగా"

" అవును మందాకిని ఏ ఇంట్లో అడుగు పెడితే ఆ ఇంటికే గౌరవం తెస్తుంది ఆ అమ్మాయిని చేసుకునేవాడు అదృష్టవంతుడు మీ స్నేహితునికి నా మాటగా చెప్పు ఎలాంటి అనుమానాలు పెట్టుకోకుండా మందాకిన్ని వివాహం చేసుకోమని రోజులు మారాయి ఆడవాళ్లు అన్ని రంగాల్లోనూ ముందంజగా ఉన్నారు అంతమాత్రంచేత వాళ్ల శీలాన్ని శంకించాల్సిన అవసరం లేదు స్త్రీకైనా పురుషుడికైనా మార్పు మానవ సహజం కదా?"

సుధాకర్ చిన్నగా నవ్వి చేతిలో కాఫీ కప్పు కింద పెట్టాడు

"థాంక్స్ ధనుంజయంగారు ! మందాకిని గురించి చాలా వివరంగా చెప్పారు మీరు ఎవరి గురించి అయినా సరే ఏవిధమైన మొహమాటం లేకుండా వున్నది వున్నట్టుగా చెప్తారని మీ బావమరిది ఈశ్వర్ మరీ మరీ చెప్పాడు అందాకా నా ఫ్రెండు మోహన్ పోరుపడలేక మందాకిని గురించి ఆమె ప్రవర్తన గురించి వాకబు చెయ్యటానికి వచ్చాను నిజానికి మా ఫ్రెండు మోహన్‌కి ఉద్యోగం చేసే ఆడవాళ్ళంటే సదభిప్రాయం లేదు పెళ్ళి కాకముందే "అన్ని" అనుభవాలు చవిచూస్తారని, వాళ్ళు చాలా "ఫ్రీబర్డ్స్' అని వాడి నమ్మకం కొంతవరకు వాడి మాటల్లోను నిజాలు లేకపోలేదు అనుకోండి కాని ఏది ఏమైనా మందాకిని మంచి అమ్మాయి, ఆమె ఉద్యోగం కూడా పర్మనెంటు అయ్యిందని అంటున్నారు కదా ?"

"అవునయ్యా సుధాకర్! నాకు తెలుసున్నంత వరకు మందాకిని బంగారంలాంటి పిల్ల కాని నాదో చిన్న అనుమానం "

"ఏమిటి ? చెప్పండి "

"మీ స్నేహితుడు మోహన్ మందాకిన్ని పెళ్ళి చూపులు చూసుకొని వెళ్ళాడంటున్నావు అవునా ?"

"అవును "

"మీ స్నేహితుడికి ఉద్యోగం చేసే ఆడవాళ్ళంటే సదభిప్రాయం లేనప్పుడు సంసారపక్షంగా వుండే ఏ పల్లెటూరి అమ్మాయినో చేసుకోవచ్చు కదా ?"

సుధాకర్ తేలిగ్గా నవ్వాడు

"నిజమే మావాడికి సంసార పక్షంగా వుండే అమ్మాయి అంటేనే ఇష్టం మొన్నటిదాకా మా అందరితోటి ఏ పల్లెటూరికైనా వెళ్ళి తనకి నచ్చిన అమ్మాయిని సెలెక్టు చేసుకుంటాను అనేవాడు కానీ అనుకోనివిధంగా వాళ్ళ కుటుంబ పరిస్థితులు తారుమారు అయ్యాయి హఠాత్తుగా వాళ్ల నాన్నగారు కాలం చెయ్యటంతో ఇంటి పెద్దకొడుకుగా భారం అంతా వీడి భుజాలమీద పడింది మా మోహన్ తరువాత పెళ్ళి కెదిగిన ముగ్గురు ఆడపిల్లలు వున్నారు వీడి పెళ్ళికి వచ్చే కట్నం డబ్బుతో ఒకమ్మాయినైనా అత్తింటికి పంపాలి మిగత ఇద్దరి చెల్లెళ్ళ పెళ్ళి వీడే చెయ్యాలి ఆఖర్న ఇద్దరు మగపిల్లలు కాని బాగా చిన్నవాళ్ళు ఆస్తిపాస్తులు అంటూ ఏమీలేవు వాడి జీతం మీద ఇంత సంసారం జరగాలంటే కష్టం కదా ? అందుకే చితికిపోయిన వాళ్ళ ఆర్థిక పరిస్థితి దృష్ట్యా ఉద్యోగం చేసే అమ్మాయిని చేసుకోవాలని నిర్ణయించుకోక తప్పలేదు ఆ వుద్దేశ్యంతోనే ఈ మందాకిన్ని పెళ్ళి చూపులు చూసుకొందుకు వచ్చాడు అమ్మాయి ఉద్యోగం మంచిది పిల్ల అందంగా వుంది దాంతో ఆమె క్యారక్టరు గురించి అనుమానం పట్టుకుంది ఎలా వాకబు చేశాడో తెలియదు కాని నా కొలీగ్ ఈశ్వరరావు బావమరిది మీరని తెలిసింది ఒక ఆఫీసు కావటంవల్ల మీకైతే ఆ అమ్మాయి మంచిచెడ్డల గురించి బాగా తెలుస్తుంది చుట్టంపక్కం కాదుగనుక మొహమాటం లేకుండా ఆ అమ్మాయి గురించి మీరైతే వున్నది వున్నట్టు చెప్తారన్న తాపత్రయం పట్టుకుంది నన్ను రోజు వెళ్ళిరమ్మని పోరుపెడుతున్నాడు అందువల్ల రెండు రోజులు ఆఫీసుకి శెలవు పెట్టి హైదరాబాద్ రాక తప్పలేదు నాక్కూడా కొంచెం సిటీలో ఏవో పన్లు వున్నాయనుకోండి ఎనీవే థాంక్యు ఫర్ యువర్ కైండ్ కో ఆపరేషన్ మీ టైము పాడుచేసినట్లున్నాను"

సుధాకర్ చిరునవ్వుతో ధనుంజయకి షేక్ హ్యాండ్ ఇచ్చి కుర్చీలోంచి లేచాడు

బయట గుమ్మంవారగా నిల్చున్న మందాకిని మనసు భగ్గున మండినట్లు అయ్యింది సుధాకర్ మాటలు శూలం పోట్లలా మనసుని తాకాయి అంతవరకు అదిమిపట్టిన ఓర్పు సహనం పటాపంచలు అయ్యాయి

పది రోజుల క్రితం తనని పెళ్ళి చూపులు చూసుకుందుకు వచ్చిన మోహన్ రూపం కళ్ళముందు కదిలింది

సంతలో





కట్నానికి బేరాలు ఆడేంది చాలక, తను పనిచేసే ఆఫీసువాళ్ళ దగ్గర, కాబోయే భార్య శీలం గురించి ఆరాలు తీస్తాడా ? అటుకట్నం ఇటు ఉద్యోగం ! ? భార్యంటే డబ్బు సంపాదించే యంత్రం అనుకునే ఇలాంటి ప్రబుద్ధుల్ని చేసుకొంటే నిత్యం అనుమానంతో కాల్చుకుతింటారు బ్రతుకంతా ఏడుపే అయిపోతుంది ఆడదానికి

అలాంటి వెధవ పెళ్ళి చేసుకొనే కంటే మానేస్తే మాత్రం వచ్చిన నష్టం ఏమిటి ?

దెబ్బతిన్న అభిమానంతో మందాకిని గుండె భగ్గుమంది

మొఖమంతా ఎర్రగా నెత్తురు చిమ్మింది

కడుపు మండితే గంగిగోవు కూడా కొమ్ము విసిరినట్లు కర్టెన్ తొలగించుకొని దూకుడుగా గదిలోకి వచ్చింది

ధనుంజయ, సుధాకర్ హఠాత్తుగా తమ మధ్యకి వచ్చిన ఆమెని చూసి కాస్త బెదిరినట్లు అయ్యారు

"అమ్మా మందాకిని ఇతను " తడబాటుని కప్పిపుచ్చుకొంటు ధనుంజయం గారు ఏదో చెప్పబోయాడు

కాని మందాకిని చిరునవ్వుతో అంది

"ఒద్దుసార్ ! మీరేం చెప్పద్దు అంతా విన్నాను" అంటూ దురుసుగా సుధాకర్ కేసి తిరిగి

"ఆఫీసుకి వచ్చి, సభ్యత మరచి పరాయి ఆడపిల్లకేసి ఎగాదిగాచూసే మీరు నా ప్రవర్తన గురించి ఆరాలు తియ్యటానికి వచ్చారా ? నిజంగా నిజానికి ఏ ఆడపిల్ల అయినా దారితప్పినా, ఏదైనా చెడ్డపేరు వచ్చినా అది మీలాంటివాళ్ళవల్లే అవుతుంది మీ స్నేహితుడు మోహన్‌కి చెప్పండి అతను, అతని ప్రవర్తన, అతని మనస్తత్వం నాకు నచ్చలేదు జీవితాంతం పెళ్ళికాకుండానైనా వుంటానుగాని స్త్రీ గురించి అలాంటి నీచమైన అభిప్రాయాలు వున్న ఆ మోహన్ లాంటి వాడ్ని మాత్రం ఈ మందాకిని చస్తే చేసుకోదు అని చెప్పండి

భార్య మాటలకొద్దీ కట్నం తేవాలి ఇంట్లో వెట్టిచాకిరి చెయ్యాలి బయటికి వెళ్ళి ఉద్యోగం చేసి డబ్బు సంపాదించాలి కాని పరాయివాడితో పన్నెత్తి మాట్లాడకూడదు కన్నెత్తి చూడకూడదు ఇలా నిత్యం అనుమానంతో కాల్చుకుతినే భర్తలుపెట్టే బాధలు పడలేక ఎంతోమంది ఆడవాళ్ళు చదువు ఉద్యోగం ఉండికూడా గొంతుకి వురితాడు బిగించుకుంటున్నారు కానీ మందాకిని మాత్రం ఆ లిస్ట్‌లోకి రాదు ఇకపై పొరపాట్న నా గురించి ఆలోచించినా మర్యాద దక్కదని మీ ఫ్రెండుకి చెప్పండి ఫస్ట్ యు గెట్ అవుట్ ఫ్రం హియర్" ఆవేశంతో మండిపడుతూ సుధాకర్ని చెయ్యిపట్టి తోసినంత పని చేసింది

కోపంతో పూనకం పట్టినట్లు వూగుతున్న మందాకినిని చూడగానే వంటినిండా చెమటలు పట్టాయి సుధాకర్‌కి ఇంకాస్సేపు అక్కడే వుంటే ఆ రగడకి పదిమంది పోగవుతారు నిలువునా తన పరువు పోతుంది అన్న భయంతో వేగంగా గదిలోంచి బయటికి వెళ్ళిపొయ్యాడు

కళ్ళ చివర్లనుంచి నెత్తురుచుక్కలు రాలతాయా అన్నట్లు మొఖమంతా ఎర్రగా కంది రౌద్రంగా వున్న మందాకినిని చూసి బిత్తరపొయ్యాడు ధనుంజయంగారు

ఎప్పుడూ వినయంగా ఒద్దిగ్గా వుండి గట్టిగా మాట్లాడటం కూడా చాతకానట్లు వుండే మందాకిని ఒక్కసారిగా భద్రకాళిలా విరుచుకుపడటంతో భయంతో అతనికి నోరు ఎండుకుపోయినట్లు అయ్యింది

అయినా ఏదో నచ్చచెప్పబోతున్నట్లు "అమ్మా మందాకిని నామాట వినుతల్లీ అసలు " అంటూ ఏదో చెప్పబోయాడు

కాని మందాకిని అసహ్యంగా తల విదిల్చింది రోషంతో చెయ్యితిప్పుతూ

"ఒద్దుసార్ ! దయచేసి మీరు నాకేమి చెప్పవద్దు మా నాన్నగారు ఆ మోహన్ ఉద్యోగం మంచిదని, మనిషి అందంగా వున్నాడని ఎలాగైనా ఈ సంబంధం ఖాయం చెయ్యాలని తాపత్రయపడుతున్నారు

ఇవ్వాళో రేపో మధ్యవర్తికి ఉత్తరం రాస్తానని కూడా అంటున్నారు కాని నాకు ఇష్టంలేదని వెంటనే ఆ సంబంధం క్యాన్సిల్ చెయ్యమని ఇప్పుడే చెప్తాను " అంటూ వేగంగా ఫోన్ దగ్గరకి వెళ్ళి తండ్రి ఆఫీసు నంబర్‌కి డయల్ చేసింది

ఏమి చెయ్యలేని నిస్సహాయుడిలా అలాగే మ్రాన్పడిపొయ్యాడు ధనుంజయం ●

"శ్రీ శ్రీ" కథ విందామా?

# జూన్ 15 శ్రీ శ్రీ వర్ధంతి

తెలుగు సాహితీ రంగంలో విప్లవ కవిత్వానికి నాందీ వాక్యం పలికిన మహాకవి శ్రీ శ్రీ ఈయన పూర్తి పేరు శ్రీరంగం శ్రీనివాసరావు శ్రీ శ్రీ 1910వ సంవత్సరం జనవరి 2వ తేదీన విశాఖపట్నంలో శ్రీమతి అప్పల కొండ, శ్రీ వెంకటరమణయ్య దంపతులకు జన్మించారు శ్రీ శ్రీ పుట్టిన రెండేళ్ళకే ఆయన తల్లి మరణించడంతో ఆయన సవతి తల్లిగారైన సుభద్రమ్మ గారి సంరక్షణలోనే పెరిగారు ఆమె కూడా శ్రీ శ్రీ 14వ ఏట మరణించడంతో మాతృ ప్రేమకు దూరమైనారు తన 16వ యేట నుంచి శ్రీ శ్రీ భావకవిత్వం వ్రాయడం ప్రారంభించారు 1925 లో వెంకటరమణమ్మగారితో పెళ్ళయింది 1928లో ఇంటర్మీడియెట్ చదువు పూర్తి చేసి మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో బి ఏ (జువాలజీ)లో చేరారు

అప్పుడే ఆయన పదునారు ఖండికలుగా 'ప్రభవ' కావ్యం వ్రాశారు 1929లో పిక్‌విక్ పేపర్స్ ఆధారంగా 'సోములు చెప్పిన కథ' వ్రాశారు 1930లో శ్రీ శ్రీకి తీవ్రమైన టైఫాయిడ్ జ్వరం రావడంతో 63 రోజుల పాటు మంచం మీదే గడపవలసి వచ్చింది 1931లో బి ఏ డిగ్రీ సంపాదించి ఎ వి ఎన్ కళాశాలలో డిమానిస్ట్రేటర్‌గా చేరారు 1932లో 'కన్యాశుల్కం'లో స్త్రీ పాత్రల గురించి వ్రాశారు ఆ మరుసటి సంవత్సరమే బరంపురంలో జరిగిన సభలకు హాజరయ్యారు

## మహాప్రస్థాన గీతాలాపన

1934లో కాకినాడలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘం సభలో 'మహాప్రస్థానం' గీతాలాపన చేశారు 1936లో మళ్ళీ కాకినాడలో నవ్యసాహిత్య పరిషత్ సభలకు హాజరయ్యారు అదే ఏడాది 'వీణ' పత్రికలో 'శ్రుతులు' అచ్చయింది 1937లో లండన్‌లోని అభ్యుదయ రచయితల మేనిఫెస్టోతో పరిచయం కలిగింది

1938లో మద్రాసు ఆంధ్రప్రభలో సబ్ ఎడిటర్‌గా చేరారు ఆ తర్వాత ఆలిండియా రేడియోలోను, లక్నోలో మిలిటరీ లేబర్ అసిస్టెంటుగా, నిజాం నవాబుగారి ఫార్మ్ సెక్రటేరియెట్‌లోను, ఆనందవాణిలోను వివిధ తరహా ఉద్యోగాలు చేశారు 1946లో సిరిసిరిమువ్వ శతకం, 1947లో చెకోవ్ ఛర్రీ ఆర్చర్డ్స్‌ను సంపెంగ తోట అనువాదం, పురిపండా సోదామినికి ఆంగ్ల అనువాదం గావించారు శ్రీ శ్రీ 1948లో సినీరంగాన ప్రవేశించి 1949లో తొలి తెలుగు డబ్బింగ్ చిత్రం 'ఆహుతి'లో 'హంసవలె ఓ పడవా' అనే పాటను వ్రాశారు ఆ సంవత్సరంలోనే వారి చుట్టాలమ్మాయి 'శెనీనా'ను పెంచుకున్నారు



## మహాప్రస్థానం ముద్రణ

1950లో శ్రీ శ్రీ వ్రాసిన 'మహాప్రస్థానం' ముద్రణ జరిగింది అదే ఏడాది హెచ్ ఎం రెడ్డిగారి రోహిణీ పిక్చర్స్‌లో సంభాషణల రచయితగా చేరి 195'లో 'నిర్దోషి' చిత్రానికి మాటలు, పాటలు రాశారు 1954లో హెల్సింకీలో జరిగిన ప్రపంచ శాంతి మహాసభకు ప్రతినిధిగా రష్యా, పారిస్, లండన్‌లు పర్యటించారు

1955లో 'అ ర సం' అధ్యక్షుడుగా వున్నారు 1956లో ఆయన ఉపద్రష్ట సరోజినిని ద్వితీయ కళత్రంగా చేసుకున్నారు వారికి ముగ్గురు కుమార్తెలు, ఒక కుమారుడు జన్మించారు 1966లో శ్రీ శ్రీ 'ఖడ్గసృష్టి' ప్రచురణ జరిగింది '66లోనే దక్షిణభారత హిందీ ప్రచార సభ, హైదరాబాద్ వారు 'సాహిత్యాచార్య' బిరుదాన్నిచ్చి సత్కరిస్తే, అదే ఏడాది సోవియట్ లాండ్ అవార్డు కూడా వచ్చింది దీనికోసం 1967లో రెండవసారి రష్యా పర్యటన చేశారు 1969లో 'రెక్కవిప్పిన రెవల్యూషన్'ను రచించారు 1970లో సెవెన్‌స్టార్స్ సిండికేట్ సన్మానాన్ని తిరస్కరించారు కూడా 4 7 70న 'విరసం' ఆవిర్భవించింది దానికి అధ్యక్షునిగా ఎన్నికయ్యారు ఆ ఏడాదే విశాఖలో షష్టిపూర్తి మహోత్సవం జరిగింది

1973లో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు కూడా వచ్చింది 1975లో ప్రపంచ తెలుగు మహాసభలలో అరెస్టు అయ్యారు, వెంటనే విడుదలయ్యారు 1976లో విరసం అధ్యక్ష పదవి నుంచి వారిని తొలగించారు

చైనా యాత్ర జరిపారు ఆ తర్వాత విరసం నుంచి సస్పెండయినాక మళ్ళీ ఆ సస్పెన్షన్ రద్దయింది 1979లో 'యమగోల', 'ఎదురీత', 'అల్లూరి సీతారామరాజు' తదితర చిత్రాలకు పాటలు రాయగా 'అల్లూరి సీతారామరాజు' చిత్రంలో 'తెలుగువీర లేవరా' అనే పాటకు జాతీయ అవార్డు కూడా వచ్చింది 79లోనే రాజాలక్ష్మి ఫౌండేషన్ వారి మొదటి అవార్డు (10,000) దక్కించుకున్న ఘనత శ్రీ శ్రీకే దక్కుతుంది 1980లో విరసంకు రాజీనామా ఉపసంహరణ జరగ్గా, కాకినాడలో ఆయన సప్తతిపూర్తి సభ ఏర్పాటు చేశారు 1981లో శ్రీమతితో అమెరికా యాత్ర గావించారు 1983లో ఆయన మరణించడానికి ముందే 'పాడవోయి భారతీయుడా' అనే పుస్తకం అచ్చయింది ఇదే అచ్చయిన ఆయన ఆఖరి పుస్తకం అనుకోవాలి

"పదండి ముందుకు పదండి త్రోసుకు పోదాం పోదాం పైపైకి" అన్న ఆయన 73వ యేట జూన్ 15, 1983న మహాప్రస్థానం గావించారు ఆయన రచనలు శాశ్వతాలు అందుకే "శ్రీ శ్రీ"కి మరణంలేదు!

సేకరణ:

చెన్నాప్రగడసత్యనారాయణశర్మ

Join **Doctor Salt** IODIZED Contest

**Win Prizes Worth**

# Rs. 10,000

**NO ENTRY FEES**

Join **Doctor Salt** IODIZED Contest

ఈ క్రింది ప్రశ్నలకు జవాబు యివ్వండి

1 ఉప్పుసత్యాగ్రహం ప్రారంభించిన భారతీయ నాయుకు డెవరు?

2 భారతదేశపు జాతీయ క్రీడ ఏది?

3 భారతదేశపు అతి ఎత్తయిన పర్వతం ఏది?

4 భారతదేశపు జాతీయ మృగం ఏది?

*Send your entries to*

**DOCTOR SALT CONTEST**
III P Box No 7090 I P H O
New Delhi 110 002

షరతులు నిబంధనలు

1 ఒక కుటుంబం నుంచి ఒకే ఎంట్రీ పంపాలి 2 డ్రా జరిగే తేది, విజేతల పేర్లు పోస్టు/బహిరంగ ప్రకటనల ద్వారా తెలుపుతారు 3 స్వతంత్ర న్యాయ నిర్ణేతల ద్వారా డ్రా అయిన అధికార ఫలితంతో పోల్చిచూస్తారు నిర్ణయానికి కట్టుబడి వుండాలి 4 అడ్వర్టయిజర్ అండ్ అడ్వర్టయిజింగ్ ఏజన్సీల సిబ్బంది, వారి కుటుంబాలు పోటీలలో పాల్గొనడానికి వీలులేదు 5 ఎంట్రీలు పంపించేందుకు చివరి ముగింపు తేది 30 7 89 30 రోజులలోగా ఫలితాన్ని ప్రకటిస్తారు 6 ఢిల్లీ న్యాయవ్యవహారాల పరిధికి మాత్రమే లోబడి వుంటుంది



**1st Prize**
165 Litre
GODREZ
Regrigerator



**2nd Prize**
51 cms
UPTRON
Television



**3rd Prize** 300
Cash prizes Worth Rs 1500/ on receipt of 5/ rupees coupons













**Shaw Chemical Industries Pvt.Ltd.**

# సీరియల్

# శత్రుసంహారం

**లల్లాదేవి**

(గత సంచిక తరువాయి)

**జరిగిన కథ-1** చైనా యుద్ధంలో అసువులు బాసిన పరమ వీర చక్ర అవార్డు గ్రహీత మహేష్‌చంద్ర కొడుకు రాహుల్ వైమానిక దళంలో పైలట్‌గా చేరతాడు ఆకాశ వీధుల్లో విమాన విన్యాసాల అనంతరం కమాండర్ ఇన్ చీఫ్ రాహుల్‌ను మెచ్చుకుంటున్న తరుణంలో అతని తల్లి భార్య యాక్సిడెంట్‌లో చనిపోయారన్న వార్త అందుతుంది వాళ్ళను చూసేందుకు రాహుల్ తన వూరికి బయల్దేరుతాడు

శంకరాభరణం అపార్ట్‌మెంట్స్‌లో అయిదో నంబర్ బ్లాకు! దుఃఖపూరితంగా నిశ్శబ్దంగా వుంది వాతావరణం!

కారులోంచిదిగి లోపలకు పరుగుతీశాడు రాహుల్! అతడు అంత త్వరగా రాగలుగుతాడని ఎవరూ ఊహించలేదు అనుకున్న సమయానికి ముందుగా కన్పించటంతో అందరూ నిశ్చేష్టులయారు

గ్లాస్‌బాక్స్‌లలో ఐస్ క్యూబ్‌లమధ్య పడివున్నాయి రెండు శవాలు! నేరుగా వెళ్ళి ఆ రెండు శవపేటికల మధ్య కుప్పకూలిపోయాడు రాహుల్! చుట్టూచేరి రోదిస్తున్న బంధువుల కంఠస్వరాలు మరింత పెరిగాయి

దుఃఖభారంవల్ల రాహుల్ ముఖం తెల్లగా పాలిపోయింది మామగారు పైకండువాతో కన్నులు తుడుచుకుని అతనిదగ్గరగా వచ్చారు

ఎంతోని విపరీతం జరిగిపోయింది బాబూ! కళకళలాడుతూ వుండాల్సిన యిల్లు శ్మశానంలాగ మారిపోయింది మనసుని స్వాధీనంచేసుకో చాలదూరం ప్రయాణించి వచ్చావు అలసటతో వున్నావు ముందు కాస్త మంచినీళ్ళు త్రాగు అన్నారాయన కన్నులు తుడుచుకుంటూ

అక్కగారి శవందగ్గర కూర్చుని రోదిస్తోంది తన్వి సుషుమ్న ఆమె ఒడిలోనే వుంది అలాగే పాపని ఎత్తుకుని లేచివెళ్ళింది ఫ్రిజ్‌లోంచి వాటర్ బాటిల్‌ని అందుకుని తిరిగివచ్చింది

మంచినీళ్ళు త్రాగు బావా అంది తండ్రి మాటలకి ప్రతిధ్వనిలా

రాహుల్ ముఖాన్ని చేతుల్లో దాచుకుని రోదిస్తున్నాడు ఆమె మాటలు వినిపించాయి కాని తల ఎత్తలేకపోయాడు

ఒకవంక ఎడుగువచ్చి తలమీద పడింది ఇంకా మంచినీరు త్రాగాలనిపిస్తుందా? కాస్సేపు ఆగి యివ్వమ్మా! కడుపులో దుఃఖం కరుడుకట్ట కూడదు అది కన్నీరుగా కరిగి జారిపోవాలి పలకరింపుకోసం వచ్చిన ప్రక్కింటి పెద్దావిడ సలహా యిచ్చింది

తన్వి వెనుదిరిగి వెళ్ళిపోయింది అంతసేపూ ఆ క్రొత్త వ్యక్తిమీదనించి చూపులు మరల్చుకోలేదు సుషుమ్న అతనే తన తండ్రి అయివుండాలని ఊహిస్తోంది కాని ఆ విషయం యింకా తనతో ఎవరూ చెప్పలేదు దిగులుగా చూస్తోంది తండ్రి గురించిన జ్ఞాపకాలేవీ ఆ పసిమనస్సులో లేవు కాని ఎన్ని మనసుతో ఊహిస్తోంది

మమ్మీ చెప్పినట్టే పప్పా చాల అందంగా హాయిగా వున్నారు చాల మంచివారులా కన్పిస్తున్నారే? అనుకుంది రెప్పలు విప్పార్చి అతనివంకే చూస్తోంది దగ్గరకు పోవాలంటే చయమనిపిస్తోంది

మామగారు వచ్చి అల్లుడి బుజం పట్టుకున్నారు

మనసుని కుదుటపర్చుకో బాబూ! జరగవలసింది చాలవుంది పోయినవాళ్ళు అదృష్టవంతులు అనుకోవాలి మన తతంగం మనం చేయాలికదా అన్నారాయన కంఠస్వరం గదదంగా వుంది కళ్ళు నీళ్ళు నిండివున్నాయి

చివరిసారిగా తల్లి పాదాలవంకా భార్య ముఖంవంకా చూచి లేచాడు మామగారు అతన్ని పట్టుకుని మేడమిది గదిలోకి తీసుకుపోయారు చిన్ననాటి స్నేహితుడు చెన్నకేశవుడువచ్చి ప్రక్కనే కూర్చున్నాడు

ఊరుకో రాహుల్! యిలాంటివి జరిగినప్పుడు ఎవరూ బాధపడకుండా వుండలేరు కాని ఎంతసేపని యిలా వుంటావు? అన్నాడు

రాహుల్ కోసమే రెండు రోజులుగా పనులన్నీ ఆపించారు అతను వచ్చి చూచుకోవటం పూర్తి అవగానే పనులు చకచకా ప్రారంభించారు అందరితో పాటు రాహుల్ కూడ నడిచివెళ్ళాడు

రెండు చితులకు ఒకేసారి నిప్పు అంటించాడు

అతని గుండెలు మండుతున్నాయి

రాహుల్ రెండు కళ్ళలో రెండు రూపాలు కనిపిస్తున్నాయి

బాబూ! నిన్ను కన్నతల్లిని నేను అయితే మనందరిని కన్నతల్లి ఈ మాతృభూమి! దీనికోసం నువ్వు చేయగలిగినదంతా చేయాలి అని ప్రబోధించే వీరమాత జిజియాబాయి లాంటి తల్లి ఒక కన్ను!

మీ కోసం నేను ఎన్ని సంవత్సరాలయినా ఎదురుచూస్తాను మన పాపాయి సుషుమ్న నా ఒడిలో వున్నంతసేపూ మీరే నాదగ్గర వున్నట్టుగా అనుభవం కలుగుతుంది నాకు మీ సుఖ సంతోషాలకోసం రోజూ దైవాన్ని ప్రార్థిస్తాను అంటూ వీడ్కోలు యిచ్చి సాగనంపిన భార్య రెండో కన్ను!

ఇప్పుడు రెండు కళ్ళూ పోయాయి బ్రతుకు అంధకారమయింది పొగిలి పొగిలి ఏడుస్తూ మళ్ళీ కుప్పకూలిపోయాడు

చెన్నకేశవుడు వచ్చి చేయి పుచ్చుకున్నాడు లేవక తప్పలేదు ఇంటికి తిరిగివచ్చి స్నానం వగైరా ముగించాక కూడా విడిచిపెట్టకుండా పై గదిలోకి వచ్చాడు బాల్యస్నేహం మధురమయినది అంతస్థుల తేడావుంది రాహుల్ పైలెట్ ఆఫీసర్!

చెన్నకేశవుడు ఓ చిన్న పాన్‌షాపు నడుపుకుంటున్నాడు అయినా ఆత్మీయతా ఎందానికి అంతస్థులు అడ్డురాలేదు

ప్రక్కనే కూర్చుని మెల్లమెల్లగా మాటల్లోకి దింపుతున్నాడు చిలకల పందిరిలా వుండాల్సిన యిల్లు యిప్పుడు శ్మశాన భీకరంగా అయింది అయినా చెన్నకేశవుడి మాటలు కొంత ఊరట

కలిగి వున్నాయి

విమానానికి ఎన్ని వాకిళ్ళు వుంటాయి? గాలిలో ఎగురుతున్నప్పుడు కళ్ళు తిరగవా? విమానం పోతున్నప్పుడు క్రింది మనుషులు కూడా కన్పిస్తారా? యిలాంటి అమాయకమయిన ప్రశ్నలు అడుగుతున్నాడు

చాలసేపు అతని మాటలు విన్న తరువాత మొదటిసారిగా నవ్వు వచ్చింది

ఇప్పుడు నువ్వేం చేస్తున్నావు? అని అడిగాడు రాహుల్

మొదట లాయర్ అవుదామనుకున్నాను అబద్ధాలాడటం వృత్తిగా ఎంచుకున్నప్పుడు రాజకీయాల్లో చేరి న్యాయశాఖ మంత్రి ఎందుకు కాకూడదు అనిపించింది ఒక ఎలక్షన్లో తిరిగాను పరీక్షపోయింది

లక్షరూపాయల పెట్టుబడితో ప్యాన్సీ అండ్ గిఫ్ట్స్ పెట్టాను మున్సిపల్ ఎలక్షన్లు వచ్చాయి మళ్ళీ రంగంలోకి దిగాను ఎలక్షనూపోయింది ప్యాన్సీలో పెట్టిన పెట్టుబడీ పోయింది

ఏం చెయ్యాలా అని ఆలోచిస్తుండగా నా అదృష్టవశాత్తూ మా మేనత్త చచ్చిపోయింది ఆమెకు పిల్లలు లేరు ఓ యాభైవేలు వచ్చాయి ముప్పైవేలు గుడ్విల్ యిచ్చి పాన్షాపు తీసుకున్నాను





కబేళా వుందికదా! దాని ప్రక్కనే నా పాన్‌షాపు.

"మళ్ళీ ఎలక్షన్లు రాకపోతే యిప్పట్లో నా కే ఢోకా లేదు" అన్నాడు చెన్ను.

రాహుల్ పెదవులమీదికి చిరునవ్వు వచ్చింది.

చెన్ను గాలిపటంలా వెలుపలకు పరుగుతీశాడు.

తన్వి, అమె తండ్రి మెట్ల దగ్గర నిలబడి మాటాడుకుంటున్నారు.

"రాహుల్ మాటాడాడు. చిరునవ్వు కూడా నవ్వాడు" అంటూ వార్త అందించాడు.

ఆ మాట విని వంటగదిలోకి వెళ్ళిపోయింది తన్వి. రెండు నిముషాల్లో కాఫీ కలుపుకుని పైకి వెళ్ళింది.

అమె పైటకొంగు పట్టుకుని వెంటనడిచింది సుషుమ్న.

"బావా! కాఫీ తీసుకువచ్చాను" విండో గ్లాసెస్ లోంచి వెలుపలకు చూస్తున్న రాహుల్ తల త్రిప్పి చూచాడు.

"నువ్వు వచ్చాక మంచినీళ్ళయినా త్రాగలేదు" అందామె. రాహుల్ ఓ నిట్టూర్పు విడిచి సోఫాలో కూర్చున్నాడు. కాఫీకప్పు అందించింది.

సిప్‌చేసి మోల్డామీద పెట్టేశాడు.

"ప్రయాణమయిపోతూ ముందుగా మంచినీళ్ళు తాగాలంటారు. త్రాగి వెళ్ళండి" అంటూ చివరిసారిగా తనూజ మంచినీళ్ళు యివ్వటం అతని మనోపథంలో తళుక్కుమని మెరిసింది.

ఆ ప్రేమ, అప్యాయత యింక ఈ జీవితానికి లేవు. ఈ జీవితం యికనించి ఒంటరి ఎడారి! డిజర్టెడ్! ఎటు చూచినా శూన్యమే.

మళ్ళీ రెప్పలు తడిశాయి. మనసులో మంటలు కన్నీరుగా మారి జారుతున్నాయి. తన్వి చీరకుచ్చిళ్ళలో ఒదిగిపోయి ముఖం మాత్రమే బయటపెట్టి అతనివంక చిత్రంగా చూస్తోంది సుషుమ్న. 'పప్పా యింకా పలకరించరేం? మమ్మీ చాల మంచివారని చెప్తూవుండేవారుకదా!' అనుకుంది. ఆ చిన్నారి మనోలోకంలో చిత్రమయిన ఆసక్తి! విచిత్రమయిన అనుమానాలు! అతని చెంపలు తడవటంచూచి ఆ కోమల హృదయం కలతపడింది.

"పపా! మీరు ఏడవకండి ప్లీజ్! ఏడవకండేం" అంటూ సుకుమారమయిన చిన్ని అరిచేతులతో అతని రెప్పల్ని తాకింది.

రాహుల్ శరీరం ఒక్కసారి ఝల్లుమంది. ఆ చిన్నారి స్పర్శ ఆలపించిన రక్తబంధాల వేణుగానం హృదయాన్ని తట్టి నిద్రలేపింది. జన్మజన్మల మమతా బంధాలకు వైతాళిక గీతం పాడింది ఆ లేత చేతి స్పర్శ!

శ్మశాన వైరాగ్యంతో బీటలువారిన ఎడారి గుండెల్లో వాత్సల్య జలనిధులు ఉవ్వెత్తున పొంగాయి. ప్రేమానురాగాల అమృతసింధువులు ఉజ్వలంగా వురికి గుండె గోడల్ని ఆర్ద్రపరిచినాయి.

"స్వీటీ! కమాన్" అంటూ ఆర్తితో రెండుచేతులు చాచి పిలిచాడు రాహుల్!

ఇంకా పూర్తిగా తీరని భయం! క్షణం సంశయించి నిలిచిపోయింది.

"వెళ్ళు బేబీ! పిలుస్తున్నారు వెళ్ళు" ప్రోత్సహించింది తన్వి.

సాగర సంగమానికి పరుగెత్తే స్రవంతిలా ఒక్కవుదుటున వెళ్ళి తండ్రి ఒడిలో వాలిపోయింది సుషుమ్న! బావురుమని ఏడ్చి కావిలించుకుంది గట్టిగా! లేత గుండెల్లో నిండివున్న బరువంతా ఒక్కసారి కరిగి కన్నీరై జారింది. గులాబి రేకుల్లాంటి సుకుమారమయిన చెంపల్ని చేతులతో అవి కన్నీరు తుడిచాడు రాహుల్! ఆ లేత చెంపలకు పెదవు లానించాడు.

"స్వీటీ! ఏడవకూడదమ్మా! నేను వున్నాను కదా!" అన్నాడు.

"మీరు నాతో నే వుండిపోతారా పపా?"

"అవునమ్మా! నీ చేతుల్లో నే పండిపోతాను."

"మమ్మీని తీసుకువస్తారా?"

"నీకు మంచిమంచి బొమ్మలు తెచ్చియిస్తాను."

"నాకు డాల్స్ వొద్దుపా! మమ్మీ కావాలి. గ్రానీ కావాలి."

"అరుగో అక్కడున్నారు" అంటూ గోడమీది ఫొటో వంక చూపించాడు.

"ఇంకెప్పుడు అలాగే వుంటారా? ఇదివరకట్లా నిజంగా వుండరా?"

"నిజమనేది ఈ సృష్టిలో ఎక్కడా వుండదు స్వీటీ! శాశ్వతమయిన ధర్మాన్ని కూడ ఆయువు తీరాక కాలపురుషుడే కబళిస్తాడు."

"బావా! బేబీ బేజారెత్తిపోయివుంది. అంత పెద్ద మాటలని మరింత కలవరపరచకు" అంది తన్వి! వారిద్దరిమధ్య పొంగిన రక్తబంధం చూచి ఆమె గుండెలు కోతపడుతున్నాయి.

ఒక కన్ను గోదావరి! ఒక కన్ను కృష్ణవేణిగా మారుతున్నాయి.

"పా! అయితే మమ్మీ, గ్రాని తిరిగిరారా?"

"రారమ్మా! ఎన్నటికి తిరిగిరాని అమృత లోకానికి వెళ్ళిపోయారు."

"మీరు కూడ బెంగుళూరు వెళ్ళిపోకండి."

"నిన్ను విడిచి నేను ఎక్కడికి వెళ్ళనమ్మా."

"అలా అయితే యిది మీకు నా ప్రజంటేషన్" అంటూ లేత పెదవులతో అతని చెంపల్ని తాకింది సుషుమ్న.

"ఈ ఒక్కటి చాలదమ్మా!" తమకంతో అన్నాడు రాహుల్.

"అయితే యిది కూడ తీసుకోండి" అంటూ చేతుల్లో దాచివుంచిన ఓ విచిత్ర వస్తువుని అతనికి అందించింది సుషుమ్న.

అది ఆమె దగ్గర వుండటంచూచి అమిత ఆశ్చర్య పడిపోయాడు రాహుల్! కారవెల్లీ ఫ్లయిట్ క్రూలో అమర్చే చిన్న ఎలక్ట్రానిక్ పరికరం అది. సాధారణంగా వెలుపల ఎక్కడా వుండటానికి వీలులేనిది! ఇండికేటర్!

అదివుంటే కారవెల్లీలో 'క్రూ బాక్స్'లో అమర్చివుండాలి. రిపేరు వస్తే పెద్దపెద్ద ఎయిర్‌లైన్స్ కంపెనీలలో ఛీఫ్ ఇంజనీర్ల దళం పర్యవేక్షణలో ఏ.సి. చేయబడిన గదిలో వుండాలి. ఫైబర్‌గ్లాసు టేబిల్‌మీద గాజుకుప్పెల కవరింగ్‌ల క్రింద వుంచి ఎలక్ట్రానిక్ మైక్రోస్కోప్‌లతో దాన్ని కొంతమంది ఛీఫ్ ఇంజనీర్లు పరిశీలించి రిపేర్ చెయ్యాలి!

అంత అపురూపమయిన ఖరీదయిన చిన్న ఎలక్ట్రానిక్ పరికరం అది.

## మేనకగా మీనాక్షి శేషాద్రి!

శ్రీ ఎన్. టి. ఆర్. స్వయంగా దర్శకత్వం వహిస్తూ నటిస్తున్న "బ్రహ్మర్షి విశ్వామిత్ర"లో మేనక ఎవరన్న విషయమై యిన్నాళ్ళుగా వున్న సస్పెన్స్ వీడిపోయింది అంటున్నారు. ఆ పాత్ర ఎట్టకేలకు, హిందీనటి మీనాక్షిశేషాద్రికి దక్కిందట! అంతకుముందు ఆ పాత్ర కోసం మరో హిందీనటి మందాకిని, తెలుగు నటి భానుప్రియ ఆరాటపడ్డారు. నెంబర్ వన్ హీరోయిన్‌గా వెలుగొందుతున్న శ్రీదేవిని ఈ పాత్ర వరిస్తుందని యిటీవల ప్రచారం కూడా జరిగింది. కాని ఏమనుకున్నారో ఏమో... మీనాక్షిని ఎంపిక చేశారు. హిందీ భాషలో కూడా మీనాక్షిశేషాద్రి నటిస్తోందట. "ఈ దెబ్బతో విశ్వామిత్రుడు (ఎన్. టి. ఆర్.) చేతిలో వున్న ఈ మేనక (మీనాక్షి) మతి తిరిగినట్లే" అంటున్నారు చిత్రరంగ ప్రముఖులు మరి!

దానివిలువ రెండు లక్షలు వుంటుంది

కాని అది హఠాత్తుగా పనిచేయడం మానివేస్తే కొన్ని కోట్లు నష్టపరుస్తుంది ఫ్లయింగ్‌లో వుండగా అది చెడిపోతే యించుమించు ఆ ఎయిర్ లైన్స్ కంపెనీ చాలా కోట్లు నష్టపడి జాతీయస్థాయి కేసుల్లో యిరుక్కుని దివాళా తీస్తుంది అలాంటి వస్తువు అది

సుషుమ్న దగ్గర అది వుండటంచూచి నివ్వెర పడిపోయాడు

స్వీటీ! ఇది నీకు ఎవరిచ్చారమ్మా?

ఎవరూ యివ్వలేదు పా! నేనే తెచ్చుకున్నాను

ఎక్కడ తెచ్చుకున్నావు? కంగారుగా అడిగాడు

అక్కడ అక్కడ మరే అక్కడ! అంటూ జావురుమంది బేబీ

గుండెలకు హత్తుకున్నాడు ఓదార్చాడు

ఎక్కడ తెచ్చావు స్వీటీ? నాతో చెప్పవూ? ప్లీజ్ ఆపేసిన ఏడుపుని మళ్ళీ ప్రారంభించబోతున్నట్టుగా బేబీ పెదవులు విచ్చుకుని చిత్రమయిన వొంపులు తిరుగుతున్నాయి

కళ్ళు మరింత పెద్దవి అయిపోయి నొసలు విరిగి ముఖంలో ఏడుపు కన్పించింది ఇక రాగాన్ని అందుకోవటమే తరువాయి

వొద్దులే! వొద్దులే! చెప్పొద్దులే అన్నాడు కంగారుగా మళ్ళీ పాపాయిని ఎత్తి గుండెలకు హత్తుకుంటూ

ఏడుపు ఆగిపోయింది తుఫాన్‌ని సూచించే ఆకాశంలా వున్న మబ్బు ముఖం మళ్ళీ మామూలుగా అయింది కాని అతను అడిగిన ప్రశ్నకు సమాధానం మాత్రం రాలేదు

బావా! ఆ రోజునించి బేబి ఆ వస్తువుని విడిచి పెట్టకుండా పట్టుకుంది ఎవరు అడిగినా యివ్వలేదు ఏదో ఎలక్ట్రానిక్ పరికరంలా వుంది పాడయితే గిరవాటు పెట్టివుంటారు బేబి అది ఆట వస్తువు అనుకుని అపురూపంగా చూచుకొంటోంది

అది యిమ్మంటే ఏడుపుముఖం పెడుతోంది యిప్పటిలాగే! అంటూ దాని వివరాలు తెలియ చేసింది తన్వి

బేబీ ఈ వస్తువుని ఎక్కడ తెచ్చిందో మీ కయినా తెలుసా?

ఎవరికీ తెలియదు అక్కకు అత్తయ్యకు తెలిసివుండాలి

బేబి! ఇది నీకు మమ్మి యిచ్చిందా? మళ్ళీ అడిగాడు

ఇవ్వలేదు

గ్రానీ యిచ్చిందా స్వీటీ? బుజ్జగించాడు

లేదు పా! గ్రానీ యివ్వలేదు నేనే తెచ్చాను

ఎక్కడతెచ్చావమ్మా? లాలించాడు మళ్ళీ నొసలు విరిచి పెదవులు వొంపుగా పెట్టి తు పాన్ రాకని సూచించేలా ముఖం మార్చి సిద్ధంగా వుంది సుషుమ్న




పాఠకులకో సవాల్!

# టిట్ ఫర్ టాట్



## పిల్ల నచ్చిందిగా ముహూర్తాలు చూద్దామా?

ఇది ఓ వాగ్బాణం అనుకోండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి— ఆ రిపార్టీ గుచ్చుకోవాలేగాని బాధించకూడదు రసభరితంగా వుండాలేగాని అశ్లీలం కొట్టవచ్చినట్లుండరాదు కార్డు మీద మాత్రం రాయాలి ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి మీ పూర్తి చిరునామా ముఖ్యం ప్రచురించిన రెంటికీ రు 25 రు 15 చొప్పున బహుమతి వుంటుంది!— ఈ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం

**21 6 89 లోగా అందేలాగా రిపార్టీలు పంపించాలి!** —సం

చాలా మంది వెంటనే రిపార్టీల వర్షం కురిపించారు కొన్ని మాత్రం ఎంపిక చేసి వేస్తున్నాం బహుమతులు పొందిన రెండూకాక— మరికొన్ని యిక్కడ వేశాము తతిమ్మా వారి వాగ్బాణాలు స్థలాభావం చేత వేయలేకపోయాం లాటరీ తీసి కొందరి పేరు మాత్రం వేస్తున్నాం! ఒకసారి బహుమతి రాలేదని నిరుత్సాహ పడక మళ్ళా ప్రయత్నించండి!

**‘ బ్లాక్ మార్కెట్ వుంటేనే కదా ఎలక్షన్‌లకి మద్దతు!**

★ రు 25 బహుమతి పొందిన రిపార్టీ

**“బ్లాక్ మనీతోనేగా వోట్లు బ్యాలట్ బాక్స్‌లో పడుతున్నాయ్!”** —కె శ్రీనివాసరావు (రామచంద్రపురం)

★ రు 15 బహుమతి పొందిన రిపార్టీ

**“ఓటు మార్కెట్ బ్యాక్‌గ్రవుండ్ అదేగా! మరి!”**

—మహర్షి (కొత్తగూడెం)

### మరికొన్ని వాగ్బాణాలు

జనాల్ని బ్లాక్ చేయగలిగితే ఏ మార్కెట్ అక్కరలేదు!

—ఎ వి రవికుమార్ (రాజమండ్రి)

ఎలక్షన్ల ముందు జరిగే సెలక్షన్లకి ఆ తర్వాత జరిగే కలెక్షన్లకి బ్లాక్ మార్కెట్ వుంటేనే మద్దతు మరి!

—ఎం స్వయంప్రభ (రాజమండ్రి)

బ్లాక్ మనీతో నాయకులు చేయాలి గదా వోట్లను కొనే కసరత్తు!

—కొమ్మినేని శ్రీనివాసరావు (గుంటూరు)

### లక్కీ పేర్లు

బి యాదవ్ (కొత్తవాడ) టి రవిందర్‌రెడ్డి (వరంగల్) కె లీలా వెంకటేశ్వరరావు (రామచంద్రపురం) జె ఉమామహేశ్వరరావు (పాలకొల్లు) ఎహెచ్ ప్రకాష్ (విజయవాడ) బి రమేష్‌బాబు (ఖమ్మం) వి వెంకటేశ్వరరావు (కూరాడ) డి యోగానంద్ (నూజివీడు) ఆర్ పద్మనాభన్ (నెల్లూరు) కె పానకాలరావు (గణపవరం) జి విరత్ (మచిలీపట్నం) ఎస్ ఆర్ కోటేశ్వరరావు (వినికేపాడు) విద్యాశ్రీ (గుళ్ళపల్లి) కంకటి శంకర్‌రావు (సర్పూర్ కాగజ్‌నగర్) ఎహెచ్ నాగేశ్వరరావు (సికిందరాబాద్)



### తనయుడు అదృశ్యం– తల్లి ఆవేదన

తన నాలుగో ఏటి నుంచి వేదాలు బగవద్గీత వంటివి పారాయణం చేసిన సంజీవవర్మ అనే కుర్రాడిని ఎవరో ఎత్తుకు పోయారని అతని తల్లి శ్రీమతి రామపతి కోర్టుకు పిర్యాదు చేశారట తన కొడుకు సంస్కృతం హిందీ ఇంగ్లీషు బాషలలో ప్రజ్ఞుడని మతపరమైన వేదసమ్మతమైన ప్రచారాలు వూరూరా చేసేవాడని అతనిని ఎవరో దుర్బుద్ధితో ఎత్తుకు పోయారని ఆవిడ ఆరోపించారట

### కాన్సర్‌కి హేతువు పొగాకు!

కాన్సరు రోగానికి పొగాకు ఉపయోగించడానికి దగ్గర సంబందాలున్నాయని పొగాకు వుపయోగించడం మానితే కాన్సరు వంటి రోగాలు రావనీ కిద్వాయ్ వైద్య విజ్ఞానులు గగ్గోలు పెట్టేస్తున్నారట

### లంబోదరులకో హెచ్చరిక

పోలీసు వుద్యోగాల్లో వున్నవారు తమ పొట్టలను అదుపుల్లో పెట్టుకోవాలని పాకిస్తాన్ ఫెడరల్ ఇంటీరియర్ మంత్రి అయిత్‌జాజ్ అన్నారట నిండు చూలాలులా బాన కడుపులతో మూర్తీబవించిన బద్ధకంలా వున్న పోలీసువారికి పోలీసు శాఖలో స్థానం లేదని ఆయన విశదం చేశారట వోవారం లోగా బాన కడుపులవారు తమ నడుం 34




అంగుళాల సైజుకు తగ్గించుకోకపోతే వుద్యోగమే పోతుందన్నారటాయన దటీజ్ రైట్

### చంటిపిల్లలకు చక్కని కానుక!

చంటిపిల్లలు రాత్రుళ్ళు ఏడ్చేటప్పుడు తల్లి తన గుండె మీద పడుకోబెట్టుకుంటే వారు నిద్రపోతారు అనీ పంఎల్లలకు తమ తల్లి గుండె కొట్టుకోవడం వినిపించడంతో వో రకం సంతృప్తి వచ్చి నిద్ర వచ్చేస్తుందట బ్రిటన్‌కు చెందిన సుందర్‌లాండ్ జనరల్ ఆసుపత్రికి చెందిన బ్రైడ్‌రైట్ అనే అతను బేబీమషా అనే చిన్న ఎలక్ట్రానిక్ పరికరాన్ని తయారుచేసి దానిలో తల్లి గుండె కొట్టుకోవడం గ్రహించి అదే విదంగా శబ్దాన్ని గ్రహించుకునేలా చేశాడట ఆ పరికరాన్ని ఏడ్చే పిల్లాడి పక్కన పెడితే ఆ ఎల్లాడు వెంఎనే ఏడ్పు మాని నిద్రలోకి పోయాడట ఈ ఎరికరాన్ని యిలా చాలామంది ఎల్లల వద్ద పరీక్షించి చివరికి యిది చక్కని వైద్యంగా వైద్యులు నిర్ణయించారట– వోర్నీ! ●

మళ్ళీ ఎవరైనా దానిగురించి అడిగితే ఏడ్చేసేలావుంది

లావంతేదు బావా! చాల ఋజ్జగించి చూచాను బ్రతిమాలి అడిగాను ఇదే వరస! బహుశా ఆ చోటు ఏదో తెలియని చోటునించి తీసుకువచ్చింది దీన్ని ఏడుపుకి అదే కారణం అయివుండాలి

అలాంటి చోటుకి బేబీని ఎవరు తీసుకు పోయారు?

ఆ బయంకర సంఘటన జరిగిన చోటునించి తెచ్చివుంటుంది దాని గురించి అడగగానే ఆ దృశ్యాలు లేత మనస్సును కలిచివేస్తున్నాయి అందుకే ఆ విషయం గుర్తుచేయగానే ఏడుస్తోంది

బయంకరమయిన సంఘటన జరిగిందా? ఎమిటది? అతని చూపులు తన్వి కనురెప్పలమీద గ్రుచ్చుకుంటున్నాయి

నీకు అంతా చెప్పాలికద బావా! రాగానే ఎందుకు అని ఊరుకున్నాం నీవు కలతపడతావని నాన్నగారే చెప్పవద్దు అన్నారు అక్క అత్తయ్య మామూలు యాక్సిడెంట్‌లో చనిపోలేదు

...గారు ఒక చోట శవాలు మరొకచోట దొరికాయి ...గారు బాంబువల్ల ప్రేలిపోయినా శవాలు అంత దూరం వెళ్ళిపడే అవకాశం లేదని పోలీసులు ...యుతున్నారు అంది తన్వి దిగులుగా

రాహుల్ కాళ్ళక్రింద భూమి తొలుచుకు పోయినట్లుగా అయింది మీదినించి ఆకాశం విరిగిపడినట్లుగా అనిపించింది సాదారణమయిన యాక్సిడెంట్‌లో కాకుండా ఏదో తెలియని కారణంవల్ల అమ్మ చనిపోయిందని బార్య ప్రాణాలు కోల్పోయిందని వినగానే నిలువెల్లా వొణికిపోయాడు అతని వైఖరి గమనించింది మాటలు ఆపేసింది తన్వి

అందరికి బాధగానే వుంది బావా! కాని అంతగా ఎక్సయిట్ అవకు నీకు చెప్పవలసిన సంగతులు చాల వున్నాయి అందామె

క్షణక్షణం అతని శరీరం భూమిలోకి కృంగిపోతున్నట్లుగా అనిపించింది జీవిత సర్వస్వమంతా చేజారిపోయింది సుఖ సంతోషాలను నింపుకోవాలనుకున్న అమృతబాండం లాంటి జీవితం బ్రద్దలైపోయింది

అందుకు కారణం విదాత అనుకుంటే అదొక ఓదార్పు! ఒకవేళ అందుకు కారణం వేరే మనుషులు అయితే!?

అత ) మనోమయలోకంలో ఆలోచనల అగ్నిశిలలు పేరిల్చిన బ్రద్దలవుతున్నాయి దిగ్దిగంతాలవరకు ఆత్మ సంవేదన పరుచుకు పోతూంది జీవితం నాటకమే అనుకున్నవాడు మేదావి!

సుఖ దుఃఖాలు క్రీడ అనుకున్నవాడు తాత్వికుడు!

కాని వంచన అనేది క్షమార్హంకాదు వంచించబడటం అనేది నాటకమూకాదు క్రీడా కాదు గుండెలను మండించే ఒక వాస్తవం అవుతుంది! పెచ్చని ఒడిలో బరువుగ రెప్పలు వాల్చుతోంది చిన్నారి సుషమ్మ! ఆమెను బుజానవేసుకుని బెడ్‌మీద పడుకోపెట్టి తిరిగివచ్చింది తన్వి సోఫాలో అతని ప్రక్కనే కూర్చుంది

ఏం జరిగిందో వివరంగా చెప్పు అని అడిగాడు రాహుల్! ఆ సంఘటన గురించి వినాలన్న ఆదుర్దాని అణుచుకోలేక క్షణంలో బరెస్ట్ అయ్యాడు

మూడు రోజుల క్రితం నీ పెళ్ళిరోజు కదా! ఉదయం ఆరు గంటలకే అక్కను పలకరించేందుకు వచ్చాను నిద్రలేస్తూనే కన్నీరు పెట్టుకుంది సుషమ్మని ఒడిలో కూర్చోపెట్టుకుని ఏడుస్తోంది

అసలు మీరు పెళ్ళిఅయాక యింటిదగ్గర ఎప్పుడున్నారు? అక్క కాపురానికి వచ్చాక రెండు వారాలకు తేజ్‌పూర్ వెళ్ళిపోయారు పాపాయి

పుట్టించని టెలిగ్రామ్ యిస్తే శుభాకాంక్షలు పంపించారు

పాపకు సంవత్సరం నిండాక బెంగుళూర్ వెడుతూ వచ్చారు అంతేకదా' రెండేళ్ళయింది మళ్ళీ తిరిగిరాలేదు

మిరు లేకుండా పెళ్ళిరోజు జరుపుకోవడం ఎంతో బాదనిపించి దిగులుగా కూర్చుని వుంది అక్క! నిద్రపోయే సుషుమ్న ఎందుకో ఉలిక్కిపడుతోంది

బావా నాకూ బాదనిపించింది అక్కను ఓదార్చాను

అంత వీరుడు బర్త అయినందుకు గర్వపడాలి కాని దిగులు పడకూడదు అని ఎంతగానో చెప్పాను చాలసేపటి తర్వాత పాపాయిని నాకు అప్పగించి వెళ్ళి తలంటు చేసవచ్చింది అక్క!

ఈలోగా కనకం అత్తయ్య నీ గురించి నూరుసార్లయినా అనుకుంది నిద్రలేచిన సుషుమ్నకి నేనే తలస్నానం చేయించాలి గుడికివెళ్ళి పూజలు జరిపించేందుకు బయ ుదేరింది అక్క!

అత్తగారు కూడ వారివెంట అలయానికి వెళ్ళేందుకు సిద్ధమయ్యారు అసలిదంతా ఎలా జరిగిందో! కారు యాక్సిడెంట్ జరిగింది అక్క అత్తయ్య చనిపోయారు యాక్సిడెంట్ జరిగిన చోటునించి శవాలు దూరంగా పడివున్నాయి ఇది అసాదారణమయిన సంఘటన అంటున్నారు

వెంటనే తెలిసింది పరుగులుతీశాం సుషుమ్న కూడ కన్పించలేదుబావా! బాగా కంగారు పడిపోయాం పోలీసురిపోర్టు యిచ్చి వూరంతా గాలించాం నాన్నగారు ఓ వైపు వెళ్ళారు

నేను మరోవైపు వెళ్ళాను చాలసేపు తిరిగి ఆశలు వొదులుకున్నాను తిరిగి వద్దామనుకుంటూ వుండగా ఓ చిన్న కుర్రాడు కని)ంచి చెప్పాడు మీరు చెప్పేరంగు ఫ్రాక్ వేసుకున్న అమ్మాయి లకడీకాపూల్ దగ్గర ఓ టీదుకాణం దగ్గరుందని

అతన్ని వెంట తసుకుని నేను పరుగెత్తాను

ఓ చౌ కరకం బన్‌రొట్టిలు అమ్మే టీ దుకాణం దగ్గర కూర్చునివుంది పాప! ఎడుస్తోంది చుట్టూ వున్నవారు ఓదార్చేందుకు ప్రయత్నిస్తున్నా రు రాయ్‌నాడ్ చౌరస్తాకు కిలోమీటరు దూరంలో యాక్సిడెంట్!

పాప ఎలా యిక్కడికి వచ్చిందో అర్థం కాలేదు

బన్‌రొట్టిలు యిచ్చారు పాలు చల్లార్చి యిచ్చారు ప్రక్కనున్న పండ్ల షాపునించి ద్రాక్షపళ్ళు తెచ్చియిచ్చారు సుషుమ్న అవేవీ అంటుకోలేదు ఫ్రాక్‌మీద రక్తపుమరకలున్నాయి

అంటే! యాక్సిడెంట్ జరిగినప్పుడు కారులో నే వుండివుండాలికదా! మరి యింతదూరం ఎలా వచ్చింది? అర్థంకాలేదు

కాని అప్పుడు నాకు ఆలోచించే శక్తిలేదు ఒకవంక శవాలు మరోవంక పోలీసులు పాప కన్పించింది యింతేచాలని ఎత్తుకుని గుండెలకు హత్తుకున్నాను

మీరు ఎవరు అని ప్రశ్నించాడు టీ స్టాల్ యజమాని ఈ పాప మీ పాపే అంటానికి గుర్తు ఎమిటి అని అడిగాడు రకరకాల ప్రశ్నలతో వేదించాడు పోలీసురిపోర్టు యిస్తా నన్నాడు

అతనికి రెండు వందలు యిచ్చి వదిలించుకున్నాను

పరాయివాళ్ళయితే ఈ పాప కోసం డబ్బు ఎందుకు ఖర్చుపెడతారు? మి పాపే అయివుంటుంది తీసుకుపొండి అన్నాడు

ఎలాగో వొదిలించుకుని పాపను తీసుకువచ్చాను కాని ఆ దుఃఖంతో యింటికి పోవాలన్న తొందరలో గమనించలేదు బావా!

ఇంటికి వచ్చాక చూచాను తరువాత ఆలోచిస్తే జ్ఞాపకంవచ్చింది నాకు కన్పించే సమయానికే పాప చేతిలో ఈ విచిత్ర వస్తువు వుంది గట్టిగా పట్టుకుంది దాన్ని

బుజ్జగించి అడిగాను కాని బావా యిప్పటిలాగా ఏడుపే సమాధానం

(ఇంకావుంది)

## CTS 606



చూడడానికి మంచిది పని చేయడంలో ఇంకా మంచిది

- ప్రకాశిస్తున్న ప్రోగ్రామ్ ఇండికేటర్
- దాచి ఉన్న ఆపరేటింగ్ నియంత్రణములు
- ఆడియో రికార్డింగ్ ఔట్‌పుట్
- హై ఇమ్‌ప్యాక్ట్ పాలిస్టైరిన్‌లో మోల్డ్ చేయబడిన వెనక కవర్

## DELTA 10



వెర్టికల్ బ్లాక్ & వైట్ టీవి

- విహెచ్‌ఎఫ్/యుహెచ్‌ఎఫ్‌తో కూడిన అతి నవీన ఎలెక్ట్రానిక్ ట్యూనర్
- వోల్టేజ్ మార్పులను సరిచేసుకోగల ఎస్ఎమ్‌పిఎస్ సౌకర్యము
- దాచి ఉన్న ఆపరేటింగ్ నియంత్రణములు
- డబుల్ స్పీకర్‌లు
- రికార్డింగ్‌కోసం ఆడియో ఔట్‌పుట్
- హై ఇమ్‌ప్యాక్ట్ పాలిస్టైరిన్‌లో మోల్డ్ చేయబడిన వెనక కవర్

## TS 32 DX



డీలక్స్ సౌకర్యాలతో కూడిన ఎకానమి మోడల్

- చూడడానికి చక్కగా ఉన్న టివి చిత్రాలు స్పష్టంగా వుంటుంది
- వోల్టేజ్ మార్పులను సరిచేసుకోగల ఎస్ఎమ్ఎస్
- ధ్వని నియంత్రణములు
- స్లైడింగ్ నియంత్రణములు
- విసిఆర్ ప్లేబ్యాక్ మరియు ఆడియో రికార్డింగ్ సాకెట్
- హై-ఇమ్‌ప్యాక్ట్ పాలిస్టైరిన్‌లో మోల్డ్ చేయబడిన వెనక కవర్

## TS 33 E



దీని శ్రేష్ఠతతో మరొక్క టివి మనము పోల్చలేము

- హై-క్వాలిటి డబుల్ షట్టర్ మోడల్
- వోల్టేజ్ మార్పులను సరిచేసుకోగల ఎస్ఎమ్ఎస్
- ధ్వని నియంత్రణములు
- విసిఆర్ ప్లేబ్యాక్ మరియు ఆడియో రికార్డింగ్ సాకెట్
- హై-ఇమ్‌ప్యాక్ట్ పాలిస్టైరిన్‌లో మోల్డ్ చేయబడిన వెనక కవర్

## PET 14 SE



సాలిడైర్ సూపర్ స్పోర్ట్స్ స్పెషల్

- పూర్తిగా మోల్డ్ చేయబడిన ప్లాస్టిక్ క్యాబినెట్
- 12 చానల్ మెకానికల్ ట్యూనర్
- 12 వోల్ట్ బ్యాటరిలో కూడా పనిచేయగలది
- స్పష్టమైన ప్రదర్శనముకు జంట ఆంటెనాలు

## PET 14 D



VHF/UHF బ్యాండుతో కూడిన పోర్టబుల్ టివి

- అతినవీన విహెచ్‌ఎఫ్/యుహెచ్‌ఎఫ్ ఎలెక్ట్రానిక్ ట్యూనర్
- ఆరు ప్రోగ్రామ్ సెలక్టర్‌లు
- సులభంగా ట్యూన్ చేయడానికి ఫైన్ ట్యూనింగ్
- 12 వోల్ట్ బ్యాటరిలో కూడా పనిచేయగలది
- పూర్తిగా మోల్డ్ చేయబడిన ప్లాస్టిక్ క్యాబినెట్
- స్పష్టమైన ప్రదర్శనముకు జంట ఆంటెనాలు



వివిధ మోడల్ వివిధ స్టైల్ వివిధ ప్రత్యేకమైన సౌకర్యాలు ఇవన్నీ మంచి శ్రేష్ఠత పొందడానికే మన టివి మంచి విధంగా వుండాలి అంతే చాలు ఈ లక్ష్యంతో పూర్ణ నమ్మకం పెట్టింది సాలిడైర్ ఈ యుక్తితో మంచి ఫలము లభించింది దీనివల్ల యుగోస్లోవియా దేశానికి ఎగుమతి చెయడానికి ఒక మంచి అవకాశము లభించింది అంతేకాదు సాలిడైర్‌నుంచి సంతోషము పొందిన వాడుకదారుల సంఖ్య దిన దినానికి పెరుగుతూనే వుంది

# సాలిడైర్

సాటిలేని శ్రేష్ఠత ఇస్తుంది సంతోషము.

Insight S 294

# డయల్ నెం:



## సంధ్యా లక్ష్మిబాల్

దభ దభ చప్పుడు
ఎవరిదో వెర్రికేక
ఎక్కడో కొట్టినశబ్దం
ఎవరెవరో పరిగెత్తిన సవ్వడి
అప్పుడే పైట తొలగించబోతున్న సుశీల ఉలిక్కిపడింది
"బాప్‌రే" అన్నాడు ఆ గదిలో పురుషుడు
"రైడింగ్ జరుగుతోంది" అంటూనే చటుక్కున లేచి బట్టలు తొడుక్కున్నాడు

స్పృహ వచ్చేసరికి మెత్తటి పరుపులమీద తను గదంతా చీకటి ఎవరో తనను ఆక్రమించుకున్నారు ఎంతగానో పెనుగులాడి ఓడిపోయింది

నిజంగానే గుండెలు బ్రద్దలవుతాయ్ ఈ మురికికూపంలో రెండు సంవత్సరాలుగా జీవించటమే చిత్రం అయినా తను ఒకతే ఉంది

ఈ నేరం నాది కాదని చెప్పటం కోసం అందాకే ఆ తర్వాత తానే మరలారాదు ఆమెకు నగరమంతా పంజరంలా కనిపించింది ఇక్కడ నుండి తప్పించుకోవటం అంత సామాన్య విషయం కాదని సుశీలకు తెలుసు రైల్వేస్టేషన్లలో, బస్ కాంప్లెక్స్‌లలో వారి మనుషులుంటారు. ఈ మురాకు చెందకుంటే మరో ముఠా పైగా పట్టపగలు తీసుకు రాగలిగినవారు ఎంతకైనా తెగిస్తారు మరెలా బయట పడటం ?

ఎవరైనా మంచి మనిషి దొరకాలి అతనికి విశాల హృదయం ఉండాలి తన కధంతా అతనికి

"నువ్వు ఫో" అరిచాడు

తలుపు తెరుచుకుంది

నడవా అంతా ఖాళీగా ఉంది

సుశీల గమ్యం లేకుండా పరిగెత్తింది

అదృష్టవశాత్తూ అక్కడ ఎవరూలేరు గబగబ ఓ మూలాగా వెళ్ళి నిలబడింది తన గది నుండి అప్పుడే బయటకొస్తున్నాడతను హడావిడిగా అప్పుడు ఎదురొచ్చారిద్దరు కానిస్టేబుల్స్.

"వీడ్నికూడా తోసెయ్యండి"

"అన్యాయం ఇదేమిటి?" అరుస్తున్నాడతను

"ఛలే బే" మెడమీద చెయ్యి వేసి గెంటాడు

ఓ పోలీసు గదిలోకి తొంగి చూశాడు

ఎవరూ లేరు పద అన్నాడు

సుశీల గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి

ఇంతలా రైడింగ్ ఆమె రెండు సంవత్సరాల జీవితంలో ఎరగదు అలా గంటసేపు నిలబడే ఉండిపోయింది ఆమె గుండెలింకా వేగంగానే కొట్టుకుంటున్నాయి సాధారణంగా ఈ భవనం మీద ఎప్పుడూ దాడి జరగదు అందుకు కారణం నెలసరి మామూళ్ళు టంచన్‌గా అందటమే కాదు దీని వెనక కొన్ని రాజకీయ హస్తాలున్నాయని చెప్పుకుంటుంటారు

ఎప్పుడైన రైడింగ్ జరుగుతుందని తెలిస్తే ముందుగానే తెలిసిపోతుంది రైడింగ్ జరిగి పోతుంది ఉత్త చేతుల్తో వెళ్తారు సాధారణంగా కొత్త అధికారులు వచ్చినప్పుడు ఇలా జరుగుతుంటుంది అలాంటి సమయంలో కూడా ఇలా జరగలేదు

ఎటు చూసినా నిర్మానుష్యం నిశ్శబ్దం!

బహూశా పురుగు కనపడ్డా తీసుకవెళ్తు ంటారు

ఏం చేయాలి?

సుశీల ముందు ఒకటే ప్రశ్న ఇలానే వెళ్తే ఇంకెవరైనా ఉంటే అరెస్ట్ చేయవచ్చు అరెస్ట్ చేస్తే ఏమౌతుంది? కోర్టులో పోజరు పరుస్తారు. వాళ్ళు జరిమానా విధిస్తారు. అంతేగా! అయితే తిరిగి ఈ దుర్భర జీవితం తప్పదు. తనేం నేరం చేసిందని ఇలా బతకటం?

అసలు బతికి ఏం సాధించాలి?

ఇంతగా తాను పతనమయ్యాక.

పతనమవటం వెనక తన నేరం ఏముంది?

ఆరోజు

కాలేజి నుండి వస్తుంటే తన వెనక కారు ఆగివచ్చారు ఎవరో తనను లోపికి లాగివేశారు కెవ్వున అరవబోతే చేతుల్తో నోరుమూశారు తర్వాత ముక్కు దగ్గర ఏదో గుడ్డ అదిమారు కొద్ది సేపట్లోనే ఏమయిందో తెలియదు

అయిపోయింది తన జీవితం నాశనమైపోయింది ఆ తర్వాత తను స్పృహ కోల్పోయింది. తనను ఎప్పుడు, ఎలా, ఇక్కడికి తెచ్చారో ఈ నాటికీ తెలియదు

ఆడపిల్లలు అర్ధరాత్రి ఒంటరిగా తిరిగిన రోజునే దేశానికి స్వాతంత్ర్యం వచ్చినట్లు అంటూ గుండెలు బాదుకునే నాయకులు గుర్తొచ్చి నవ్వుకునేది తను

పట్టపగలు తను అపహరించబడింది!

ఈ విషయంలో తన తల్లితండ్రులెంతగా బాధపడ్డారో తన గురించి ఎంతగా ఆలోచిస్తున్నారో! పోలీస్ రిపోర్ట్ ఇచ్చి ఉంటారు ఇస్తే మాత్రం ఏమైంది?

అదికాదు అసలు బాధ

తను ఎవరితోనైనా లేచిపోయా వనుకోరు కదా లోకం ఎలానూ అనుకుంటుంది కానీ అమ్మా నాన్నకూడా అలా భావిస్తే అంతకన్నా నరకం ఏముంటుంది? తన శవం కోసం నదులూ, కాలవలూ గాలించి ఉంటారేమో? ఏమైనా చేస్తారు వారు దుఃఖంతో కృంగిపోతారు

ఇప్పుడు ఇలా వ్యభిచార గృహంలో ఉంటున్నట్లుగా తెలిస్తే మాత్రం మైనా ఫర్వాలేదు అయితే ఎప్పుడూ అలాంటి అవకాశం రాలేదు ఈ జీవితంలో వస్తుందా అనేది సందేహమే మానవుడు ఆశాజీవి అందుకే ఎదురుచూస్తోంది !

సుశీల ఆలోచనల నుండి తేరుకుంది అకస్మాత్తుగా ఆమెకో ఆలోచన వచ్చింది కనీసం అరెస్టయినా బాగుండేది కోర్టులో ప్రవేశపెడితే, కోర్టువారిని వేడుకుంటే సరిపోయేది వారు తన తల్లిదండ్రులు దగ్గరికి చేర్చేవారు తన కథ విని ఏ యువకుడో ముందుకు వస్తే నూతన జీవితం లభించేదేమో! ఓ వేళ ఎవరూ ముందుకు రాకున్నా ఈ దుర్భర జీవితం నుండి విముక్తి లభించేది

ఈ ఆలోచన రాగానే ఆమె ఇంకేమాత్రం ఆలస్యం చేయలేదు అక్కడ నుండి కదలి ఒయటకొచ్చింది ధైర్యంగా నడుస్తూ వెళ్ళింది గదులన్నీ ఖాళీ మనిషన్నవారు లేరు ఆ భవనంలో ఒక్కరూ లేరు. అంతా పరారైనట్లున్నారు అంటే గంట నుండి ఈ భవనంలో తనక్కొటే ఉందన్నమాట

బయటకొచ్చింది

ఎవరూ లేరు!

ఇంతకంటే గొప్ప అవకాశం చెప్పాలి తన దగ్గర పైసా లేదు, అతను తనను ఇంటిదగ్గరకు చేర్చాలి అంత చొరవ తీసుకునే వ్యక్తి తనకు దొరుకుతాడా? లేనిపోని గొడవెందుకని పోతారా? ఏమో తన అదృష్టం ఎలా ఉందో? ముందీ ప్రాంతం నుండి బయటపడాలి

సుశీల వేగంగా అడుగులు వేస్తోంది ఆమె గమనించని అంశం మరోటుంది ఆమె హడావుడిలో చీర సరిగ్గా కట్టుకోలేదు ఆమె ముఖంలో టెంక్షన్ కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది పరీక్షగాచూస్తే ఎవరైనా ఆమెను అనుమానిస్తారు ఆ వీధి దాటి బైటపడింది

రెండు సంవత్సరాల తర్వాత సమాజాన్ని చూడటం ఇదే రాత్రి వెలుగుల్లో నగరం ఉంది సమయం అర్ధరాత్రి కావచ్చు ఇప్పుడు ఏ పోలీస్ చూసినా అరెస్టచేసి తీసుకెళ్తాడు మరి ఏటాక్సీనో పిలిస్తే? దిగాక డబ్బులు ఎలా?

సుశీల అలానే నిలబడిపోయింది

అప్పటికే రోడ్డుమీద నడుస్తున్న కొందరు వింతగా చూసుకుంటూ వెళ్తున్నారు కార్లు కూడా వేగం తగ్గి కదులుతున్నాయి ఆమె గుండె చప్పుడు ఇంకా స్పష్టంగా వినిపిస్తోంది

"ఎవరమ్మా నువ్వు?"

ఉలిక్కిపడి అటు తిరిగింది

ఓ నడివయస్కుడు అతని మొఖంలోకి పరిశీలనగా చూసింది ఎంతో సౌమ్యంగా కనిపించాడతను అలా కనిపించేవారంతా మంచివారు కాకపోవచ్చు అయినా సరే వాళ్ల రూపం బయటపడ్డనంతవరకూ ఎవరికీ అనుమానం కూడా రాదు

"నేను నేను" సందిగ్ధంగా ఆగిపోయింది

"నడుస్తూ మాట్లాడుకుందాం" అన్నాడతను

## వినోద్‌లో మార్పు



తాను చేసిన పొరపాట్లకు యిప్పుడు పశ్చాత్తాపపడుతున్నాడట వినోద్‌ఖన్నా తన వ్యక్తిగత జీవితం ఆ జీవితంలో ఒడిదుడుకులు తనను యిన్నాళ్ళు సంక్షోభంలో పడేశాయని వాపోతున్నాడు అన్నిటికీ స్వస్తి చెప్పి యిప్పుడు తను తన వంతు కర్తవ్యాన్ని నెరవేరుస్తానని రోజుకు ఒక షిఫ్ట్ కంటే పని చేయనని ప్రతిజ్ఞ చేస్తున్నాడు

దయావన్‌కు ముందు నెంబర్‌వన్ హీరో అయిపోతాడని అతని ఫ్రెండ్సు అందరూ ఊహించారట కాని ఆ చిత్రం బాక్సాఫీస్ దగర తుస్సుమనేటప్పటికి వినోద్ ఖన్నా ఖాళీ అన్నారట ఆ ఫ్రెండ్సే

ఆ చిత్రం ఫ్లాప్ కావటంతో నిర్మాతలు డిస్ట్రిబ్యూటర్లు అతన్ని దూరం చేశారు అదీ కాకుండా షూటింగ్‌లకు మందు పుచ్చుకొని వస్తాడనే వాదం కూడా వినబడింది షూటింగ్ షెడ్యూల్సుని సరిగా పూర్తి చేయకపోవటమే కాకుండా నిర్మాతల్ని యిరకాటంలో పెట్టేవాడు అమృతాసింగ్‌తో కనెక్షన్ కూడా వుందని ప్రచారంలో వుంది దెబ్బ మీద దెబ్బతో మనిషి కృంగి కృశించి రోడ్డున పడ్డాడు వీటన్నిటిని జయించి యిప్పుడు తిరిగి చిత్రరంగంలోకి మంచి మనిషిగా ప్రవేశించాలని చేస్తున్న కృషిని పెద్దలందరూ ప్రశంసిస్తున్నారు

సుశీల ఇంకేమాత్రం ఆలోచించలేదు వారు నడుస్తున్నారు. ఆమె చెబుతోంది తనెలా ఈ స్థితి కొచ్చింది ఈ రోజెలా తప్పించుకున్నదీ అన్ని వివరాలు అతను వింటున్నాడు

"మా ఇంటికెళ్దాం ఈ అర్ధ రాత్రి ఏం చేయలేం రేపు ఉదయం ఆలోచించుదాం"

సుశీల తిరిగి ఓ నిమిషం ఆలోచించింది తను చేయగలిగిందేమీ లేదు. తనను అనుభవించటానికే అలా ఎలుస్తున్నాడనుకున్నా ఈనాడు తనేం కన్య కాదు నమ్మించి మోసం చేయటమనే నైతిక అంశం అతనిదే అవుతుంది అదికాదు ఆమె ఆలోచన ఈ రాత్రి గడవకూడదు ఏం చేయాలన్నా ఈ లోపే చేయాలి బహుశా ఈసరికే ప్రత్యామ్నాయ ఏర్పాట్లు ప్రారంభమై ఉంటాయి

రేపు ఉదయంకల్లా ఎవరున్నారో, ఎవరు పోయారో తెలుస్తుంది అప్పుడు వేట ప్రారంభమౌతుంది అప్పుడు తనకు శారీరకంగా కూడా ఇబ్బందులు ఆరంభమౌతాయి తనను చిత్రవధ చేసిగాని వదలరు ఈ రాత్రిలోగా తప్పుకోవాలనేది తన ఆరాటం

తన ఆరాటాలింకా చాలా ఉన్నాయి ఎడారిలో నీళ్లకోసం ఆరాటపడటం ఇది ఎండమావుల వెంట పరిగెత్తటం ఇది తనున్న స్థితిలో ఏదైతేనేం?!

మరికొంతదూరం నడిచాక ఓ ఆటోలో ఎక్కారు చాలా దూరం ప్రయాణం చేసి ఓ చోట ఆగింది అతి పెద్ద భవంతి కాకపోయినా ఇల్లు బాగుంది ఆ ఇంట్లోకి ప్రవేశించారిద్దరూ

"ముందు బట్టలు సరిగా కట్టుకోండి" అన్నాడు లోపలకు వెళ్ళాక అప్పుడు చూచుకుంది తను స్త్రీ



## రాజేష్‌పురి బట్టతల!

పలు ఓ వి సీరియల్ లోను వెండి సినిమాల్లోనూ కమెడియన్ పాత్రలు పోషించి ప్రేక్షకులను గిలిగింతలు పెట్టిన అచ్చమైన బట్టతల నటుడు రాజేష్‌పురి ఆకారం వికారంగా ఉండటంవల్ల జోకు కమెడియన్ పాత్రల నుంచి విలన్ పాత్రలకి దిగిపోయాడు హమ్‌లోగ్ లో ఎల్లు పాత్ర ధరించిన రాజేష్‌పురి ఎక్‌బార్ సూరత్ గుణాహ్ చిత్రంలో విలన్ పాత్ర పోషిస్తున్నాడు ఎప్పుడూ ధరించె విగ్‌ని తీసేసి మరీ ఈ పాత్ర పోషిస్తున్నాడట

నున్నటి గుండు విశాలమైన ఛాతీ బహుశా ఇవన్నీ నిర్మాతలకు ఇతనిలోని విలన్‌ని చూపించాయేమో మరి!

## డయల్ నెం 100

అతను లేచి ఫ్రిజ్ నుండి ఓ బాటిల్ తీశాడు అందులో మంచి నీళ్ళే ఉన్నాయి సుశీల ముందుంచాడు తాను మాత్రం మరో బాటిల్ అందుకున్నాడు సుశీల నీళ్లు త్రాగింది

"సరే నువ్వు పడుకో" అన్నాడతను

ఆమెకు టేబుల్ మీద ఏవో కొన్ని పత్రికలు కనిపించాయి అందులో కొన్ని క్రైమ్ జర్నల్స్‌కూడా ఉన్నా

స్తోంది నడుమ నడుమ భయం కలిగించే సంగీతం ఆపెద్దామనుకుంది వెంటనే ఆ పని చేయలేకపోయింది కొద్దిసేపటి త్వాత మరో తరహా మొదలయింది ఎవరో స్త్రీ రతి అనుభవం పొందుతూ విడుస్తున్న నిట్టూర్పుల్ని వింటుండిపోయింది సుశీల

ప్రపంచం ఎంత ముందుకు వెళ్తుందో అర్థం అవుతున్నకొలదీ ఆమెకు ఆశ్చర్యం అసహ్యం కలుగుతు

ఆశ్చర్యపోయింది రకరకాల సెక్స్ చిత్రాలు అవన్నీ పడకగది రహస్యాలు తాను అనవసరంగా అతని వ్యక్తిగత జీవనంలోకి తొంగిచూస్తున్నా అనుకొంది

గదంతా గాలించినా ఏమీ దొరకలేదు

నిట్టూర్చింది బెడ్‌మీద కూర్చుని ఆలోచించింది అయినా తను అనవసరంగా బాధపడుతున్నానేమోనని పించింది అప్పుడు కనిపించింది

ఊహించే కళవుంటే తన జీవితం ఇలా ఉండేదికాదు ఎదిఏమైనా అనుభవంనేర్పిన పాఠం

అయినా పట్టపగలు నడిచివస్తున్న ఓ యువతిని అమాంతం ఓ కారులోవచ్చి కబళించగలరని ఎవరు ఊహించగలరు? సామాజిక జీవితం ఇంత దుర్భరంగా తయారైందని ఈ రోజు తన అనుభవంలోకి వచ్చింది ఈ అనుభవం అందరి దృష్టికీ ఎలా వస్తుంది? మనం వేసే ప్రతి అడుగూ జాగ్రత్తగా వేయాలనే విషయం ఈ దేశం బిడ్డలకు ఎవరు చెబుతారు?

సుశీలలో అనేక రకాల ఆలోచనలు ఆమెకు తిరిగి తను క్షేమంగా ఇంటికి చేరగలననే నమ్మకం కుదరటంలేదు తిరిగి అదే జీవితం దుర్భరం అంతకంటే చచ్చిపోవటం నయం తిరిగి అంతరాత్మ ఎదురు తిరిగింది చావటం కాదు తుదిదాకా పోరాడాలి

తిరిగి ఉలిక్కి పడింది

ఏదో జరుగుతూంది - జరగబోతూంది సుశీల మనసంతా ఈ భావంతోనే నిండిపోయింది

ఇప్పుడు అతనేం చేస్తున్నాడో .. వెళ్ళి పరిశీలిస్తే ఎందుకిలా వచ్చావంటాడేమో ఏం చెప్పాలి? అప్పుడు స్ఫురించింది గదిలో మంచి నీళ్ళులేవు. అందుకే అందుకే వచ్చానని చెప్పాలి

— సుశీల మెల్లగా తలుపు తెరిచింది ఏ మాత్రం శబ్దం లేకుండా తెరిచాక కొంతసేపు అలానే నిలబడిపోయింది

నిశ్శబ్దం

మెల్లగా అడుగు ఒయట పెట్టిం

సహజమైన సిగ్గుతో ముడుచుకుపో యింది ఓ గది చూపించాడతను వెళ్ళి బట్టలు సరిచేసుకుంది

"ప్రస్తుతం నా భార్య లేదు నువ్వా గదిలో పడుకోవచ్చు" సుశీ-ల ఆ ఇంటినంతా పరిశీలించింది బయట నుండి చూసేకన్నా లోపలే మరింత ఆధునికంగా ఉంది

ఫ్రిజ్ టీవీ ఫోన్ ఉన్నా యి సోఫాలు, వాటిముందు టీపా య్ అందంగా అలంకరించబడి ఉంది

"ఏమైనా తిందామా" అంటూ అతను ఫ్రిజ్ తెరిచి అందులో వరుసగా పేర్చిన ఏపిల్ కాయలు, అరటిపండ్లు తీసాడు.

"మీరు కూర్చోండి" అంది సుశీల

"బట్టలు మార్చుకువస్తాను" అంటూ అతను వేరే గదిలోకి వెళ్లాడు

సుశీలకంతా ఆశ్చర్యంగా ఉంది తన జీవితకాలంలో ప్రతి మలుపూ ఓ అద్భుతమైన కథలా ఉండటమే చిత్రమైన విషయం ఆమె ఏపిల్ కాయల్ని ఫ్రిజ్ మీదున్న చాకతో ముక్కలు చేసింది అరటికాయల్ని మధ్యకుకోసి కిచెన్ రూంలోకి వెళ్లి రెండుప్లేట్లు తెచ్చి సర్దింది చాకు ఫ్రిజ్ మీదుంచింది

అతను వచ్చాడు కిచెన్ రూంలో కివెళ్లి ఓ ప్యాకెట్‌తో వచ్చాడ స్వీట్‌మీట్ అది

"తిను" అన్నాడు తను తీ కొంటూ

రెండురకాలు తిని ఎచ్‌వ క్క తీసుకుంది అతను మాత్రం స్వీట్స్ తింటూ ఆలోచిస్తుండిపోయా డు అతనే విషయం ఆలోచిస్తున్నా అర్థంకాలేదు ఒహాశా తనను ఎ పంపించాలా అనా? పోలీస్ రిపోర్ట్ ఇస్తే బాగుంటుందా అనా?

యి సుశీల మాట్లాడకుండా గదిలోకి నడిచింది గదిలో డబల్‌కాట్ మీద మెత్తటి పరుపు ఉంది తన్తోపాటు తెచ్చుకున్న పత్రికవంక చూస్తూపడు కొంది తన చేతికందేంత దూరంలో టేప్‌రికార్డ్ ఉంది ఆన్ చేసింది

చాలాకాలం తర్వాత సంగీతం వింటుంది తను ఎంత ఆహ్లాదక-రంగా ఉందో..! అలా వింటూనే పత్రిక పేజీలు తిరగేసింది తన కు తెలియకుండానే ఓ కథ చద వటం ప్రారంభించింది ఓ హత్య జరిగింది ఆ హత్య ఎవరుచేశార నేది కథనం అకస్మాత్తుగా ఏదో మార్పు

సుశీల ఉలిక్కిపడింది

పుస్తకం నుండి దృష్టి మరల్చిం ది గదంతా మామూలుగానే ఉంది ఏ కొత్త మార్పులేదు మరెందుకు తను ఉలిక్కిపడింది? క్షణం తర్వా త ఆమె పెదవులమీద చిరునవ్వు ఇప్పుడు సంగీతంలో మార్పువచ్చింది ఎవరో స్త్రీ వికృతంగా అరు

స్తాయి

అయినా తాంత ప్రశాంతం-గా పడుకుందేమిటి? అతనెవరో? ఎలాంటివాడో? ఎలాంటివాడయినా ఇప్పటివరకూ అతను చాలానే ప్రవర్తించాడు అతని ముఖంలో ఎలాంటి క్రూరత్వమూ లేదు తప్పకుండా తనకు సాయంచేస తీరతాడు అను కొంది

ఒయినా అంత అలక్ష్యం పని కిరాదు పట్టుపరుపుమీద పడుకొని సంగీతం వింటుంటే ప్రపంచమంతా చాలానే ఉన్నట్లుంటుంది జాగ్రత్తగా వ్యవహరించాలి అనుకొంది వెంటనే

మరయితే ఏం చెయ్యాలి? జర గరానిదేదన్నా జరిగితే తనను తాను రక్షించుకోవటానికి ఓ ఆయుధం కావా లి వెంటనే ఆమె లేచింది ఇంత వరకూ తలుపుకూడా వేసుకోలేదు వెళ్లి తలుపు మూసింది గదం తా వెదికింది ఎక్కడైనా ఏదైనా దొరుకుతుందేమోనని

బెడ్ క్రింద చూసింది క్షణకాలం

ఫ్లవర్‌వాజ్!

దాన్నిండా ఉంది కృత్రిమపూ లే అయినా ఎంత అందంగా ఉన్న యో? నిజమైన పూలలా! సుశీల ఆ పూలన్నింటిని బెడ్‌మీద పరచింది ఫ్లవర్‌వాజ్ ఏ మెటీరియల్‌తో చేశా రోగాని బరువుగా ఉంది అవసరమైతే ఇది ఉపయోగించవచ్చుననుకొంది

ఎందుకో తిరిగి ఇబ్బందిగా అని పించింది ఎవరో తనను పరిశీలి స్తున్నట్లనిపించింది కొంత స్ట్రేంగా ఫీలయింది కప్పుపుచ్చే ప్రయత్నంలో ఆ పూలను పరిశీలిస్తున్నట్లుగా నటిం చి వాటిని యథాస్థానంలో ఉంచింది లేచి మెల్లగా పచార్లు చేస్తున్నట్లుగా అటూ, ఇటూ తిరిగింది చటుక్కు న తలుపువెనక చేరి కీహోల్ నుండి చూసింది

ఎదురుగా గోడ!

సుశీల అప్రయత్నంగా నవ్వు కుంది తను అనవసరంగా భయ పడుతోంది ఆపదల్ని ముందుగా

ది

* * * *

నిజం ఈరోజు డ్యూటీలో లేను నాలుగు రోజులయింది తెలవుమీద వెళ్ళి అయినా ఇలా జరగటం ఆశ్చర్యంగా ఉంది అందర్నీ తీసుకెళ్ళారా? మరేమిటి చేయటం? ఎందుకిలా జరిగింది అంతే అయుంటుంది మంత్రి వర్గంలో మార్పులు చిత్రం చూడు ఓ ఎల్ల నాకు కలిసింది సుశీల ఇక్కడే ఉంది కొన్నాళ్ళు ఈ వ్యాపారం ఆపితే బాగుంటుంది వైకివెళ్ళి ముందు తేల్చుకోవాలి ఆ తర్వాత కదా ఇంతకంటే మంచి బిజినెస్ అరబ్ కంట్రీస్‌కు అమ్మితేపోలా? ఒక్కసారే బల్క్ ఎమౌంట్ పలుకుతుంది వేరే ఇన్వెస్ట్ చేయవచ్చు ఆలోచించు

అమ్మాయినా డోంట్‌వ ర్రీ బెరుకుగొడ్డు పోయిగా నిద్రపోతూంది ఉదయం లేవగానే సరాసరి తీసుకొస్తాను అనుమాన మా! నన్ను చూస్తే నవ్వాడు

ఇంకేమిటి ఒకరిద్దరు ఇలాంటి వారున్నా ఎక్కడికీ పోరులే నేను చెప్పింది ఆలోచించు ఏమంత కష్టం కాదు జనరల్ రిస్క్ అంతే

అతను మాట్లాడుచున్నాడు.

పొరదుస్తుల్లో సుశీలను తెచ్చిన ఓ అధికారి

ప్రజారక్షకుడు!

* * * *

సుశీల ఫోన్ రింగ్ చేస్తోంది

ఆమె ముఖం గంభీరంగా ఉంది

నెంబర్ 100

అవతల రింగవుతున్న చప్పుడు

ఈ సమాజం ఇలా ఎందుకు వర్ధిల్లుతుందో

సుశీల కిపుడు స్పష్టంగా తెల్సు

పెళ్లికొడుకు "మంగళ స్నానాలు" వద్దంటున్నాడు.. తలకిరాసుకున్న రంగు చెరిగిపోతుందట!

రఘు

సీరియల్

# పంచశూలమ్

విశ్వప్రసాద్

## 42

(గత సంచిక తరువాయి)

ఇందిరాగాంధీ వీదిలో 32వ నెంబరు బంగ్లాముందు ఆగింది షా డ్రైవ్‌చేస్తున్న జీపు

థాంక్యూ యినొస్పెక్టర్! నా బంగ్లా చూద్దురుగాని రండి అంటూ జీప్‌లోంచి ధిగాడు పంచశూలమ్

చిరునవ్వు నవ్వాడు డ్రైవింగ్ సీటులోంచి కిందికి దిగాడు మీ బంగ్లా చూడ్డానికి మరోసారి వస్తాను అర్జంటుగా ఐ జి గారి దగ్గరకెళ్ళాలి మీతో ఓమాట మాట్లాడి వెళ్ళిపోతాను అన్నాడు షా

ఎందుకు?

ఇనొస్పెక్టర్! నా కంటే మీరు చాలా చిన్నవారు నాతో సగం వయసు వుంటుంది అయినా మీరు తొడుక్కున్న యూనిఫామ్‌ని హోదాను గౌరవిస్తాను నేను మీ ప్రశ్నకు సమాదానం కావాలా?

మీకు యిష్టమైతే చెప్పండి,

చెప్పమంటే చెబుతాను

చెబుతారనే అడిగాను

జరిగిన కథ-9 జోషి కేసును దర్యాప్తు చేస్తున్న స ఐ డి. ఇనొస్పెక్టర్ ఆలీషాని పంచశూలమ్ ఢిల్లీకి పంపిన యువకుడు హతమార్చి అతని స్థానంలో 'షా గా చెలామణి అవుతుంటాడు జయరాజ్ కొడుకు మోహన్‌తో పెళ్ళి కావల్సిన గురూజీ కూతురు మీనాక్షి అందురా లవుతుంది పంచశూలమ్ మోహన్ని కిడ్నాప్ చేస్తాడు వ్యబిచారంలోకి దిగిన ఊర్వశి తండ్రి ఎవరో ఆమెకు వివరిస్తాడు పంచశూలమ్ ఎం ఎల్ ఎ దీపాదేవి యింటికి వెళ్ళిన షాకి ఆమె రక్తపు మడుగులో పడి వున్న దృశ్యం కంటబడుతుంది ఊపిరితోనే వున్న ఆమెను ఆస్పత్రికి తరలిస్తాడు షా గురూజీ యింటికి వచ్చిన పంచశూలమ్ మీనాక్షి తల నరికి యిమ్మంటాడు

ఆల్ రైట్ చెప్పండి అని పైప్‌కోసం కోటుజేబులో చెయ్యిపెట్టాడు పంచశూలమ్

వెంటనే తన జేబులోని రెడ్ పైప్ తీస అతని పెదవుల ముందు వుంచాడు షా

దానిని అందుకున్నాడు ఓమారు పరీక్షగా చూశాడు థాంక్యూ! ఇది నాదే నిన్న రాత్రి దీప యింట్లో మరచిపోయాను ఏదో సాధారణమైన విషయం చెబుతున్నట్టు అన్నాడు పంచశూలమ్

రాత్రి ఆమె యింటి కెళ్ళారా? తెలియనట్టు ప్రశ్నించాడు షా

ఔను

చిన్నగా నవ్వాడు పంచశూలమ్ నేను మిలటరీ నుండి రిటైర్ అయ్యాను మీకు చెప్పేనా? అన్నాడు

తలూపాడు షా

కాని సెక్సువల్ లైఫ్ నుండి యింకా రిటైర్‌కాలేదు

అంటే? కుడి బుగ్గమీది పులిపిరికాయను సవరించుకుంటూ ప్రశ్నించాడు షా

మరోమారు నవ్వాడు ఆమెకు ప్రతి రోజు ఓ మగాడు కావాలి నాకు అప్పుడప్పుడు ఓ ఆడది కావాలి అన్నాడు పంచశూలమ్

ఆడది కావలసనప్పుడల్లా ఆమె దగ్గర కెళుతుంటారా? సూటిగా ప్రశ్నించాడు షా

తల అడ్డంగా వూపాడు పంచశూలమ్

ఆమె పతివ్రతా?

కాదు

వ్యభిచారిణా?

అలాంటిది కూడా కాదు

మరి?

దీప ఓ విచిత్రమైన స్త్రీ తనమీద ఎవరైనా మోజుపడితే కాదనదు ఎవరిమీదనైనా తనకు కోరిక కలిగితే ఆ కోరిక తీర్చుకున్నంతవరకు నిద్రపోదు

మీకు ఆమెమీద మోజా? ఆమెకు మీ మీద మనసా? తిరిగి సూటిగా ప్రశ్నించాడు షా

మా యిద్దరిమధ్య అలాంటి మోజులు లేవు ఆమెను ఎప్పుడూ ఆశించలేదు – నేను

మీ మీద ఆమెకు ఆశవుందేమో?

అదీ లేదు పూర్వం వుండేది నేనే ఆ ఆశను అణచేశాను

ఇహ మీ సెక్సువల్ లైఫ్‌తో ఆమెకు సంబందమేమిటి,

నేను కోరినప్పుడల్లా ఓ స్త్రీని రప్పిస్తుంది

ఎవరా స్త్రీ?

ఒకరని నియమంలేదు తనకు అందుబాటులో వుండే అందమైన స్త్రీని ఎలుస్తుంది

కొందరు గూండాలను రౌడీలనూ పంచశూలమ్ కంట్రోల్ చేస్తున్నాడని తను హైద్రాబాదు వచ్చిన మొదటి రోజునే విన్నాడు షా కాని యింతవరకూ ఏ పోలీసు అదికారికీ అతన్ని అరెస్ట్ చెయ్యడానికి ఆదారాలు దొరకలేదు అతను ఎలాంటి అపరాదాలు చేస్తున్నాడో ఎవరిచేత చేయిస్తున్నాడో ఎవరికీ తెలీదు కాని పోలీసువారికి అతనిమీద బాగా అనుమానం వుంది అందుకే అతని మాటలమీద నమ్మకం కుదరలేదు షాకి

పైగా అతను వయసు మీరినవాడు! రిటైర్డ్ మిలటరీ ఆఫీసరు! ఫైవ్‌స్టార్ హోటల్లో పార్ట్‌నర్!జయరాజ్ గురూజీల వంటి కోటీశ్వరులకు ప్రాణస్నేహితుడు!!!

డబ్బు సంస్కారం పరువుప్రతిష్టలు గలవాడిగా చెలామణీ అవుతున్నాడు

అలాంటి పెద్దమనిషి చిన్నపిల్లాడిలా తన సెక్స్ బలహీనతను చెప్పుకోడు చెప్పుకోవలసిన అవసరంలేదు ఎంతమంది వ్యభిచార స్త్రీల నయినా – డబ్బుతో కొనగల స్తోమత అతనికుంది కేవలం ఆడవాళ్ళకోసం అతను దీప ఫ్లాటుకు వెళ్ళనక్కర్లేదు ఫోన్‌ద్వారా తన హోటల్‌కు రప్పించుకోగలడు లేదా తన బంగ్లాకు పిలిపించుకోగలడు స్త్రీలోలత్వంతో అతను దీప ఫ్లాటుకు వెళ్ళలేదు అతను అక్కడికి వెళ్ళడానికి వేరే కారణం వుండివుంటుంది

క్షణకాలం రకరకాల ఆలోచనలు దొర్లిపోయాయి షా మెదడులో. వెంటనే తన ఆలోచనల్ని అదుపులో పెట్టుకున్నాడు. మర్యాదను నటిస్తూ, సూటిగా పంచశూలమ్ వంక చూశాడు. "ఇప్పుడు అర్థంచేసుకున్నాను సార్! మీ యిద్దరిమధ్య ఒకరకమైన స్నేహం వుంది. ఆ స్నేహాన్ని పురస్కరించుకునే ఆమె మీకు కావలసిన స్త్రీలను అరేంజ్ చేస్తున్నది. ఒప్పుకుంటాను. కాని, అంత మంచిమనిషిమీద మీకు పగెందుకు?" అని అడిగాడు.

చిన్నగా గడ్డాన్ని దువ్వుకున్నాడు. "అహింసావాదిని నేను. ఆమెమీద పగలేదు – జాలి వుంది" అన్నాడు పంచశూలమ్.

"జాలి ఉంటే ఆమె పరువు పాడుచెయ్యకూడదు. ప్రాణాలు తియ్యడానికి ప్రయత్నించకూడదు" దబాయించాడు షా.

నిర్లక్ష్యంగా నవ్వాడు పంచశూలమ్. "ఇన్స్పెక్టర్! ఒక్కరి పరువు ప్రతిష్ఠలు పాడు చెయ్యడం, ప్రాణాలు తియ్యడం నా వృత్తి కాదు" అన్నాడు గంభీరంగా.

"లోగడ ఆమె ఎన్నో పెళ్ళిళ్ళు చేసుకున్నదని – పంచామృతం హోటల్లో పేపరుమీద రాసి పంపించారు నాకు. అలా చెయ్యడం ఆమె గౌరవాన్ని దెబ్బతియ్యడం కాదా?"

"కాదు. ఆమె చాలా చాలా పెళ్ళిళ్ళు చేసుకున్న విషయం అబద్ధంకాదు."

"మీరు నిరూపించగలరా?"

"ఆమె ఏడో మొగుడు భీమరాజును అడిగితే మీకు అన్ని సంగతులూ చెబుతాడు. 20 సంవత్సరాలు గడిచిపోయినా, ఆమెమీద మోజుతీరక సరోవర్ అపార్ట్మెంట్స్‌లో ఆమె పక్క ఫ్లాటులోనే వున్నాడు. ఆమెను ఎలాగైనా ఒప్పించి తన సొంతం చేసుకోవాలనుకున్నాడు. అఫ్‌కోర్స్.... అతన్ని



## గ్రోవర్ బాధ

విలన్ పాత్రలు దరించే గుల్షన్ గ్రోవర్ కంట తడిపెడుతున్నాడట కారణం ఏమిటయ్యా అని అడిగితే దేవానంద్ తనను అన్యాయం చేశాడంటున్నాడు

సచ్చే కా బోల్ బాలా లో తన పాత్రను దేవానంద్ సగం పైగా తీస పారేశాడని తనను ప్రక్కకు నెట్టేశాడని గ్రోవర్ ఆరోపణ షూటింగ్ సమయంలో ఈ విషయమై గొప్ప తగాదా పెట్టుకొన్నాడట దేవానంద్‌తో సరేనని అవకాశం యిచ్చినట్లే యిచ్చి తర్వాత కత్తిరించి పారేశాడట! అందుకే దేవానంద్ గురించి ఆడిపోసుకుంటున్నాడు



విడిచిపెట్టాక మరో మూడు పెళ్ళిళ్ళు చేసుకుంది - ఎం ఎల్ ఎ దీపాదేవి

ఎదో ఆలోచిస్తూ మౌనంగా వుండిపోయాడు షా

వయసు మీరిన నెరజాణ దీప ఆమె ప్రతి నరంలోనూ విషమే వుంది ఆమె శరీరం అందమైన యమకూపం మీరు వయసులో వున్నారు ఇప్పుడే డ్యూటీలో ప్రవేశించారు జీవితంలో ఎన్నో సాదించవలసివుంది అందుకే ఆమె వ్యామోహంలో పడకుండా వుండాలని మిమ్మల్ని హెచ్చరించాను అన్నాడు దృఢ కంఠస్వరంతో పంచశూలమ్

అతను చెప్పినదానిలో చాలావరకు నిజముంది కాని యింకా ఎదో దాస్తున్నాడు - దాచడానికి ప్రయత్నిస్తూ యుక్తిగా సమాధానం చెబుతున్నాడు అనిపించింది షాకి

పోలీసుల సిద్ధాంతం ప్రకారం - తప్పు చేసినా చెయ్యకపోయినా అనుమానం వున్న వ్యక్తిమీద బలమైన అపరాధం వెయ్యాలి అతన్ని మానసికంగా బలహీనుణ్ని చెయ్యాలి తర్వాత అతనిచేత నిజం చెప్పించాలి

ఈ సూత్రాన్నే అమలుపరచాలనుకున్నాడు షా ఆమెమీద మీకు పగలేదన్నారు కాని కత్తితో బలప్రయోగం చేసి ఆమెను చంపడానికి ఎందుకు ప్రయత్నించారు? అని అడిగాడు - పంచశూలమ్ ముఖంలోకి సూటిగా చూస్తూ

అలాంటి చిన్నచిన్న దుర్మార్గాలు చేసే అలవాటు లేదు నాకు నేను గదిలోకి వెళ్ళేసరికే ఆమెమీద ఎవరో అమాయిత్యం చేశారు ఆమె ముఖమంతా రక్తసిక్తమైపోయింది వేడివేడి రక్తం నుదుటిమీద నుండి కారుతూనే వుంది ఆమె నిస్సహాయస్థితి చూసేసరికి నా హృదయం ద్రవించుకుపోయింది

పెదవుల మధ్యనున్న పైప్ జారిపోయింది అంతేనా స్సార్! పంచశూలమ్ చెప్పదలచుకున్నది షాయే చెప్పాడు

కరెక్ట్ అదే జరిగింది ఇహ అక్కడ నిలబడలేక బైటకు వచ్చేశాను

ప్రతి ప్రశ్నకు పంచశూలమ్ దగ్గర సమాదానం రెడీగావుంది అలా జవాబులు చెబుతూ వుండటం వల్లనే యింతవరకు అతను పోలీసులకు దొరక లేదు అనుకున్నాడు షా సంబాషణ మారుస్తూ మీరు దీపాదేవి ఫ్లాటులోకి వెళ్ళేటప్పుడుగాని వచ్చేటప్పుడుగాని - ఒంటికి పసుపురాసుకుని నేతచీర కట్టుకున్న యువతిని చూశారా? అని ప్రశ్నించాడు

పసుపు రాసుకుని నేతచీర కట్టుకున్న యువతా? సాలోచనగా రెట్టించాడు పంచ శూలమ్ అతని కళ్ళముందు వూర్వశి కదిలింది

ఔను చూశారా? ఉత్సాహంగా అడిగాడు షా

లేదు క్లుప్తంగా సమాధాన మిచ్చాడు పంచశూలమ్

అతని ముఖంలోకి అనుమానంగా చూశాడు కొన్ని క్షణాలు ఆలోచిస్తూ వూరుకున్నాడు మరో పాయింటు దొరికింది సార్! దీపాదేవిని ఎవరో కత్తితో పొడవడానికి ప్రయత్నించారు ఆమెను గాయపరచి పారిపోయారు మీరు వెళ్ళేసరికే ఆమె రక్తపు మడుగులో వుంది ఆమె నిస్సహాయ పరిస్థితిని కళ్ళారా చూసి బాధపడ్డారు మీరు ఔనా సార్? అని ప్రశ్నించాడు

అనవసరమైన ప్రశ్నలతోను సమస్యలతోను తనను తికమకపరచడానికి షా ప్రయత్నిస్తున్నాడని అర్ధంజేసుకున్నాడు పంచశూలమ్ అతనికి అలాంటి అవకాశం యివ్వకూడదనుకున్నాడు

ఇన్స్పెక్టర్! మిలటరీలో వుండగా ఎన్నోవేలమంది నా కళ్ళముందు చనిపోవడం చూశాను రక్తపు టేరులు ప్రవహించడం ఆ రక్తంలో శవాలు కొట్టుకుపోవడం కూడా నాకు తెలుసు అలాంటి బీబత్సకరమైన దృశ్యాలు చూసి ఆనాడు బయపడలేదు ఎందుకో తెలుసా? ఎదురు ప్రశ్నవేశాడు

ఎందుకు?

ఆ వయసు వేరు ఆ పరిస్థితులు వేరు రణభూమిలో రక్తానికీ శవాలకూ విలువలేదు కాని ఈనాడు రక్తాన్నీ దీప దుస్థితినీ చూడలేక పోయాను అందుకే అక్కడ వుండలేక వెంటనే బైటకు వచ్చేశాను

నిజమే ఈ వయసులో అలాంటి దుర్ఘటనలు చూడలేరు ఒప్పుకుంటాను కాని మీరు రిటైర్డ్ మిలటరీ ఆఫీసరుగా బాధ్యతగల వ్యక్తిగా ఈ విషయాన్ని పోలీసులకు ఎందుకు రిపోర్ట్ చెయ్య లేదు?

ఆ వీది చివరిలో టెలిఫోన్ బూత్ వుంది పోలీసులకు ఫోన్ చేద్దామని బూత్‌లో కెళ్ళాను ఇంతలో మీరు మోటర్‌సైకిల్‌మీద రావడం చూశాను నా ప్రయిత్నాన్ని మానుకున్నాను

అతని సమాదానం నచ్చలేదు షాకి బీమరాజు లాగే పంచశూలమ్ కూడా ఎదో మస్కాపెడు తున్నాడని రూడపరచుకున్నాడు లోపలనుండి కోపం పొంగిపోతోంది స్టిక్‌తో వేళ్ళమీద కొట్టు కున్నాడు కొద్దిగా తమాయించుకున్నాడు కాని మీరే దీపాదేవిమీద దౌర్జన్యం చేశారని నా అనుమానం అన్నాడు సూటిగా అతని కళ్ళల్లోకి చూస్తూ

అనుమానానికీ వాస్తవానికీ చాలా బేదంవుంది

దీపాదేవిని బెదిరిస్తూ బ్లాక్‌మెయిల్‌చేస్తూ ఆమె తల కావాలన్నారు అది అపరాదం కాదా?

నేనా?

ఔను యమపాశమ్‌గారూ!

నా పేరు పంచశూలమ్

యమపాశమ్ కూడా మీరే

చిన్నగా నవ్వాడు విలాసంగా మీసాలు దువ్వుకున్నాడు గుడ్! ఇన్స్పెక్టర్! మీకు అలాంటి అనుమానాలుంటే - వారంటు తీసుకొచ్చి ఏ క్షణా న్నయినా నన్ను అరెస్ట్ చెయ్యవచ్చు కాని ఒక్క విషయం అని ఆగాడు పంచశూలమ్

ఏమిటది?

సివిల్ డ్రస్‌లో రండి - బలాబలాలు చూసుకుందాం బై బై అని యిహ మాట్లాడ వలసింది ఏమీ లేదన్నట్లు తన బంగ్లావైపు నడిచాడు పంచశూలమ్

నొసలు చిట్లించాడు షా కొన్ని క్షణాలు అతనివంకే చూస్తూ నిలుచున్నాడు కోపాన్ని అణచుకోలేక - బూటుకాలితో జీపు టైర్‌ని తన్నాడు డ్రైవింగ్‌సీట్లో కూర్చుని యింజన్ స్టార్ట్ చేశాడు షా

## 43

మహావేగంగా పరుగెత్తుతోంది జీప్ అంతకంటే వేగంగా మళ్ళీమళ్ళీ పరుగెత్తుతున్నాయి - షా మెదడులో రకరకాల ఆలోచనలు

ఎవరీ పంచశూలమ్?

అతనికి దీపాదేవికి సంబంధం ఏమిటి?

జయరాజ్‌కు అతనికి మధ్యగల స్నేహం ఎలాంటిది?

గురూజీకి అతనికి వున్న మిత్ర బంధం

ఎటువంటిది?

దీప కోసం ఎందుకు తపస్సు చేస్తున్నాడు బీమరాజా? అతని ఆంతర్యమేమిటి? అతని పూర్వచరిత్ర ఏమిటి???

ఆలోచనల్ని ఆపుజేస షడన్ బ్రేక్ వేశాడు షా

అబ్దుల్లా ఎరియాకు సంబందించిన పోలీసు స్టేషన్ ముందు ఆగింది జీప్

జీప్‌లోంచి దిగాడు షా గబగబా స్టేషన్ లోపల కెళ్ళాడు

అబుల్లా గది పక్కనే లాకప్ రూమ్ వుంది నలుగురు కానిస్టేబుల్సు ఇద్దరు ఎస్ ఐ లు అబ్దుల్లా నిలబడివున్నారు – ఆ జైలుగదిముందు

గుడ్మార్నింగ్! అన్నాడు షా

గుడ్మార్నింగ్! అంటూ రెండడుగులు ముందుకు వచ్చాడు షా చెయ్యిపట్టుకున్నాడు అనుకోని అనర్ధం జరిగిపోయింది మిస్టర్ షా! అన్నాడు కంగారుగా అబ్దుల్లా

ఎమయింది?

బీమరాజా ఆత్మహత్య చేసుకున్నాడు

ఉలిక్కిపడ్డాడు షా నొసలు చిట్లించాడు మీ లాకప్‌లో వుండగానే జరిగిందా ఈ విపరీతం? అన్నాడు

ఔను రండి అంటూ షాను లాకప్ రూమ్ దగ్గరకు తీసుకెళ్ళాడు అబ్దుల్లా

ఆ జైలుగది తలుపు తెరిచేవుంది పోలీసులంతా బైట నిలబడ్డారు ఇన్స్పెక్టర్లను చూస కొంచెం పక్కకు తప్పుకున్నారు

లోపలికి దృష్టిని సారించాడు షా పరీక్షగా చూశాడు

గదిలో – బకాసురుడిలా వెల్లకిలా పడివున్నాడు బీమరాజు ముఖం నల్లగా వుంది నోటిలోంచి కొద్దిగా నురగ వచ్చింది తల పక్కకు వాల్చేశాడు

విషప్రయోగమా? ప్రశ్నించాడు షా

అదే అర్ధంకావడంలేదు రాత్రి లాకప్‌లో పెట్టాము అప్పటినుంచి ఈ తలుపు తియ్యలేదు అర్ధగంట క్రితం యిక్కడికి వచ్చాను నేను కానిస్టేబుల్సును అడిగితే విషం తిని ఆత్మహత్య చేసుకున్నాడని చెబుతున్నారు ఇంతసేపు సంది గ్ధంలో వుండి ఇప్పుడే తాళం తీయించాను

రాత్రి మరెవరైనా స్టేషన్‌కి వచ్చారా? సార్జంటును ఉద్దేశించి ప్రశ్నించాడు షా

ఓ యువతి వచ్చింది సార్! సమాదాన మిచ్చాడు సార్జంటు

ఎవరామె?

పాత ముద్దాయే

వ్యబిచారా?

ఔను సార్

పేరు?

ఊర్వశి

ఎలా వుంటుంది?

22–23 ఏళ్ళుంటాయి ఎర్రగా అందంగా వుంటుంది ఒంటినిండా పసుపు రాసుకుంటుంది ఎర్ర బొట్టు పెడుతుంది నేతచీర కడుతుంది చాలా మంచిఎల్లా సార్! దాని ఖర్మకాలి ఆ వృత్తిలోకి దిగింది వివరాలు చప్పాడు సార్జంటు

ఐ స అంటూ లాకప్‌రూమ్‌లో కెళ్ళడు షి ఓమారు బీమరాజా దేహాన్ని నిశితంగా పరీక్షించాడు

టార్చ్ అన్నాడు

పోలీస్‌స్టేషన్‌లోని లాకప్‌రూమ్‌లు పగలు కూడా చీకటిగానే వుంటాయి!

ఓ కానిస్టేబుల్ టార్చ్ తెచ్చియిచ్చాడు అబ్దుల్లా కూడా లోపలకు వచ్చాడు

టార్చ్ వెలిగించాడు షా కాంతిని బీమరాజా ముఖంమీద ప్రసరింపజేశాడు

అతని కళ్ళు బయంకరంగావున్నాయి ముఖం రాక్షసిబొగు లా వుంది అతని చేతులమీదకు దృష్టివి సారించి మిస్టర్ అబ్దుల్లా! ఇది – ఆత్మహత్య కాదు – హత్య అన్నాడు షా

ఇంపాసబుల్ ఈ లాకప్‌రూమ్ తాళాలు నా దగరే వున్నాయి రాత్రినుండి మనవాళ్ళు అతనికి మంచినీళ్ళు కూడా యివ్వలేదు అతని కతనే విషం తిని చచ్చాడు చాలెంజ్ చేస్తున్నట్లు అన్నాడు అబ్దుల్లా

అలా చూడండి బీమరాజా ఎడమచేతి చూపుడు వేలు మీదకు టార్చిని ప్రసరింపజేశాడు షా

ఆ వేలువంక చూశాడు అబ్దుల్లా

గోరుకింద ఓ రక్తపుచుక్క గడ్డకట్టుకుంది ఆ వేలితో పాటు చెయ్యంతా నల్లగా వుంది

అయోమయంగా షా వంక చూశాడు అబ్దుల్లా

ఏదో శక్తివంతమైన విషాన్ని వేల్లో గుచ్చారు అంత బలమైన శరీరం వుండి కూడా అతను ఆ విషానికి తట్టుకోలేకపోయాడు క్షణాల్లో ప్రాణాలు విడిచిపెట్టేస వుంటాడు

తల తిరిగిపోయింది అబ్దుల్లాకు

– తన కష్టడీలో వున్న ఓ వ్యక్తి హత్యగావింప బడ్డాడు అతను మామూలు మనిషకూడా కాడు – పహిల్వాన్! ప్రజల్లోనూ ప్రభుత్వంలోనూ పలుకు బడి గల వ్యకి పై అదికారులు కలగజేసుకుంటారు తనకు మాట వస్తుంది డిస్‌మిస్ కూడా చేస్తారు

ఆలోచిస్తున్నకొద్ది మతిపోతున్నట్టయింది అబ్దుల్లాకు మిస్టర్ షా! రాత్రి నేను స్వయంగా యితన్ని గదిలో పెట్టి తాళం వేశాను ఇప్పుడు నేను దగ్గరుండి తలుపు తీయించాను ఈమద్యలో మరొకరు ఈ గదిలోకి రావడానికి అవకాశంలేదు అన్నాడు

విషాన్ని ప్రయోగించినవాళ్ళు ఈ గదిలోకి రానక్కర్లేదు పొడవైన సూది లాంటి పరికరంతో – గదిబైట నుంచే యితని వేలులో విషం గుచ్చి వుంటారు

ఈ ఘోరం మనవాళ్ళే చేశారా?

సవిలియన్స్ కూడా కాకీ డ్రస్ వేసుకుని పోలీసుల్లా కనిపిస్తున్నారు ఈ రోజుల్లో పోలీసులు సవిల్‌డ్రస్ వేసుకుని మామూలు మనుషుల్లా వుంటున్నారు మనవాళ్ళే చేస వుండొచ్చు మరొకరు చేసవుండొచ్చు ఏదైనా కానివ్వండి – జరగకూడని దుర్ఘటన జరిగి పోయింది

కొన్ని క్షణాలపాటు నోట మాట రాలేదు అబ్దుల్లాకు ఓమారు – చుట్టూవున్న తన సబ్బంది వంక చూశాడు అసహనంగా గుబురు మీసాలు పీక్కున్నాడు మిస్టర్ షా! ఈ అవమానాన్ని అసమర్ధతను బరించలేను ఉద్యోగానికి రాజీ నామా యిస్తాను అన్నాడు

అతని బుజం తట్టాడు షా ఇది అవమానం కాదు – మన విజయానికి ప్రదమ సోపానం





భీమరాజు సామాన్యమైనవాడు కాడు అతనిలో ఏవో బలహీనతలూ రహస్యాలూ వున్నాయి దీప కోసం వల వేశాడు ఇంకా ఏవో అంరాదాలు చేశాడు అందుకే విరోదులు అతన్ని హత్య చేశారు అన్నాడు

పోలీస్‌స్టేషన్‌లో హత్య చెయ్యడానికి ఎన్ని గుండెలుండాలి? చిన్నగా నవ్వాడు షా పబ్లిక్ ప్లేసుల కంటే పోలీస్‌స్టేషన్‌లో హత్య చెయ్యడమే ఈజీ సేఫ్టీ కూడాను అన్నాడు

ఇంతలో

హాస్పటల్లో దీప దగ్గర కాపలా కెళ్ళిన యిద్దరు కానిస్టేబుల్సు చేతులు వూపుకుంటూ వచ్చారు ఇన్‌స్పెక్టర్లకు సెల్యూట్ చేశారు

దీపాదేవి ఎలావుంది? అబ్దుల్లా ప్రశ్నించాడు

ఆమెకేం సార్! బంగారంలా వుంది ఓ కానిస్టేబుల్ సమాదాన మిచ్చాడు

స్పృహలోకి వచ్చిందా?

రాత్రే స్పృహ వచ్చింది సార్! డాక్టర్లతోనూ నర్సులతోనూ మాతోనూ చక్కగా మాట్లాడింది చాలాసేపు అటూ యిటూ తిరిగింది తెల్లవారేసరికి మామూలు మనిషిలా తయారయింది

ఏదో అనుమానం వచ్చింది షాకు పులిఏరి కాయ నొక్కుకుంటూ ఆలోచనలో పడ్డాడు

అంతలోనే ఆమెను విడిచిపెట్టి ఎందుకొచ్చారు మీరు? ప్రశ్నించాడు అబ్దుల్లా

అదేమిటిసార్? – మీరేకదా రమ్మన్నారు?

డేమ్ డెకొరం నేనా? రెట్టించాడు అబ్దుల్లా

ఔను సార్! అర్ధగంట క్రితం మీరు ఫోన్ చేశారు మొదట ఆ అమ్మగారే ఫోన్ తీసుకున్నారు మీతో ఐదు నిముషాలు మాట్లాడారు తర్వాత నన్ను పిలిచారు నేను స్వయంగా మీతో మాట్లాడాను

నేను నీతో మాట్లాడానా?

యస్సార్! – దీపాదేవిగారి దగ్గర కాపలా వుండనక్కర్లేదు వారి ఆరోగ్యం బాగావుంటే టాక్సీ మాట్లాడి యింటికి పంపించేయండి మీ రిద్దరు వెంటనే స్టేషన్‌కి వచ్చేయండి అన్నారు మీరు ఏనేదో చెప్పబోతే – షటప్! హోమ్ మినిష్టర్‌గారి దగ్గర నుండి ఆర్డర్సువచ్చాయ్ నేను చెప్పినట్టు చెయ్యండి అని మంచిమంచి బూతులు కూడా తిట్టారు శ్రీ నాట్ ఎక్స్ రంగనాదం మాట్లాడబోతే – మరీ తిట్టారట వెంటనే మీ ఆర్డరు ప్రకారం ఆమెగార్ని టాక్సీ ఎక్కించి ఒక్క నిముషం కూడా ఆలస్యం చెయ్యకుండా మేమిద్దరం యిలా వచ్చేశాం అన్నాడు రెండో కానిస్టేబుల్

వాళ్ళ మాటలు వినేసరికి స్తంభించిపోయారు అబ్దుల్లా షాలు!!!

అంతలో షా చేతి గడియారంలోంచి అలారం వినిపించింది ఐ జి గార్ని కలవలసిన టైమ్ గుర్తుకొచ్చింది తర్వాత వస్తా అంటూ జీప్‌వైపుకు పరుగెత్తాడు – ఇన్‌స్పెక్టర్ ఆలీషాగా చెలామణీ అవుతున్న ఆ యువకుడు!!!

## 44

ఇన్‌స్పెక్టర్ ఆలీషా చెప్పిన వివరాలను తర్జన భర్జన చేసుకున్నాడు ఐ జి మహేంద్ర

అతని స్టేట్‌మెంట్ ప్రకారం అపరాధులంతా కళ్ళముందే వున్నారు కాని ఆధారాలు దొరకడం లేదు వాటికోసమే అతను ఓపిగా పరిశోదిస్తున్నాడు

అతన్ని సి బి ఐ ఆహ్వానించింది కేసు పూర్తిగా వివరించి పరిశోదించమని పంపించింది

ఒక స్టేటులో పనిచేస్తున్న పోలీసు ఉద్యోగిని సి బి ఐ ఆహ్వానించి ఆ స్టేటులో వున్న అపరాదుల్ని పరిశోదించి పరిశీలించి కేసు పరిష్కరించమని – అతనికే అప్పగించడం స్టేటు పోలీసు డిపార్టుమెంటుకే గర్వకారణం అయినా సి బి ఐ వారు చాలా తెలివిపరులని చెప్పుకోడానికి యిదో పెద తార్కాణం ఒక కేసును పరిష్కరించడానికి వారు ఎన్నో వేషాలు వేస్తారు ఎన్నెన్నో నాటకాలాడతారు ప్రాంతీయ సి ఐ డి యిన్‌స్పెక్టర్నే వారి తరఫున పంపడం – సి బి ఐ ఆడే నాటకాల్లో అంతర్నాటకం ఏది ఏమైనా ఈ కేసు పరిశోధిస్తే సి బి ఐ కంటే స్టేటు పోలీసు డిపార్టుమెంటుకే ఎక్కువ గౌరవం లభిస్తుంది

ఆలోచిస్తూనేవున్నాడు మహేంద్ర ఇంతలో టెలిఫోన్ మోగింది రిసీవరు అందుకున్నాడు

హలో! ఐ జి స్పీకింగ్ అన్నాడు

మిస్టర్ మహేంద్రా! ఢిల్లీ నుండి సి బి ఐ డైరెక్టర్ ఆదిత్య మాట్లాడుతున్నాను

గుడ్ మార్నింగ్ సార్!

వెరీ వెరీ గుడ్మార్నింగ్! చిన్న ఇన్‌ఫర్‌మేషన్ కావాలి

ఆలీషా గురించేనా?

ఔను

జస్ట్ ఇప్పుడే అతను వచ్చి చాలా వివరాలు చెప్పాడు

ఏమిటవి?

గురూజీ – విశాలాక్షి, జయరాజ్ – పరిమళ దీపాదేవి – ఈ ఐదుగురితో అతను బాగా పరిచయం పెట్టుకున్నాడు వాళ్ళ యిళ్ళకు తరచుగా వెళ్ళివస్తున్నాడు రకరకాలుగా పరిశోధిస్తున్నాడు కాని పాతికేళ్ళ క్రితం వాళ్ళు చేసిన నేరాల నీడలు కూడా వారి జీవితాల్లో కనిపించడంలేదు మీరు వివరించిన ప్రకారం వాళ్ళు అపరాధులే దొంగలే హంతకులే కాని ఆధారాలు దొరకడంలేదు ఎక్కడైనా ఓ క్లూ దొరుకుతుందేమోనని అనుక్షణం ప్రయత్నిస్తూ వేటాడుతున్నాడు

ఇది మీ ఉద్దేశ్యమా?

కాదు అతను యిప్పుడు స్వయంగా వచ్చి చెప్పిన మాటలే తిరిగి మీకు చెప్పాను

ఇందులో కొత్త పాయింట్స్ లేవు ఇవన్నీ నాకు తెలిసినవే

అతను చాలా దీక్షగా పనిచేస్తున్నాడుసార్!

ఒప్పుకుంటాను అతను చాలా సిన్సియర్ అని నిశ్చయించుకున్న తర్వాతనే – అతనికి ఈ కేసు అప్పగించాను లేకుంటే సెంట్రల్ నుండే సి ఐ డి లను పంపేవాడిని సి బి ఐ పరిశోధించినా స్టేట్ పోలీసుశాఖ పరిశీలించినా – అపరాధుల్ని వెంటనే సహేతుకంగా ఉరికంబ మెక్కించడమే నాకు కావాలి

## ఏమవుతుంది?

అర్ధరాత్రికి మాటొస్తే
అలసిన తనువులకు జోలపాడుతుంది!
అమావాస్యకు నవ్వొస్తే
చీకటిని వెన్నెల చేస్తుంది
అగాధంలో పూలతీగకు ఆసరా ఇస్తే
ఆకాశ శిఖరాల కెగబాకుతుంది!
చిరుకొమ్మకు చిగురొస్తే
వసంతమై విరుస్తుంది!
చెదిరిన హృదయానికో చల్లని దీవెననిస్తే
చైతన్యాన్ని ఆహ్వానిస్తుంది!
చీకటి బ్రతుకులో చిరు ఆశాదీపంవెలిగిస్తే
నిరాశాతిమిరంతో పోరాడుతుంది!

– వడ్లమూడి దుర్గాంబ

అదే ప్రయత్నంలో వున్నాడు షా

అలా వుంటాడనే అతన్ని ఎన్నుకున్నాను అఫ్‌కోర్స్ – ఈ కేసు సందర్భంలో నేను కొత్త పద్ధతిని అవలంబించాను మా డిపార్టుమెంటులో హేమా హేమీలు వున్నా ప్రాంతీయతను దృష్టిలో పెట్టుకుని అలీషాను ఆహ్వానించి కేసు వివరించి హైదరాబాదు పంపించాను అతను ఈ కేసు పరిష్కరిస్తే – ఆ గౌరవం మాకు కాదు – స్టేటుకే దక్కుతుంది మాకు కావలసింది గౌరవం కాదు – రిజల్ట్స్

ఆదిత్య మాటలు వినేసరికి ఆత్మాభిమానం దెబ్బతిన్నట్లనిపించింది మహేంద్రకు సార్! వాళ్ళ ఐదుగుర్నీ అనుమానం మీద అరెస్ట్ చేస్తాను ఆ తర్వాత ఆధారాలు చూపించవచ్చు అన్నాడు

తొందరపడవద్దు ఇలాంటి కేసుల్లో ఓర్పు నేర్పు సమయస్ఫూర్తి కావాలి ఈ విషయం మీకు కూడా తెలుసు

ఒక్కక్షణం ఆలోచిస్తూ వూరుకున్నాడు మహేంద్ర ఆల్‌రైట్ సార్! ఈ పరిస్థితుల్లో ఏం చెయ్యాలో ఎలా ముందుకు వెళ్ళాలో మీరే చెప్పండి అన్నాడు – తన హోదాను అధికారాన్ని వ్యక్తిత్వాన్ని కూడా మరచిపోయి

పంచశూలమ్ అనే వ్యక్తిమీద ఓ కన్నువేసి వుంచండి వీలయినంత త్వరలో నేనువచ్చి – అన్ని విషయాలూ మీతో ముఖాముఖీ మాట్లాడతాను

ఓ కే

ఓ కే

అవతలి ఫోను కట్‌చేసినట్లు – క్లిక్ అన్న శబ్దం వినిపించింది

రిసీవరు ఫోన్‌మీద పెట్టి పంచశూలమ్! పంచ శూలమ్!! పంచశూలమ్!!! అని మూడుసార్లు తనలో తానే రెట్టించుకున్నాడు మహేంద్ర!

(ఇంకావుంది)

# ప్రశ్నావళి

## కె రామలక్ష్మి

బి కుమారస్వామి వరంగల్

★ మన దేశంలో స్త్రీ పురుష సమానత్వం ఎప్పుడు వస్తుందంటారు? చట్టాల్లో కాదు మనుషుల్లో

● చట్టాల్లో మాకు అన్నీ వున్నాయి సార్ కాని సమాజ పరంగా న్యాయం మగవాడి చేతుల్లో వుంది అందునే సమానత్వం నేతి బీరకాయ చందం (సమానత్వం అంటూ గోల పెడతారు- ఎం మమ్మల్ని ఎల్లల్ని కనమనా మీ ఉద్దేశ్యం? అంటూ కోప్పడ్డా డొక పెద్ద మనిషి నన్ను కాదు స్వామీ యిష్టంలేని ఎల్లల్ని కనేలా చేయకుండా వుంటే అదే చాలు అన్నాను అలా వెకిలి ఊహలపాలై పోతుంది సమానత్వం అనే అతి ముఖ్యమైన విషయం ఇది నిజంగా దురదృష్టం?)

జి రమేష్ పట్నాయక్ రాయగడ

★ మనం కోర్టుకు వెళ్లి నిజం చెప్పే రోజులు ఎప్పుడు వస్తాయి అక్కయ్యా?

● రావయ్యా చస్తూ కూడా నిజం చెప్ప ధైర్యం లేకుండపోతూన్న యీ రోజుల్లో కోర్టుల్లో సాక్ష్యం చెప్తారేగాని నిజం ఎందుకు చెప్తారు?

★ ఒక అమ్మాయి అబ్బాయి ప్రేమించుకున్నారు చెప్పుడు మాటలు విని అమ్మాయి విడిపోతుంది ఆమె మనసు మరలాలంటే ఎం చెయ్యాలి!?

● ఈలోగా చెప్పుడు మాటల ప్రభావం మీపై పడకుండా వుండాలకదా!

ముత్యం రమాదేవి బళ్లారి

★ ఈమధ్య విదేశాలు తిరిగి వచ్చారుకదా అక్కడ మిమ్మల్ని అత్యంతంగా ఆకర్షించిన దేమిటి?

● శుభ్రత (అక్కడా మురికిపేటలు లేకపోలేదు)

★ మీ అన్నల్లారా నా తప్పేమిటి? చలా సూపర్బ్‌గా వుంది నవల ముగింపు యింకోలా వుంటే బాగుండేది కె రా గారు

● ఎలా? అన్నలు అతి ప్రేమగా సరస్వతిని చేరతీయాలా? నిత్య పేఎంటుగా సరస్వతి చాలా సంతోషంగా వుండిపోతుందా? చూడండి ఎదురు చూడని దెబ్బ కొడుతుంది విధి అదే సరస్వతి విషయింలో జరిగిందని నా ఊహ

★ పత్రికలో ఎన్నో మార్పులు వచ్చాయి మరి మీ ప్రశ్నావళిలో కూడా వస్తాయా?

● స్లోగా వస్తున్నాయి చూడంలేదా!

★ మాలతీ చందూర్‌గారి ప్రమదావనానికి మీ ప్రశ్నావళికి తేడా ఎమిటి?

● ఆమె నిండు కుండ
నేను ఓటి కుండ!

జి కృష్ణమూర్తి విజయవాడ

★ సభ్యత అంటే?

● అందరికి యిబ్బంది లేకుండా మనం ఎవరి ంచకుండమే సభ్యత అదో వ్రతం కాదు!

వలపాక ప్రకాష్ విజయవాడ

★ అనేక గొడవల్లో ఆడవాళ్ళు ఉరేసుకు చనిపోవడం పరిపాటి అయిపోయింది అదే పని మగవాళ్లు చెయ్యాలెందుకు? కారణం?

● ఉరేసుకు చనిపోవడానికి చాలా గట్స్ కావాలి కాల్చుకు చనిపోవడానికి లాగే అవి తెగించన ఆడదానికి వస్తాయి బ్రతుకుమీద అంత విరక్తి పుట్టినప్పుడా తెగింపు వస్తుంది ఈ దారి కాదు మరోం భయంలేదు, అని ధైర్యం చెప్పేపాటి ప్రాణిలేక కూడా వస్తుందా తెగింపు

శ్రీకొండ నవీన నెల్లూరు

★ ఐ బిలీవ్- జస్టిస్

● కాస్త తెలుగులో రాయివయ్యా బాబూ- ఈ ఇంగ్లీ షెందుకు?! న్యాయం- న్యాయస్థానం న్యాయ నిర్ణయం- పని చేసే తీరు దారుణంగా వుందని- చాలా చాలా కేసులునిరూపిస్తూనే వున్నాయంటున్నాయి చూడ్డం లేదా?! పోలీసులు శీలం దోచుకుంటే- కోర్టు ఆమె వ్రలాప్సరు అంచట- ఈ వార్త వినలేదా! మన బాధితులకి అంత న్యాయం జరుగుతూంది

యు యు ఉరుకుంద ఎమ్మిగనూరు

★ ఆనందం అందరితో పంచుకో దుఃఖం ఒక్కడివే అనుభవించు అంటారుగాని నా బాధ మీతో పంచుకుంటున్నాను నాన్న ప్రేమను ముప్పయ్యేళ్లుగా ఒక్కడినే పంచుకున్నా అందుకే బాధ అనుభవిస్తున్నా

● సారీ! ఒకొక్కప్పుడు దుఃఖం పంచుకోవచ్చు- అది సగం అవుతుంది- పంచుకున్న ఆనందం రెట్టింపినట్టు మీరు పోయిన వారిని గురించి కంటే వారి ఆశయాలను అనుసరించే పనిలో పడితే దుఃఖం తగ్గి పోతుంది

జూన్ 16-30 కోటవిజాలు

ప్రారంభం!

కన్న బిడ్డ కోసం అమెరికా వెళ్లిన భారతమాత చెప్పిన అనుభవాలు- ఆశ్చర్యాలూ!

సుప్రసిద్ధ కె. రామలక్ష్మి 'కలం' తీసిన కమనీయ దృశ్యాలు



# ALLWYN
QUARTZ



మీకు మీ ప్రత్యేకమైన జీవన శైలి, ప్రత్యేకమైన జీవితపు విలువలు వున్నాయి. కాలంతో కదిలే ప్రపంచంలో కాలం మీ ప్రక్కన వుండడంతో మీరు విశిష్ట వ్యక్తిగా నిలబడతారు.




## ఆల్విన్ క్వార్ట్జ్: మీ వలె విశిష్టమైనది!




Manufactured under licence from
**SEIKO**

కాలం పరీక్షకి నిలిచిన ఆల్విన్ క్వార్ట్జ్ గడియారాలు. ప్రపంచపు మేటి సాంకేతిక విజ్ఞానంతో సృష్టించబడిన గడియారాలు. అందమైన గోల్డ్ లేక నాజూకుగా వుండే స్టెయిన్‌లెస్ స్టీల్ కేసులలో అత్యుత్తమ కాలసూచిక వుంటుంది. మావల్లనే కాక మీరు ఊహించలేనంత ఆశ్చర్యం కలిగించే 250 మోడల్స్‌లో మీకు నచ్చిన గడియారాన్ని ఎన్నుకోండి. ఆల్విన్ ప్రతి గడియారమూ మీ వలె ప్రత్యేకమైన వ్యక్తిత్వం కలిగి వుంది.



R K SWAMY/HAL/6958/TEL

# నీరు ద్రవరూపంలోవున్న బంగారం



## ప్రొఫెసర్ డాక్టర్ బ్రిజ్ కిషోర్

"దురదృష్టవశాత్తూ మనదేశంలో ఉపరితల జలాలు రాష్ట్రాలసొత్తు భూజలం భూ స్వంతదారుడి సొత్తు అయిపోతోంది ఇది సరయిన పద్ధతికాదు నీళ్ళు ఉమ్మడిసొత్తు కావాలి అంటున్నారు హైదరాబాద్ స్కూల్ ఆవ్ ఎన్విరాన్‌మెంట్ అండ్ వాటర్ రిసోర్సెస్ అధిపతి జవహర్లాల్ నెహ్రూ టెక్నలాజికల్ యూనివర్సిటీ డీన్ ప్రొఫెసర్ డాక్టర్ బి హెచ్ బ్రిజ్‌కిషోర్

జల పరిశోధనలపై వీరి కృషికి ఆస్ట్రేలియన్ వాటర్ కౌన్సిల్ అవార్డ్ క్రిష్ణన్ గోల్డ్‌మెడల్ ఆవ్ నేషనల్ జియోఫిజికల్ యూనియన్ ఆంధ్రప్రదేశ్ అకాడమీ ఆవ్ సైన్స్ యంగ్ సైంటిస్ట్ అవార్డ్ రాజ్యలక్ష్మి అవార్డ్ ఇటీవలే భరత్‌సింగ్ అవార్డ్ లాంటి ప్రతిష్ఠాకర అవార్డు లెన్నో పొందారు అమెరికా కెనడా పశ్చిమజర్మని నెదర్లాండ్స్ ఆస్ట్రేలియా మొదలయిన దేశాలకి చెందిన అనేక యూనివర్సిటీలకు వారి ఆహ్వానంపై వెళ్ళి జల పరిశోధనకు చెందిన రకరకాల అంశాలపై యిచ్చిన ఉపన్యాసాలు అనేకమంది విజ్ఞుల మన్ననల్ని పొందాయి

వర్షాల ద్వారా భూమిలోకి ప్రవేశించే నీటినికన్నా ఎక్కువ నీటిని భూమిలోపలనుంచి తీయడం మంచిదికాదు అధికంగా భూగర్భ జలాన్ని తోడివేయడంవల్ల లోపల పొరలమధ్య తడిలేక భూకంపాలు మొదలయినవి ఎక్కువగా రావడానికి వీలుంది అంటారీయన

నీళ్ళు ద్రవరూపంలో వున్న బంగారం విచ్చలవిడిగా దుబారాగా వాడేయడంవల్ల ఈ ద్రవ బంగారం ఖర్చయిపోతుంది అందుకని జాగ్రత్తగా అవసరమైనంతే నీటిని పొదుపుగా వాడుకోవాలని ప్రజలందరికీ ఈయన ఎలుపు నిస్తున్నారు అంతేకాకుండా ప్రకృతి సహజ రూపాన్ని చెడగొట్టడానికి ప్రయత్నించకండి చెట్లని ఎంచండి పరిశ్రమల ద్వారా కాని మరే కారణంచేతకాని జల కాలుష్యాన్ని పెంచకండి అని కూడా విన్నవించుకుంటున్నారు

### బావికి బావికి మధ్య దూరం

రాళ్ళ మధ్య పొరలుగా ప్రవహించే భూగర్భజలాన్ని బావులద్వారా బయటికి తీయాలనుకున్నపుడు బావికి బావికి మధ్య 200 మీ దూరం బోరింగ్‌కి బోరింగ్‌కి మధ్య కనీస దూరాన్ని వుంచాలి లేకపోతే రెండింటికి నీటిని సరఫరాచేసే పాయింట్ ఒకటే అవడంతో నీరు తక్కువగా పడే అవకాశముంది అలాగే వ్యవసాయ బావులకి కూడా మధ్య ౫00మీ కనీస దూరాన్ని వుండేలా చూడాలి పంటల్ని మన స్టేటస్‌కి సింబల్‌గా కాక నేల స్వభావాన్నిబట్టి అక్కడ దొరికే నీటిని బట్టి వేయడం అవసరం ఈ విషయాన్ని వ్యవసాయదారులందరూ గమనించాలి అంటారు బ్రిజ్‌కిషోర్

జల కాలుష్యం యిప్పుడు మరో మహమ్మారిగా తయారవుతోంది పరిశ్రమలకి చెందిన వాళ్ళకి తమ పరిశ్రమ నుంచి ఎటువంటి పదార్థాలు విడుదలవుతాయో తెలుసుకొబట్టి ఆ వేస్ట్ రసాయనాల్ని సరాసరి బయటికి పంపేసి చుట్టుప్రక్కల నేల స్వభావాన్ని మార్చే బదులు ఆ ఎఫులియెంట్స్‌ని ట్రీట్‌చేసి మరీ వదలాలి ఇది చాలా అవసరం ఈ ఎఫులియెంట్ ట్రీట్‌మెంట్ ప్లాంట్‌లను పరిశ్రమలున్న అన్ని చోట్లా ప్రభుత్వం ఏర్పాటుచేసి వాటి నిర్వహణ కయ్యే ఖర్చుల్ని ఆ యా పారిశ్రామికుల నుంచి సెస్సుల రూపంలో వసూలు చేయవచ్చు కాకినాడలో రెండు పెద్ద ఎరువుల కర్మాగారా లున్నాయి వీటి ఎఫులిమెంట్స్‌తో బీచ్‌లో కాలుష్యం పెరిగిపోతోంది బీచ్ కాలుష్యం ప్రమాదకరం టువంటి వాటి విషయంలో ప్రభుత్వమేకాదు పారిశ్రామికులూ ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి అంటున్నారు ప్రొఫెసర్ బ్రిజ్‌కిషోర్



### నీటిద్వారా జబ్బులు

ఈమధ్య నీటి ద్వారా కూడా రకరకాల జబ్బులు వస్తున్నాయి వీటి నివారణకి శుభ్రత ముఖ్యం నీళ్ళను కాచి వడబోసిన తర్వాతే వాడడం మంచిది

ప్రకాశం నెల్లూరు నల్గొండ మొదలయిన జిల్లాలలో హైదరాబాద్‌లో రామానంతపూర్ పసవలిపురం టాంక్‌బండ్ డౌన్ మొదలయిన ప్రదేశాల్లోని నీటిలో ఫ్లోరైడ్‌శాతం ఎక్కువవుంది అందుకని ఈ ప్రాంతాలలో నీటిని వరుసగా కొన్ని సంవత్సరాలపాటు తీసుకున్నవాళ్ళ ఎముకలు బెండ్ అయి ఫ్లోరోసిస్ రావచ్చు అందుకని ఈ ప్రాంత ప్రజలు చింతపండు రసం ఓ చెంచాడు రోజూ తీసుకుంటే మంచిది అలాగే న్యూట్రలైజ్ చేసిన నీటిని తాగితే మంచిది

చిత్తూరు జిల్లాలో నీళ్ళ ద్వారా నారీ కురుపు వ్యాధి వస్తుంటుంది ప్యూపా దశలోవున్న క్రిమి నీళ్ళద్వారా లోపలికి వెళ్ళి కండరాలలో పెరుగుతుంది నీళ్ళలో నానేవాళ్ళ తడి చర్మాన్ని చీల్చుకుని బయటికి వచ్చి గుడ్లు పెడుతుంటుంది కాబట్టి ఈ ప్రాంతాల్లో కలుషిత జలాన్ని తాగకుండా జాగ్రత్తపడాలి వ్యాధి వచ్చినవాళ్ళు నీళ్ళలో తిరగకుండా జాగ్రత్తపడాలి ఇలాచేస్తే ఈ వ్యాధి యితరులకు అంటకుండా వుంటుంది అంటారు బ్రిజ్‌కిషోర్

– విజయచంద్ర

# సీరియల్ ప్రారంభం!




అగ్ని రథ చక్రాలు చలిస్తే
అశ్రుపునీత నేత్రాలు జ్వలిస్తే
నిద్రలేస్తుంది పర్జన్య శంఖం'
ఉద్భవిస్తుంది వజ్రసంకల్పం''

సెంట్రల్ జైలు మెయిన్‌గేటు కీచుమంటూ తెరుచుకుంది. రెండు చేతులూ ప్యాంటు జేబుల్లో పెట్టుకుని అలసటగా బయటికి అడుగు పెట్టాడు జైలర్ సత్యం. గేటు దగ్గర కాపలావున్న సెంట్రీ ఎటెన్షన్‌లో నిలబడి సెల్యూట్ చేశాడు. అతని సెల్యూట్ స్వీకరించి నిదానంగా ముందుకు నడిచాడు సత్యం.

''ఈ రోజు వెహికల్ లేదా సర్? సత్యం వెనక్కి తిరిగాడు

''లేదు అని చిన్నగా నవ్వి ముందుకు సాగిపోయాడు

అతను కనుచూపు మేర దాటి కూర్చున్నాడు సత్యాన్ని చూస్తే కాదు అతనికే కాదు సత్యాన్ని
పోయే దాకా చూస్తూ నిలబడి సెంట్రీకి చాలా గౌరవం అది చూస్తే అందరికి గౌరవమే-
సెంట్రీ నెమ్మదిగా తన స్టూలు మిద అదికారం చూసి యిచ్చే గౌరవం చివరికి జైల్లోని ఖైదీలకు కూడా'

సత్యం నడుస్తూ తల పైకెత్తి ఆకాశం వైపు చూశాడు.

అమావాస్య రాత్రి! చీకటి!... చేతులు ప్యాంటు జేబులో పెట్టుకుని నిదానంగా నడుస్తున్నాడు. అతని ఇల్లెక్కువ దూరం లేదు. వెహికల్ వున్నా ఒక్కోసారి ఇలా నడిచే ఇంటికి పోతుంటాడు. నడక అతనికి చాలా ఇష్టం. ఉద్యోగం వచ్చినప్పటి నుంచీ వాహనం వాడక తప్పడం లేదు.

ఆ రోజు ఆలస్యంగా ఇంటికి వెళ్తున్నాడు సత్యం.

నడుస్తూనే తీవ్రంగా ఆలోచిస్తున్నాడు- కొన్నాళ్ళుగా అలా ఆలోచిస్తూనే వున్నాడు.

అతని మనస్సులో తీవ్రమైన ఆందోళన!! గుండెలో అంతులేని గగుర్పాటు!

కొన్ని రోజులుగా అతన్ని వేధిస్తున్న సమస్య అతన్ని నరకయాతనకు గురిచేస్తోంది.

జీవితంలో తొలిసారిగా ఈ వుద్యోగంలో చేరినందుకు పశ్చాత్తాప పడుతున్నాడు.

"సత్యం....!"

నడుస్తున్నవాడల్లా చటుక్కున ఆగిపోయి రివ్వున వెనుదిరిగి చూశాడు.

ఎవరూ కనిపించ లేదు!

పరిచితమైన కంఠస్వరం!

తను పొరబడ్డాడా? తన ఆలోచనలు తనను భ్రాంతికి లోను చేస్తున్నాయా?

ఒక్కక్షణం అలాగే నిలబడి మళ్ళీ ముందుకు కదిలాడు.

"సత్యం....!"

అదే కంఠస్వరం! పరిచితమైన కంఠస్వరం! ఈ సారి గట్టిగా వినిపించింది.

మరోసారి ఆగిపోయాడు. మరోసారి వెనుదిరిగి చూశాడు.

ఎవరూ లేరు!!

తను విన్నది నిజమో భ్రాంతో తెలుసుకోలేని సందిగ్ధస్థితి!

కొద్ది క్షణాలు నిశ్చలంగా నిలబడి పోయాడు. చుట్టుపక్కల చీకటి. వీధి దీపాలు వెలగడం లేదు. కరెంటు పోయిందిలా వుంది.

కీచురాళ్ళ చప్పుడు...

ఎవరైనా ముందు కొస్తారేమోనని రెండు మూడు క్షణాలు ఎదురు చూశాడు. తర్వాత నెమ్మదిగా తలతిప్పి నలువైపులా కళ్ళు చిట్లించి చూశాడు.

అప్పుడు గమనించాడు...!

తన కుడివైపున ఓ చెట్టు చాటునుంచి పొడవాటి ఆకారం ఒకటి నీడలా బయటి కొచ్చింది!

లీలా మాత్రంగా గోచరిస్తున్న ఆ ఆకారం ఎవరిదో చప్పున పోల్చలేక పోయాడు సత్యం.

చీకట్లో చీకటిలా కలిసిపోయిన ఆ వ్యక్తి



ఆజానుబాహుడు ఆరున్నర అడుగులకు తక్కువుండదు ఎత్తు. భుజాల మీద నుంచి నేలపైకి జీరాడుతున్న పెద్ద శాలువా కప్పుకున్నాడు చిందరవందరగా జుట్టు రేగిపోయి కనిపిస్తోంది గుండెలదాకా పెరిగిన బారాటి గడ్డం అస్తవ్యస్తంగా వుండి గాలికి పైకెగురుతూ చీకట్లో భయం గొల్పుతోంది సత్యానికి ఆ వ్యక్తిలో స్పష్టంగా కనిపిస్తున్నవి రెండే రెండు

ఆ వ్యక్తి కళ్ళు!

చీకట్లో కూడా అగ్ని గోళాల్లా ఎర్రగా మండుతున్నాయవి!

ఏదో మంత్రానికి కట్టుబడిపోయిన వాడిలా నిశ్చలంగా నిలబడి ఆ వ్యక్తి కళ్ళలోకి చూస్తుండిపోయాడు సత్యం

చూస్తుండగానే ఆ వ్యక్తి ముందుకు కదిలాడు సత్యం ఎదుటికొచ్చి కొండచరియలా ఉన్నతంగా నిలబడ్డాడు ఎంతకాదన్నా సత్యం కంటే అరడుగు పైనే ఎత్తుంటాడా వ్యక్తి తల పైకెత్తి ఆయన మండుతున్న కళ్ళలోకి విస్మయంగా చూస్తుండిపోయిన సత్యం భుజంమీద బరువుగా వాలిందాయన చెయ్యి

'నన్ను గుర్తుపట్టలేదా సత్యం

ఆ వ్యక్తి ఆకారంలాగే ఆ కంఠస్వరం కూడా మేరు గంభీరంగా వుంది

మా స్టా రూ'' అతి ప్రయత్నం మీద గొంతు పెగల్చుకొని అస్పష్టంగా గొణిగాడు సత్యం

తన రెండో చెయ్యి కూడా అతని భుజం మీద వేసి నెమ్మదిగా తల వూపాడా వ్యక్తి ఆ మరుక్షణం తన బరువంతా ఒక్కసారిగా పోగొట్టుకున్న వాడిలా అలాగే ఆ భుజం మీద ఒరిగి పోయాడు

మస్టారూ! ఆయన్ని కుడిచేత్తో బలంగా పొదివి పట్టుకుంటూ కంగారుగా అన్నాడు సత్యం

ఆ వ్యక్తి నెమ్మదిగా నిలదొక్కుకుంటూ అతని భుజాన్ని ఆప్యాయంగా నిమిరాడు

ఈ భుజం సత్యం ! ఈ భుజం ఆసరా నాకు కావాలి ! ఇస్తావా?

సత్యం తన భుజం మీద ఆయన చెయ్యి నొక్కి పట్టుకున్నాడు

కన్నీళ్ళు పెడుతున్నారా మాస్టారూ?

ఆ వ్యక్తి నిటారుగా అవుతూ తల అడ్డంగా వూపేడు

లేదు యాచిస్తున్నాను! నా ప్రియ శిష్యుడి నుంచి గురుదక్షిణ యాచిస్తున్నాను! ఇన్నాళ్ళ తర్వాత ఇన్నేళ్ళ తర్వాత నాకు నీ భుజస్కందాల ఆసరా కావాలి! చెప్పు సత్యం'' నాకు గురు దక్షిణ చెల్లిస్తావా?

సత్యం కళ్ళు చెమర్చాయి

మీరు ఆవేశంలో వున్నారు మాష్టారూ! పదండి మా ఇంటికెళ్ళి నిమ్మితంగా మాట్లాడుకుందాం

ఆ వ్యక్తి హఠాత్తుగా హుంకరించాడు

నిమ్మితం ఇక ఈ జీవితానికి నిమ్మిత మన్నది లేదు సత్యం! ముందు నాకు సమాధానం చెప్పు– గురు దక్షిణ చెల్లిస్తావా లేదా?

చెల్లిస్తాను మాష్టారూ'' మీరు కోరితే నా ప్రాణాలైనా ఇస్తాను– ఏం చెయ్యాలో చెప్పండి

ఆ వ్యక్తి అతని కళ్ళలోకి అనుమానంగా చూశాడు

మాట ఇచ్చినట్లేనా?

సత్యం అతని చేతిలో చెయ్యి వేశాడు

నా ఉద్యోగ ధర్మానికి భంగం వాటిల్లనంత వరకూ మీరేం కోరినా చేస్తాను చెప్పండి మాస్టారూ !

ఆ వ్యక్తి సత్యం ముఖంలోకి పరిశీలనగా చూసి తను ఇందాక చాటు చేసుకు నిలబడ్డ చెట్టువైపు తలతిప్పాడు

కౌసల్యా ! ఆయన కంఠం గంభీరంగా ధ్వనించింది

జైలర్ సత్యం వులిక్కి పడ్డాడు చూపులు అటువైపు తిప్పి విస్మయంగా చూస్తుండిపోయాడు

ఆ చెట్టు చాటు నుంచి మొదట సన్నగా గాజుల చప్పుడు వినిపించింది ఆ తర్వాత నెమ్మదిగా ఓ యువతి ఇవతలికొచ్చి నిలబడింది తలనిండా కప్పుకున్న మేలి ముసుగు ఆమె ముఖాన్ని కనబడనీయకుండా చేస్తోంది పెళ్ళి కూతురి దుస్తుల్లో వున్న ఆ యువతి రెండు చేతులూ జోడించి సత్యానికి నమస్కరించింది ఆ మసక చీకట్లో కూడా ఆమె చేతులకున్న గోరింటాకు ఎరుపు స్పష్టంగా చూడగలిగాడతను

ఆ వ్యక్తి ఆమె తలపై కప్పుకున్న మేలి ముసుగు తొలగించాడు

ఒక్కసారిగా మెరుపు మెరిసినట్లుంది ప్రకాశవంతమైన ఆ యువతి ముఖ సౌందర్యం ఆమె చుట్టూ కమ్ముకున్న మసక చీకటిని దూరంగా పారదోలు తున్నట్టుగా అనిపించింది సత్యానికి మరుక్షణం తన గుండె నెవరో క్రూరంగా పట్టి నులిమేస్తున్న అనుభూతి కలిగింది చప్పున తల తిప్పేసుకున్నాడు

చూడానికి భయంగా వుందా సత్యం? ఈ అమాయి– నిన్నగాక మొన్న పెళ్ళికూతురు కాబోతూ గుండెనిండా ఆశలతో తన చేతులకు, పెట్టుకున్న గోరింటాకు ఎర్రగా పండాలని కోరుకున్న ఈ అమాయకురాలు– మరి కొది రోజుల్లో విధవరాలు కాబోతోంది! తాళికట్టిన భర్త మొహమైనా సరిగా చూడకముందే ఈమె మెడలోని తాళి తెగి నేలపాలు కానుంది! ఈమె చేతి ఎరుపు కన్నీళ్ళతో కరిగి పోతోంది సత్యం సరిగా చూడు!

సత్యం చూడలేదు

నన్నేం చెయ్యమంటారు మాస్టారూ? నేనేం చెయ్యగలను? నిస్సహాయంగా ఆక్రోశించాడు

ఆ వ్యక్తి తన ఆవేశాన్ని అదుపులో వుంచుకోడానికి ప్రయత్నిస్తూ సత్యం కళ్ళలోకి సూటిగా చూశాడు

సత్యం! నీ జైల్లో వుంటూ చెయ్యని హత్యకు ఉరిశిక్ష కోసం ఎదురు చూస్తున్న నా కుమారుడ్ని తప్పించడానికి నేనిక్కడికి రాలేదు! ఆ జైల్లో వున్నవాడు నీ బాల్య స్నేహితుడన్న మిషమీద కాళ్ళపారాణి ఆరక ముందే భర్తను పోగొట్టుకోవడానికి సిద్ధంగా వున్న నా కోడలి పసుపు కుంకుమలు కాపాడమని నిన్నర్థించడానికి అంతకన్నా రాలేదు! కానీ వాక్యం పూర్తి చేయకుండానే సత్యం రెండు భుజాలు పట్టుకుని ఆ యువతి వైపు బలవంతంగా తిప్పాడు

ఒక్కసారి ఆమె వైపు చూడు సత్యం!



కన్నీటి సముద్రంలా వున్న ఆ యువతి ముఖంలోక చూడలేక సత్యం మళ్ళీ కళ్ళు తిప్పేసుకున్నాడు

నేను చూడలేను మాస్టారూ!! దయచేసి నన్ను బలవంత పెట్టకండి

సరే ఆ దీనురాలివైపు చూడలేకపోతే నా వైపు చూడు– నా కళ్లలోకి చూడు

సత్యం నెమ్మదిగా కళ్ళు పైకెత్తి ఆయన కళ్ళలోకి వయంగా చూశాడు

ఆయన ముఖం రాతికంటే కఠినంగా వుంది

నేను నీ గురువును సత్యం! నీ చేత ఓనమాలు దిద్దించిన గురువును నా గురించి నీకు బాగా తెలుసు నీ ఉద్యోగ ధర్మానికి విరుద్ధమైన కోరిక నేను కోరతానంటే నువ్వు నమ్మగలవా?

నమ్మలేను మాస్టారూ! ముమ్మాటికీ నమ్మలేను!!

కానీ నీ మనసులో ఎదో మూల నా మీద అనుమానం నిప్పులా రగులుతోంది చెయ్యని నేరానికి ఉరిశిక్ష పడిన నా కొడుకు ప్రాణాలు కాపాడమని నిన్ను కోరడాని కొచ్చానని అనుమానిస్తున్నావు– అవునా

సత్యం వెంటనే మాట్లాడలేక పోయాడు

నువ్వు మూర్ఖుడివి సత్యం! నీలో ధైర్యం లేదు! నీ ఎదుట నిలబడ ఒక శోకదేవత ముఖంలోకి సూటిగా చూసి ఓదార్చేపాటి ధైర్యం కూడా నీలో లేదు! నువ్వు ఉద్యోగ ధర్మానికి కాదు– ఉద్యోగానికి బందీవి! నీ వంటి పిరికివాడి దగ్గరికి రావడం నాదే పొరపాటు ఆయన వెనుదిరగ బోయాడు

సత్యం చప్పున ఆయన చెయ్యి పట్టుకుని ఆపేడు

క్షమించండి మాస్టారు! మిమ్మల్ని ఎ మాత్రమైనా నేను సందేహించి వుంటే ఈ క్షణంలో నే నాలో ఆ సందేహం తొలగి పోయింది నన్ను క్షమించి ఎం చెయ్యాలో చెప్పండి– చెయ్యడానికి సిద్ధంగా వున్నాను స్థిరంగా అన్నాడు

ఆయన అతని కళ్ళలోకి మరోసారి పరిశీలనగా చూసి చిన్నగా నిట్టూర్చేడు

సరే చెబుతాను! నేను కోరబోతున్నది నువ్వు చెయ్యలేని పని మాత్రం కాదు– కానీ సాహసంతో కూడుకున్నది పై అధికారులకు తెలిస్తే నీ వుద్యోగానికే మోసం రావచ్చు సిద్ధమేనా?

సత్యం తలూపేడు

కొద్ది క్షణాలు వాళ్ళ మధ్య మౌనంగా దొర్లిపోయాయి

ఆయన మరోసారి నిట్టూర్చేడు

అయితే విను! భర్త మొహమైనా సరిగ్గా చూడ్డానికి నోచుకోని ఈ అభాగ్యురాల్ని ఒక్క రాత్రికి ఆమె భర్త దగ్గరికి చేర్చగలవా?

సత్యం వులిక్కిపడ్డాడు

అతని వీపు మీద ఎవరో కొరడాతో చెళ్ళున చరిచినట్లయ్యింది

మా స్టా రూ అస్పష్టంగా గొణిగేడు

## [illegible]

కేంద్ర ప్రభుత్వం సినీమా కళను ప్రోత్సహించేందుకుగాను బహుమతులు 1953 సం నుంచి ప్రవేశపెట్టింది మనదేశ సాంప్రదాయ సంస్కృతులకు దర్పణం పట్టే సామాజిక కళాత్మక విలువలు గల చిత్రాలకు రాష్ట్రపతిచే స్వర్ణకమలము ' బహూకరింపబడుతుంది భారతదేశంలో సినీమాలకు ఇదే ప్రతిష్టాత్మకమైన గుర్తింపు!

ఈ మూడున్నర దశాబ్దాలలో ఇంతవరకు ఎ ఒక్క తెలుగు చిత్రానికి ప్రథమ బహుమతి లభించకపోవడం శోచనీయం! సంఖ్యాముఖంగా అగ్రస్థానం చేరుకున్న తెలుగు చిత్ర సీమ ఉత్తమ చిత్రాల నిర్మాణంలో అగ్రతాంబూలం అందుకోలేక పోవడం గర్హించవలసిన విషయం! ఇంత వరకు ఎ ఎ సంవత్సరంలో ఎ ఎ భాషా చిత్రానికి బహుమతి లభించిందో వరుస క్రమంలో మీకు తెలియజేస్తున్నాను

| సంవత్సరం | చిత్రం పేరు | భాష | దర్శకుడు |
|---|---|---|---|
| 1953 | శ్యామ్ చిఆయి | మరాఠి | ఎ కె అత్రే |
| 1954 | మీర్జా గాలిబ్ | హిందీ | షహరాబ్ మోడి |
| 1955 | పథేర్ పాంచాలి | బెంగాలి | సత్యజిత్ రే |
| 1956 | కాబూలివాలా | బెంగాలి | తపన్ సిన్హా |
| 1957 | దో ఆంఖే బారాహాత్ | హిందీ | వి శాంతారామ్ |
| 1958 | సాగర్–సంగమ | బెంగాలి | దేవకీ బోసు |
| 1959 | అపూర్ సంసార్ | బెంగాలి | సత్యజిత్ రే |
| 1960 | అనూరాధ | హిందీ | హృషికేశ్ ముఖర్జీ |
| 1961 | భగిని–నివేదిత | బెంగాలి | బిజయ్ బాసు |
| 1962 | దాదా ఠాకూర్ | బెంగాలి | ఎ యూస్ బాసు |
| 1963 | సెహర్ ఔర్ సప్న | హిందీ | కె ఎ అబ్బాస్ |
| 1964 | చారులత | బెంగాలి | సత్యజిత్ రే |
| 1965 | తీస్రీ కసమ్ | హిందీ | బాసు భట్టాచార్య |
| 1966 | చెమ్మీన్ | మళయాళం | రామూ కారియత్ |
| 1967 | హాతే బజార్ | బెంగాలి | తపన్ సిన్హా |
| 1968 | గోపీ గయా బాగా బయా | బెంగాలి | సత్యజిత్ రే |
| 1969 | భువన్ షోమ్ | బెంగాలి | మృణాల్‌సేన్ |
| 1970 | సంస్కార | కన్నడం | పట్టాభిరామిరెడ్డి |
| 1971 | సీమబద్ధ | బెంగాలి | సత్యజిత్ రే |
| 1972 | స్వయంవరం | మళయాళం | అదూరి గోపాలకృష్ణన్ |
| 1973 | నిర్మాల్యం | మళయాళం | ఎం టి వాసుదేవనాయర్ |
| 1974 | కోరస్ | బెంగాలి | మృణాల్ సేన్ |
| 1975 | చోమన గుడి | కన్నడం | బి వి కరంత్ |
| 1976 | మృగయా | బెంగాలి | మృణాల్ సేన్ |
| 1977 | ఘటశ్రాద్ధ | కన్నడం | గిరీష్ కాసరవల్లి |
| 1978 | గణదేవత | బెంగాలి | తరుణ్ మజుందార్ |
| 1979 | శోధ్ | హిందీ | విప్లవ్‌రాయ్ చౌదరి |
| 1980 | అకాలేర్ సందాన్ | బెంగాలి | మృణాల్ సేన్ |
| 1981 | దఖల్ | బెంగాలి | గౌతమ్ ఘోష్ |
| 1982 | చోక్ | బెంగాలి | ఉత్పలేందు చక్రవర్తి |
| 1983 | ఆదిశంకరాచార్య | సంస్కృతం | జి వి అయ్యర్ |
| 1984 | దాముల్ | హిందీ | ప్రకాష్ ఝా |
| 1985 | చిదంబరం | మళయాళం | జి అరవిందన్ |
| 1986 | తబరన కథే | కన్నడం | గిరీష్ కాసరవల్లి |
| 1987 | హాలోదియా చొరాయే బౌదన్‌ఖాయ్ | అస్సామీ | జాహ్నుబారువా |
| 1988 | పిరవి | మళయాళం | షాజీకారన్ |

(సేకరణ ఆరిపాక సూరిబాబు)







# ఆ నొప్పికి స్ట్రాంగ్ చికిత్స అత్యంతావశ్యం

విపరీతమైన తలనొప్పులు, వొళ్ళునొప్పులు, భరించలేని నరముల తీపులు మరియు బెణుకులు—వీటన్నిటికీ అమృతాంజన్ స్ట్రాంగ్ పెయిన్‌బామ్ వుపశమనము చేకూర్చగలదు.

మీకు సుపరిచితమైన అమృతాంజన్‌లో యిమిడివున్న మూలపదార్థాములే మరింత శక్తివంతంగా సమ్మిళితం చేయబడినాయి అమృతాంజన్ స్ట్రాంగ్‌లో. విపరీతమైన నొప్పులను, బాధలను త్వరితంగా వుపశమింప జేయగలందులకే స్ట్రాంగ్‌గా తయారుచేయబడింది అమృతాంజన్ స్ట్రాంగ్.

## అమృతాంజన్ స్ట్రాంగ్



మిక్కిలి బాధాకరమైన నొప్పులకు

అమృతాంజన్ లిమిటెడ్ 

ఆ వ్యక్తి తలవూపేడు

అవును సత్యం! ప్రాణాలు కోల్పోయే ముందు నా కుమారుడికి ఒక్కరాత్రి తన నూతన వధువుతో కలిసవుండే అదృష్టం కల్పించు అదే నాకు గురుదక్షిణ!

ఆయన కళ్ళ వెంబడి జలాజలా కన్నీళ్ళు జారిపోతున్నాయి

సత్యం చలించాడు

మాటలు మర్చిపోయిన వాడిలా మూగగ చూశాడు

చెప్పు సత్యం! చెయ్యగలవా లేదా? ఉన్మాదిలా అతని భుజాలు పట్టుకొని వూపేస్తూ ప్రశ్నించాడా వ్యక్తి

సత్యం నెమ్మదిగా నోరు విప్పాడు

చేస్తాను మాస్టారూ!! ఉద్యోగమే కాదు-ప్రాణమే పోయినా సరే మి కోరిక చెల్లిస్తాను!

ఆ వ్యక్తి ఒక్కసారిగా సత్యాన్ని గుండెలకు హత్తుకున్నాడు ఎం చెప్పడానికి ఆయనకు మాటలు కరువై పోయాయి నెమ్మదిగా అతన్నుంచి వేరై ఆప్యాయంగా భుజం తట్టాడు ఆయన కళ్ళ వెంట దారాపాతంగా కన్నీళ్ళింకా జారిపోతూనే వున్నాయి

అంతలోకే ఆయన దవడలు బిగుసుకున్నాయి ఆ దుఃఖంలో నే పళ్ళు పటపట కొరికాడు

**వజ్రపాణీ! కాచుకో నా శపథం నెరవేరే ఘడియ వస్తుంది! నా "వజ్ర సంకల్పం' సిద్ధించే క్షణం వచ్చి తీరుతుంది! అందుకు తొలి అంకం ఈ క్షణమే ప్రారంభమైంది! జరగబోయే బృహన్నాటకానికి ఇదే నాందీ ప్రస్తావన!! కాచుకో వజ్రపాణీ! కాచుకో !!**

మరోసారి పళ్ళు పటపట కొరికాడా వ్యక్తి జైలర్ సత్యం నిశ్శబ్దంగా ఆయన వైపు చూస్తుండి పోయాడు

* * * * * * *

కటకటాల తలుపు నెమ్మదిగా తెరుచుకుంది

గల గల లాడే గాజుల చప్పుడుతో పాటు నెమ్మదిగా సెల్‌లో అడుగుపెట్టిందామె

వెనక నుంచి సెల్ తలుపు మూసుకుంది

అంతవరకూ ఆ సెల్‌లో ఒంటరిగా కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తున్నవాడల్లా అతను నెమ్మదిగా లేచి నిలఎడ్డాడు

పీక్కుపోయిన ముఖం గుంటలు పడిన కళ్ళు మాసిన గడ్డం కొద్ది రోజుల్లో తనని వరించబోతున్న మృత్యుదేవతను ఆహ్వానిస్తున్నట్టుగా అతని ముఖంలో ప్రేతకళ దోబూచులాడుతోంది

అతన్ని చూడగానే ఆమె కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగయి అన్ని సంకోచాలూ విడిచిపెట్టి సుడిగాలిలా వచ్చి అతన్ని చుట్టేసింది

ఎడవకు కౌసల్యా! ఇలాంటి సమయంలో ఎడుస్తారా ఎవరైనా అనునయంగా అన్నాడతను

ఆమె కళ్ళు వర్షించడం ఆగలేదు

అతన్నుంచి ఒక్క క్షణం వేరైతే తనకు దక్కకుండా శాశ్వతంగా దూరమై పోతాడన్న భయంతో ఆర్తిగా అతన్ని అల్లుకు పోయింది

వాళ్ళ జీవితంలో అదే తొలి పరిష్వంగనం

చివరి కౌగిలి కూడా అదే!

ఆ చేదు నిజాన్ని అంగీకరించడానికి ససేమిరా ఆమె మనసు ఒప్పుకోవడం లేదు

అతని కడి శిశిరానికి ముందు వచ్చిన వసంతం!

మరణానికి ముందు ప్రియురాలు ఇచ్చిన కౌగిలి

వాళ్ళ మధ్య కాలం స్తంభించింది

అలా ఎంతసేపుండి పోయారో వాళ్ళకే తెలీదు

అతను నెమ్మదిగా ఆమె నుంచి దూరంగా జరిగాడు

చుని వేళ్ళతో ఆమె చుబుకం పట్టి ముఖం పైకెత్తుతూ తడితడిగా మెరుస్తున్న కళ్ళలోకి లాలనగా చూశాడు

మృదువుగా తన పెదవులతో ఆమె కళ్ళు తుడిచాడు

మా వంశంలో ఒక సంప్రదాయం వుంది ఆమె చెవుల్లో గుసగుసలాడుతూ అన్నాడతను తొలిరేయి తొలి కౌగిలి ఇచ్చిన నూతన వధువుకు వరుడు ఏదో ఒక విలువైన వస్తువు కానుకగా ఇస్తాడు ఈ స్థితిలో నేను నీకేమివ్వ గలను

ఆమె మెల్లగా కళ్ళు తెరిచింది

ఒక అమూల్యమైన కానుక మీరూ ఇవ్వగలరు! అతని కళ్ళలోకి సూటిగా చూస్తూ నెమ్మదిగా అంది

ఆమె గొంతులో అంతులేని విశ్వాసం ధ్వనిస్తోంది

నేనా ?! అమూల్య కానుకా? ఏమిటది? చకితుడయ్యాడతను

మనకు జరిగిన అన్యాయానికి పగతీర్చగల మగబిడ్డ!

ఆమె కళ్ళు ఎర్రని ప్రతీకార దాహంతో జ్వలిస్తున్నాయి! (ఇంకా ఉంది)



## రోబోట్‌లు

మర మనిషి (రోబోట్) అనే పదం చాలా ఆధునికంగా కనబడుతోంది రోబోట్ అనగానే మనిషిలా కనిపించే ప్రవర్తించే యంత్రం యొక్క బొమ్మ మన మనోఫలకంలో కనబడుతుంది కాని అదికాదు మనుషుల మాదిరిగానే నడవటం మాట్లాడటం చేసే మర మనుషులను మనం కథల్లో వింటుంటాం సినిమాల్లో చూస్తుంటాం కాని రోబోట్ యంత్రాలు అనేక ప్రాంతాల్లో ప్రత్యేకించి ఫ్యాక్టరీలలో మనకిప్పుడు దర్శన మిస్తున్నాయి

# గుండెజబ్బులు

డా పి దక్షిణామూర్తి,ఎమ్ డి
పిజిషియన్ తెనాలి

ప్రశ్న పొగతాగటానికీ గుండెపోటుకీ సంబందం ఉందంటారా?

జ ఈ రెంటికీ సంబందం ఉంది ముఖ్యంగా రోజుకు 20 అంతకంటె ఎక్కువ సిగరెట్లు తాగేవారికీ అందులోనూ చిన్న వయస్సు నుండి పొగతాగే అలవాటు ఉన్న వారికీ గుండెపోటు వచ్చే అవకాశం ఉంది విపరీతంగా పొగతాగే వారిలో హఠాన్మరణాలు కూడా ఎక్కువే గుండెపోటు వచ్చిన వారికీ రాకుండా జాగ్రత్త పడవలసిన వారికీ ప్రదాన శత్రువు పొగత గటమే గుండెపోటు ఒకసారి వచ్చినవారు పొగతాగితే తమ మృత్యువును తాము ఆహ్వానించుకోవడమే గుండెపోటును నివారించాలంటె- మనం ఆచరించగల ఒకే మారం- పొగ త గకుండా ఉంటడం మాత్రమే సిగరెట్ బీడీ చుట్ట పొగాకు నమలడం నశ్యం- అన్నీ హానికలిగించేవే

ప్రశ్న గుండెపోటు ముఖ్యంగా ఎ వయస్సు వారిలో ఎ వృత్తుల వారిలో వస్తుంది? స్త్రీలలో గుండెపోటు రావటం తక్కువ అనే విషయం నిజమేన ’

జ గుండెపోటు సాదారణంగా 40-60 సంవత్సరాల మద్య వయస్కులలో ఎక్కువగా వస్తుంది ఆదునిక జీవితపు ఆటుపోట్లవల్ల ఇప్పుడు 30-40 సంవత్సరాల మద్య వయస్సులో కూడా వస్తున్నది అరుదుగా 20-30 సంవత్సరాల మద్య వయస్కులలో కూడా వస్తున్నది బ దాకరమైన విషయం ఏమిటంటే పాశ్చాత్య

(గత సంచిక తరువాయి)

దేశీయులకంటే మనదేశీయులకు సగటున 10 సంవత్సరాల ముందే గుండెపోటు వస్తున్నది 40 సంవత్సరాల వయస్సు వరకు స్త్రీలలో గుండెపోటు తక్కువ (హార్మోనుల ప్రబావం కావచ్చు) అనే అబిప్రాయం వైద్యశాస్త్రజ్ఞులలో ఉన్నా ఇటీవలికాలంలో వారిలో కూడా ఈ వ్యాది వ్యాప్త చెందుతున్నది

శ్రమజీవులలో గుండెపోటు రావటం చాలా తక్కువ బుద్ధిజీవులలోను కాయకష్టం చేయని వృత్తుల వారిలో- అంటే వ్యాపారులు ఆఫీసర్లు లాయర్లు డాక్టర్లు గుమాస్తాలు మొదలైన వారిలో ఈ వ్యాది అదికంగా వస్తుంది

ప్రశ్న గుండెపోటు ప్రమాదకరమైన వ్యాదేనా’ రోగి ఎంత కాలం విశ్రాంతి తీసుకోవాలి’

## గుండెపోటు ప్రత్యేక జాగ్రత్తలు

జ హఠాన్మరణానికి ముఖ్య కారణాలలో గుండెపోటు ప్రదానమైనది కాబట్టి ఈ వ్యాది అంటే ప్రజలకు భయాందోళనలు ఉండటం సహజమే సరైన చికిత్స సకాలంలో జరిగితే గుండెపోటు వచ్చిన వారిలో నూటికి 60 నుండి 70 మందికి నయమవటానికి అవకాశాలున్నాయి గుండెపోటు వచ్చిన మొదటి రెండు గంటలలోను తరువాత 24 గంటల నుండి 72 గంటల వరకు ప్రమాదకరమైన కాంప్లికేషన్లు వచ్చే అవకాశం ఉంటాయి కార్డియాలజిస్టు లేక ఫిజిషియన్ పర్యవేక్షణలో కొరోనరీకేర్ సదుపాయాలతో తగు చికిత్సతో రోగి కోలుకోవచ్చు

కాంప్లికేషన్లు ఏమీలేక పోతే 10 రోజులు లేక 2 వారాల తర్వాత డాక్టరు రోగిని ఇంటికి పంపించి 1 నెల నుండి 2 నెలల వరకు విశ్రాంతి తీసుకోవాలని చెప్తారు

ప్రశ్న గుండెపోటు వచ్చిన వ్యక్తి తిరిగి తన వృత్తిని నిర్వహించవచ్చా??

జ చాలామంది తిరిగి వారి పూర్వ వృత్తులలో ప్రవేశించవచ్చు గుండెపోటు వచ్చిన 2 నుండి 3 నెలల మద్యలో కార్డియాలజిస్టు ఎక్సర్సైజు టెస్టు (ట్రెడ్‌మిల్ టెస్టు) చేసి రోగి ఫిట్‌నెస్ ను నిర్ణయించి తగు సలహానిస్తారు వ్యాది నుండి కోలుకొన్నవారు క్రమం తప్పకుండా డాక్టర్‌తో చెకప్ చేసుకొంటూ ఉండాలి

ప్రశ్న బైపాస్ సర్జరీ అంటే ఏమిటి? ఇది ఎప్పుడు అవసరమవుతుంది? ఈ శస్త్ర చికిత్స మన దేశంలో ఎక్కడ చేస్తున్నారు?

జ: అంజైనా నొప్పి మందులకు తగ్గకపోతేనూ తరచుగా వస్తుంటేనూ విశ్రాంతిలో ఉండగా కూడా అంజైనా నొప్పివచ్చి ఎక్కువ సమయం బాధ పెడుతుంటేనూ మీ కార్డియాలజిస్టు కొరోనరీ ఆంజియోగ్రఫీ అనే టెస్టు (ఈ సదుపాయాలు హైదరాబాదు మద్రాసు ఢిల్లీ బొంబాయి వంటి ప్రధాన నగరాలలో ఉన్నాయి) చేయించి కొరోనరీ రక్తనాళాలలో ఆటంకాలు ఉన్నాయని నిర్ధారణ చేస్తారు ఇలాంటి వారికి బైపాస్ సర్జరీ వల్ల చాలా ఉపయోగం ఉన్నది కాలి నుండి రక్తనాళాన్ని తీసి అయోర్టా (బృహద్ధమని)కు కొరోనరీ రక్తనాళంలోని అడ్డు దిగువభాగానికి గ్రాఫ్టు గా అమరుస్తారు (బొమ్మ నెం 3) ఈ విధంగా గుండె కండరానికి నిరాటంకంగా రక్త ప్రసారం ఉండటానికి వీలవుతుంది తరచు అంజైనా తో బాదపడే రోగికి

బొమ్మ నెం 3



కొరోనరీ రక్తనాళాలలోని అంతరాయముల దిగువకు అయోర్టానుండి ‘బైపాస్’లను ఏర్పరచడం చూడవచ్చు



బైపాస్ సర్జరీ ఒకరి ప్రకారం అమెరికాలో ఈ శస్త్ర చికిత్సను అధిక సంఖ్యలో చేసి మంచి ఫలితాలను సాధిస్తున్నారు ఇప్పుడు బొంబాయి ఢిల్లీ మద్రాసు హైదరాబాదులలో కూడా శస్త్ర చికిత్సా నిపుణులు విదేశాలతో సరిసమానంగా ఫలితాలను సాధిస్తున్నారు

గుండెపోటు మరల రాకుండాను అంజైనా రాకుండాను ఈ శస్త్ర చికిత్స పూర్తిగా నివారిస్తుందనే విషయం సందేహాస్పదమే ఈ చికిత వల్ల అనేకమంది రోగులకు అంజైనా బాధలు తొలగి వారి జీవనశైలి మెరుగుపడినా ఆహార విహారదులలోను తగు జాగ్రత్తలు కార్డియాలజిస్టు పర్యవేక్షణలో కొనసాగించవలసిందే గుండెపోటు అంజైనా రోగులలో ఎవరికి ఈ శస్త్ర చికిత్సవల్ల ఉపయోగం ఉండేది కార్డియాలజిస్టు నిర్ణయిస్తారు

**ప్రశ్న గుండెపోటు వచ్చినవారు రక్తంలో కొలెస్ట్రరాల్ ఎక్కువగా ఉన్నవారు స్థూలకాయులు ఎలాంటి ఆహార నియమాలు పాటించాలి?**

జ స్థూలకాయం రాకుండ ఉండాలంటే చిన్న వయసునుండి మితిమీరి భుజించకూడదు తక్కువ భుజించు- ఎక్కువ కాలం జీవించు అనేది మంచి సూక్తి కాయకష్టం చేయని మధ్య తరగతి పై తరగతి ప్రజల్లో అవసరమైన దానికంటే ఎక్కువ కేలరీల ఆహారం తీసుకోరాదు అన్నంలో కూరలు కాకుండా కూరల్లో అన్నం కలుపుకు తినాలి మనం ధరించే బెల్టు చిన్నదైతే మన ఆయురాయం పెరుగుతుంది నెయ్యి డాల్డా బదులు సఫోలా లేక నువ్వుల నూనె వాడవచ్చు వేటమాంసం పందిమాంసం బదులుగా కోడిమాంసం చేప కోడి గుడ్డులో తెల్లసొన పరిమితంగా తినవచ్చు వెన్న మీగడ కోడిగ్రుడులో పచ్చసొన వేపుడు వస్తువులు ఐస్‌క్రీం చాక్లెట్లు కేకులు సూపులు బాగా తగ్గించాలి

**ప్రశ్న గుండెపోటు నివారణకు వ్యాయామం అవసరమన్నారు కదా? ఎలా చేయాలి**

జ గుండెపోటు వచ్చిన వారికి వృద్ధులకు వేగంగా నడవడం మంచి వ్యాయామం మిగతా వారందరికీ పరుగెత్తటం మంచి కసరత్తు పరుగెత్తటం వల్ల పొట్టతో సహా అన్ని కండరాలకు మంచి పనికలుగుతుంది పొడుగైన రహదార వెంట పరుగెత్తటం సాధ్యం కాకపోతే ఇంటి ఆవరణలో గాని గదిలో నే కటికీ ఎదురుగా ఎగురవచ్చు నేల నుంచి పాదలను కనీసం ఆరు అంగుళాలు ఎగురవెయ్యాలి

సైకిల్ తొక్కడం ఈదడం అన్ని వయస్సుల వారికీ స్త్రీ పురుషులకు కూడా మంచివే తోటపని వల్ల శరీరానికి వ్యాయామం మనస్సుకు విశ్రాంతి లభిస్తాయి శవాసనం వంటి యోగాసనాలు హృద్రోగులకు రక్తపోటు రోగులకు చాలా ఉపకరిస్తాయి ఈ వ్యాయామ అభ్యాసాలన్నిటినీ కొదిగా ప్రారంభించి క్రమేణా పెంచి విడవకుండా కొనసాగించాలి గుండెపోటు వచ్చినవారు మాత్రం వారి ఆరోగ్య పరిస్థితినిబట్టి వారి డాక్టరు సూచనల ప్రకారం వ్యాయామం చేయాలి

**ప్రశ్న గుండెపోటు వచ్చిన రోగి దాంపత్య జీవితాన్ని కొనసాగించవచ్చా?**

జ కాంప్లికేషన్సు లేకపోతే గుండెపోటు వచ్చిన 6 నుండి 10 వారాల తర్వాత దాంపత్య జీవితం కొనసాగించవచ్చు మీ ఫిజిషియన్ లేక కార్డియాలజిస్టు ఈ విషయంలో సరియైన తగు నిర్ణయం తీసుకోగలరు గుండెపోటు నుండి కోలుకొన్న కొందరు మానసిక కారణాల వల్ల భయాందోళనల వల్ల దాంపత్య జీవనం కొనసాగించలేక పోవచ్చు ఇటువంటి వారికి డాక్టరు ధైర్యము చెప్పి మామూలు జీవితాన్ని కొనసాగించేలా సలహాలు ఇస్తారు

ఇంటర్వ్యూ
హిప్నాటిస్టు టి ఎస్ రావ్

# వారఫలం

## 9-6-1989 శుక్రవారం నుండి 15-6-1989 గురువారం వరకు

★ **మేషం** గ్రహమార్పులు మీకు అనుకూలం రాబడి విషయంగా బహు అనుకూలం వ్యాపార రీత్యా చాల బాగున్నది వ్యాపార సరుకులు కొనుగోలు నిమిత్తం దూరప్రాంతాలకు వెళ్లనున్నారు లాభదాయక సమయమని మీరే గ్రహిస్తారు స్త్రీలకు అత్యంత శుభదాయక వారం

★ **వృషభం** బా సంబంధంగ యిబ్బందులు రావచ్చు కాని పర మున్నది గమనించగలరు …క వివాహ సంబంధంగా పరాయివారి సంబంధమే నిశ్చయంకావచ్చు రాజకీయ వ్యవహారంగా ఏమంత అనుకూలమైన సమయంగాదు వృత్తి వికాసం స్వల్పంగ ఆదాయం లేకపోలేదు స్త్రీలకు ఇరుగు పొరుగు తగాదాలు రకుండ చూచుకోండి

★ **మిదునం** …ర్వసాధారణంగా …రిగే వ్యవహారాలు కూడా ఈ వారం ఎంతో ప్రయాసతో గాని జరుగవు ప్రయాణాలు వాయిదా పడగలవు ఎంతో అగత్యం ఉంటేతప్ప ప్రయాణించుట ఈ వారం న్యాయంగాదు స్త్రీలకు అనవసరంగా వ్యతిరేకత యున్నది ఉద్యోగరీత్యా బహు జాగ్రత అవసరం ధనరాబడిలో పెద్దగా లోటు లేదు గ్రహించగలరు

★ **కర్కాటకం** దూరప్రాంతాల నుండి బంధువులు గాని మిత్రులు గాని రనున్నారు … అనుకూలుడు గురువు బహు లాభదాయకుడు శక్తియుక్తులతో అనేక వ్యవహారాలు సానుకూలం కాగలవు ఆరోగ్య వృద్ధి సుఖశాంతులు యిత్నకార్యసిద్ధి కళారంగాభివృద్ధి గమనించాలి స్త్రీలకు యిత్నకార్యసిద్ధి ఉద్యోగమందు …

★ **సింహం** ఇంట శుభం జరుగుట నిశ్చయం విదేశమునుండి బంధు మిత్రులు రానున్నారు గ్రహించాలి అధికారమందు అభివృద్ధి చేకూరనున్న వారం చలనచిత్ర రంగానుకూలత గల వారికి చక్కని అవకాశాలు రానున్నవి ఉద్యోగ యత్నాలు ఫలించ గలవు స్త్రీలకు వ్యాపారం చేసేలాగితే అనుకూలం కళారంగానుకూలత యున్నది

★ **కన్య** ఉత్తమ ఫలదాయం క్రమంగా వ్యాపారం చేసే వారికి అనుకూలదాయకం విద్యార్థి పరంగా అనుకూల వారం యత్న కార్యసిద్ధి రాజకీయ రంగాన అనుకూలం గలదని గ్రహించాలి స్త్రీలకు అప్పుయింటే … సమయం ఉద్యోగ యత్నాలు ఫలించ గల సమయం గ్రహించాలి

★ **తుల** అయినవారి సంబంధం నిశ్చయం కానున్నది వ్యవహారరీత్యా మేలైన సమయమే శుభదాయకమైన సమయం సహకారంగా … శని అనుకూలుడు స్త్రీలకు సుఖశాంతులు ఆనందం మిత్ర సమాగమం మరేం కావాలి

★ **వృశ్చికం** అప్రయత్నంగా ధనలాభం … అప్పులవారి వేధన …తలో కొంత తగవచ్చు సుఖశాంతులున్నాయి చాలా … అయిన వారు యింటికి రానున్నారు వ్యాపారం లాభదాయకం స్త్రీలకు ఉద్యోగించే వారయితే అనుకూల సమయమే

★ **ధనుస్సు** వివాదాస్పదమైన ఒకానొక వ్యవహారం సానుకూలం కానున్నది అయిన వారి సంబంధం నిశ్చయం కానున్నదని గ్రహించాలి అవసరలకు ద్రవ్యం అందుతుంది వ్యాపారం చేసే వారికి అనుకూల వారమే స్త్రీలకు అప్రయత్నాదాయం మిత్ర సమాగమం గ్రహించాలి

★ **మకరం** అప్రయత్నంగా డబ్బు అందవచ్చు వ్యాపార రీత్యా మేలు చేకూరవచ్చు ఎలినాటి శని బాధ క్రమంగా తప్పవచ్చు కొందరకు వస్తు సేకరణకు వాహన సేకరణకు అస్కారం దూర ప్రయాణాలు కొనసాగ నున్నవి స్త్రీలకు అభిమానించే వారున్నారు ఆదాయ లోపం లేదు

★ **కుంభం** సర్వశుభదాయకం శని అనుకూలుడు మీ సంపదాభివృద్ధికి అనుకూలత చేకూరగలదు రాజకీయాలందు అనుకూలం సహామరియాద చేకూరుట నిశ్చయం అప్రయత్న ధనలబ్ది కృషి లోపం లేకుంటే అన్నివిధాలా మేలే స్త్రీలకు నూతన వ్యాపారానుకూలత విద్యావేత్తల సహాయం

★ **మీనం** సర్వశుభదాయకం క్రమంగా చతుర రాశిలో అనుకూల గ్రహాలు చేరనున్నారు ఉపన్యాసంపన్నుల సహాయం లభ్యమవుతుంది దూరంచారాల నుండి బంధు మిత్రులు రానున్నారు …కవేళ కొందరు బంధువులు విదేశాల నుండి రాగలుగుతారు వివాహ ప్రయత్నాలకు సంబంధించిన వర్తలుంటాయి స్త్రీలకు ధన విషయంలో ఏమాత్రం లోపం రాదని గ్రహించాలి

విద్వాన్ కోట సత్య రంగయ్యశాస్త్రి

## కంటిశుక్లాలు ఏర్పడటానికి కారణాలు!

'ఆస్ప్రిన్' మాత్రలను నెలకు ఒకటి కంటే ఎక్కువ తీసుకొనే వారికి … శుక్లాలు ఏర్పడే అవకాశం తగ్గుతుంద… నిర్వహించిన ఒక భారత అమెరికన్ … వెల్లడైంది న్యూఢిల్లీలోని అఖిలభార… శాస్త్రాల సంస్థకు చెందిన 'రాజేంద్ర…ద్ ఆప్తాల్మిక్ సైన్సెస్' కేంద్రంలో 1,400 మంది రోగులపై ఈ పరిశీలన జరిపారు. ఈ కేంద్రం వైద్యులు, అమెరికా జాతీయ నేత్ర సంస్థ (ఎన్ ఇ ఐ) డాక్టర్ల బృందం ఈ సర్వే నిర్వహణలో పాల్గొన్నారు. ఎన్ ఇ ఐ శాస్త్రవేత్త డాక్టర్ రాబర్ట్ … తో కలిసి ఈ పరిశీలనలో ఉమ్మడి కృషి జరిపిన 'రాజేంద్రప్రసాద్ కేంద్రం' అధిపతి డాక్టర్ మదన్ మోహన్ ఇటీవల ఈ కేంద్రం 22వ వార్షికోత్సవం సందర్భంగా పరిశీలనా ఫలితాలను వెల్లడించారు

'ఆస్ప్రిన్' మాత్రలు తీసుకో… కంటి శుక్లాలకు సంబంధం వున్నదని … కేసుల విషయంలో … నిజమైనదని … మోహన్ తెలిపారు. పోషక పదార్థాలు … వగా వున్న ఆహారం తీసుకునేవారికి, అధిక రక్తపోటు (హై బ్లడ్ ప్రెషర్) వున్న వారికి కళ్లలో శుక్లాలు ఏర్పడే అవకాశం ఎక్కువగా వున్నదని వెల్లడైనట్టు కూడా ఆయన వివ… రించారు … వ్యక్తి వయస్సుతో సంబంధంగల … శుక్లాల పెరుగుదలకు కారణాలను కనుగొ… … ద్వైపాక్షిక … దీనికోసం … టర్ విశ్లేషణా పద్ధతిని అనుసరించారు

ఇలా వుండగా అవుపేడ, కలపలాంటి వాటిని వంటచెరుకుగా ఉపయోగించేవారికి కూడా కళ్లలో శుక్లాలు ఏర్పడే అవకాశాలు …గా వున్నట్లు ఈ పరిశీలనలో వెల్లడి… ఒక ఆసక్తికరమైన అంశమని డాక్టర్ … పేర్కొన్నారు ఎక్కువ సమయం …లో గడిపేవారికి కూడా శుక్లాలు … అవకాశం ఎక్కువగా వుంటుందని … చెప్పారు … డియాలో అంధత్వం ఏర్పడుతున్న కేసుల… ఎక్కువ భాగానికి 80 శాతం కంటి … బాధ్యత వహిస్తున్నాయి పరస్పరం … చేకుంటున్న వివిధ భారత, అమెరికన్ సంస్థల… కంటి శుక్లాల తొలగింపు శస్త్ర చికిత్సల విషయం ఒక ప్రధాన పరిశోధనాం…గా …న్నది ఇండియాలో కొనసాగుతున్న దృష్టి సంబంధిత ద్వైపాక్షిక పరిశోధనా కార్యక్రమాలపై ప్రస్తుతం అమెరికా రు 50 లక్షల మేరకు ఖర్చు చేస్తున్నది ●

# అందరూ దొంగలే!

బొజ్జా సత్యనారాయణ

ఉదయం శారద కాఫీ కలుపుతుండగా రవి వచ్చి ఆమె మెడవంక చూచి, "నీ గొలుసు ఏదమ్మా?" అని అడిగాడు

నిజం తెలిసిపోతుందనే భయంతో ఆమె గుండె జారింది వాడివంక క్రోధంతో చూసింది కాని కొడుకుని ఏమీ అనలేదు తీగ కదిపితే డొంకంతా కదులుతుందని భయపడి ఊరుకుంది ఈ మాటలు భర్త విన్నాడని ఆమెకు అనుమానం రవిగాడు కాన్వెంటు నుండి రాగానే వాడు మరలా గొలుసు మాట ఎత్తకుండా చెయ్యాలి అనుకుంది

*　　*　　*　　*

రాత్రి పది గంటలయింది తన ప్రక్కన పడుకున్న భార్యతో, "నీకో విషయం చెప్పాలి" అన్నాడు నరేంద్ర

"ఏమిటి?" అడిగింది శారద

"మా ఆఫీసు హెడ్‌గుమాస్తా సైకిలు అమ్మేస్తాడట సైకిలు కొత్తది నాక్కాబట్టి కొన్న ఖరీదులో రెండొందలు తగ్గించి ఇస్తానంటున్నాడు ఇలాంటి అవకాశం మళ్ళీరాదు శారదా! అందుకని నీ గొలుసుంది కదూ అది తాకట్టుపెట్టి సైకిలు కొంటాను తరువాత గొలుసు విడిపిస్తాను అవసరమైనపుడు తప్ప దాన్నెప్పుడూ పెట్టెలోనే దాస్తున్నావు కదా! ఏమంటావు?"

శారద గొంతులో వెలక్కాయ పడింది

"బంగారు నగలు అవసరం వస్తే తాకట్టు పెట్టడానికేగా!" అన్నాడు అనునయంగా ఇటువంటి సందర్భాలలో అనునయం తప్పదు

"　　"

"ఏం శారదా! మాట్లాడవే" నరేంద్ర ఆమె బుగ్గపై చెయ్యివేశాడు తడిగా తగిలింది ముఖం వంకచూసేడు బెడ్‌లైటు వెలుతురులో ముత్యాల్లా కన్నీటి బిందువులు కణతల నుండి చెక్కిళ్ళమీదగా జారి తలగడను తడిచేస్తున్నాయి

ఆమె ముఖం చేతులు గుండెలు చెమటతో తడిసిపోవడం చూసేడు ఖంగారుగా ఆమెను లేపాడు ఆమె కళ్లు తెరచింది ఆ కళ్లల్లో భయం చూసేడు "ఏమిటి శారదా! ఏమయ్యింది? ఏవిటీ చెమట? ఆ కళ్ళు ఏమిటి అలా ఉన్నాయి? భయపడ్డట్టు కలలో భయపడ్డావా? అయితే ఇంతవరకూ నేను చెప్పింది వినలేదన్నమాట!" కంగారుగా లేచాడు నరేంద్ర

శారద సమాధానం చెప్పకుండా భర్త ముఖం వంక చూసింది

"లే! లేచి ముఖం కడుగుకొని మంచినీళ్ళు త్రాగి పడుకో!" అని నడుం క్రింద చెయ్యివేశాడు ఆమె లేచి మంచినీళ్ళు త్రాగిపడుకుంది

నరేంద్ర భార్యముఖం వంక మరోసారి చూసి, ఆమె కలతజెందినట్లు గ్రహించి నిట్టూర్చి, తలక్రింద చేతులు పెట్టుకొని సీలింగువంక చూస్తున్నాడు

"గొలుసు తాకట్టు పెట్టడం శారదకి ఇష్టం లేదా? సాధారణంగా ఏ ఆడదీ తన నగలు తాకట్టు పెట్టడం ఇష్టపడదు అయినా తనకిష్టంలేదని సూటిగా చెప్పవచ్చు ఈ విధంగా తప్పించుకుంటోందా? ఇంతకీ నేను చెప్పింది విన్నదో లేదో?" సమాధానాలు లేని ప్రశ్నలను తనకు తాను వేసుకొని అంతుపట్టక కళ్లు మూసుకున్నాడు

కళ్లు మూసుకున్ననూ శారదకి నిద్ర రాలేదు హృదయ స్పందన అదుపులోనికి రాలేదు మనసుకు ప్రశాంతత చిక్కలేదు

*　　*　　*　　*

ఉదయం రవి నిద్రలేచిన తరువాతగాని మెలకువరాలేదు ఇద్దరికీ నరేంద్ర భోజనం చేస్తూ రాత్రి ప్రస్తావన తెచ్చాడు శారద భయపడుతూ తన గొలుసు తన స్నేహితురాలు ఊరికి వెళుతూ అడిగితే యిచ్చానని చెప్పింది

నరేంద్ర భార్యవంక చూసి, "నగలు ఎరువు ఇవ్వకూడదు నీ స్నేహితురాలు దురదృష్టానికో, మన దురదృష్ట ఫలితంగానో ఆ గొలుసుపోతే తిరిగి మనకు ఇవ్వగలదా? ఇవ్వలేని స్థితిలో ఉన్న ఆమెను నువ్వు ఒత్తిడిచేసి దాని విలువ రాబట్టగలవా?" అని మందలించాడు

శారద మాట్లాడలేదు

సాయంత్రం నరేంద్ర ఇంటికి వచ్చేటప్పటికి శారద ముస్తాబై కూర్చుంది అతనురాగానే కాఫీగ్లాసు అందిస్తూ చెప్పింది "ఊరికి వెళుతున్నానని"

అతను భార్యవంక చూసేడు

"గొలుసు సంగతి తెలుసుకొని వస్తాను అత్తయ్య రాకుండానే గొలుసు తెచ్చి ఇంట్లో





## అర్జునుడిగ అప్ట్రాన్

టీ వి ఎ ్ తలో అర్జునుడిగ నటిు న్న అరు ్ అప్రాం అవారు లభిస్తో ంద స్టార్ అంచ ... ఎతి యడ దీటీ వి కళాకారులకు ఎరుకులు అవర్డులు యిసు న్న మాదిరిగ న ఎయిలు టీ వి ంస అప్ట్రాన్ కూడా అవార్డు ివ్వాలని ంకల్పించిందట

మహాభారత్‌తో పాటు కర్మ ్ ఉడాన్ ంటి సరియల్స్‌ను అవార్డుల కోసం ఈ ంస ఎన్ను కున్నదట

అర్జునుడి పాత్రకు ప్రత్యక ్ ఎన్నుకున్న బి ఆర్ చోప్రా ంత్ె అభినందనీయుడు ాటువంటి అవార్డులు కళాకారులకు ఉత్తేజాన్ని కలుగచేసా యి।

పెట్టాలి" అని బయలుదేరింది

* * * *

శారద ఎలుపువిని తలుపు తెరిచింది తల్లి రాత్రిపూట చంటిపిల్లను చంకబెట్టుకొని వచ్చిన కూతుర్ని చూసి కంగారు పడింది

"ఏమిటే అమ్మాయ్ ఉత్తరముక్కయినా రాయకుండా వచ్చేవు అల్లుడు, రవి కులాసగా ఉన్నారా? నిన్ను చూస్తుంటే నాకు కంగారుగా ఉందే తల్లీ!" అని మనవరాలిని తీసుకొని చంకనబెట్టుకుంది

"దాన్నలా ప్రశ్నలతో విసిగిస్తావేమిటి? స్థిమితపడనీ!" శారద తండ్రి భార్యను చిరాకుగా చూసేడు

"అంతా బాగానే ఉన్నారు" అని తన ఇంట జరిగినదంతా చెప్పింది కూతురు చెప్పినదంతా విని విశ్వనాధం మౌనంగా ఉండిపోయాడు

"మా అత్తగారి గురించి మీకు తెలుసుగా! ఏదో ఒకరోజు గొలుసు ప్రస్తావన వస్తుంది గొలుసు చూపించకపోతే అనరాని మాటలు అంటుంది" అంది శారద

అంతా ఆలోచనలో పడ్డారు

*     *     *     *

విశ్వనాధం మధ్యతరగతి కుటుంబీకుడు శారద, శంకరం, తేజోవతి అయన సంతానం శారద పెళ్లి విషయంలో విశ్వనాధం ఎక్కువ శ్రమపడలేదు అతని అదృష్టమో, శారద జాతకమోగాని నరేంద్రను శారద ముఖంలోని అమాయకత్వం, చిన్నకళ్ళల్లోని తీక్షణత ఆకర్షించేయి

తేజోవతి పెళ్లి విషయంలో విశ్వనాధం వరాన్వేషణలో పడ్డాడు ఆడపిల్లల తండ్రులలో అదృష్టవంతుడైన విశ్వనాధం చివరికో సంబంధం తెచ్చాడు పెళ్లిచూపుల ఏర్పాట్లు అయ్యాయి విశ్వనాధం ముస్తాబవుతున్న తేజోవతి వంక చూసేడు భార్యను పిలిచి ఆమె చెవికొరికాడు ఆమె శారద దగరకు వెళ్ళి, "చెల్లాయ్‌మెళ్ళో నీ గొలుసు వెయ్యవే, బోసిమెడతో ఉండకూడదు" అంది

శారద మరుక్షణంలో తన మెడలో గొలుసుతీసి తేజోవతి మెళ్ళో వేసింది పెండ్లికొడుకును తేజోవతి అందం అతని తల్లిదండ్రులను ఆమె మెళ్ళో గొలుసు ఆకర్షించాయి పెళ్లిచూపుల తతంగం పూర్తయింది

ఓ శుభముహూర్తాన మంగళవాయిద్యాల సవ్వడిలో తేజోవతి మెళ్ళో మూడుముళ్లు పడ్డాయి విశ్వనాధం బాధ్యత తీరినందుకు సంతృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు శారదకు మాత్రం ఊపిరి స్తంభించినట్లయ్యింది ఆ గొలుసు తేజోవతి కంఠాన్ని శాశ్వతంగా అలంకరించుకుంది నరేంద్ర పెళ్లి జరిగిన మరునాడు తిరిగి ఇంటికి వెళ్ళిపోయ్యాడు ఆఫీసుకిశలవు లేదని

*     *     *     *

శారద చెల్లెలు పెండ్లి తతంగాలు ముగించుకొని అత్తింటికి వచ్చింది ఆమె గొలుసు సంగతి భర్తతో చెప్పలేదు గొలుసు ఎప్పుడూ పెట్టెలోనే పెడుతుంది ఎప్పుడోగాని మెళ్లో వేసుకోదు నరేంద్రకు గొలుసు విషయం తెలియకపోవడానికి ఇదొక కారణం రోజులు గడుస్తున్న కొద్దీ శారదలో గొలుసు విషయం మరుపుకొచ్చింది అత్తగారు ఇక్కడ లేకపోవడం కొంత మనశ్శాంతినిచ్చింది ఇప్పుడు భర్త సైకిలుకొనుక్కోవాలనుకోవడం వల్ల గొలుసు విషయం బయటపడింది

*     *     *     *

"అల్లుడు నెమ్మదస్తుడు, చెప్పిచూడమ్మా! పంటలు రాగానే ధాన్యం చెల్లగొట్టి గొలుసు చేయించి యిస్తాను" అన్నాడు విశ్వనాధం

అల్లుడు మంచివారే అత్తగారు ససేమిరా అంటుంది "శారదా గొలుసుతోటే నువ్వీ గడప దాటి లోపలికి రావాలి" అని అత్తగారు అన్నట్లే శారద ముందు కనబడింది

శంకరం అక్కడకు వచ్చాడు

"తేజోవతి దగ్గరకు వెళతాను అక్కడ పరిస్థితి ఎలా వుందో గ్రహిస్తాను చిన్న అల్లుడికి విషయం చెప్పి చూస్తాను" అని విశ్వనాధం అంటుండగానే శంకరం కలుగజేసుకున్నాడు

"వాళ్ళు మీకు గొలుసు ఇస్తారని ఊహిస్తున్నారా? అలా ఎన్నటికీ జరగదు పెద్ద బావని ప్రతిమాలి చేతులు పట్టుకొని, యివి చేతులు కావంటే సరిపోతుంది అంతేగాని మీ ఊహలు నిజమవుతాయని, మావయ్యగారూ గొలుసు తీసుకోండి మీ అమ్మాయి సంసారం నిలబెట్టండి అంటాడని అనుకోకండి" అన్నాడు

"మీ బావగారి గురించి నాకు భయం లేదురా మా అత్తగారు రెండు వారాల్లో రావచ్చు ఆవిడ వూరుకోదు, నాకు తెలుసు కొడుకు మాట వినే రకం కాదు ఆవిడకు కోపం వచ్చిందా నిప్పులు చెరుగుతుంది ఆమెను ఒప్పించడం మన తరం కాదు" అంది శారద

శంకరం చిటిక వేసి, "నాకొక ఆలోచన తట్టింది" అన్నాడు

"ఏమిటి?" విశ్వనాధం, శారద ఒకేసారి శంకరం వంక చూసి అడిగారు

"నా ఆలోచన మీకు నచ్చదు" అన్నాడు శంకరం

"నచ్చుతుందిరా బాబూ! ఏమిటి? చెప్పు" అంది శారద

"చెప్పరా! వీలైతే చూద్దాం" అన్నాడు విశ్వనాధం

శంకరం ఇద్దరివంక చూసేడు తన ఆలోచనపై వాళ్ళు ఆశలు పెట్టుకున్నారని గ్రహించాడు "నేను చిన్నబావగారింటికి వెళతాను గొలుసు విషయం ఆరా తీస్తాను రాత్రి అంతా నిద్రపోయాక, 'హూష్ కాకి' దొంగాడెత్తుకుపోయినట్టు నమ్మిస్తాను" అన్నాడు ఒక చేతిపై మరో చెయ్యి చరిచి

"ఛీ! దౌర్భాగ్యపాలోచన ఇదా నువ్వు చెప్పే ఆలోచన" విశ్వనాధం మండిపడ్డాడు

శారద "అమ్మో! అంత పనే!" అంది

"చెల్లెలింటికి నమ్మకంగా వెళ్ళి దాని

గొంతు కోస్తావా!" తల్లి మందలించింది

"ఏమార్గం లేనప్పుడు ఇదొక్కటే మార్గం" అన్నాడు శంకరం

"మన దురదృష్టవశాత్తూ నువ్వా వెధవ పని చేసేటప్పుడు దొరికిపోతే మన పరువు ఏమౌతుంది" విశ్వనాధం తన అనుమానాన్ని వెల్లడించాడు

"అప్పుడుమాత్రం చెల్లాయ్‌కి మాట రాదూ! "' అంది శారద

"విశ్వనాధం మనస్సు మధన పడుతూన్నది ఇటు శారద సంసారం సుడిగుండంలో చిక్కిన నావలా ఉంది గొలుసు విషయం చెప్పి చిన్న అల్లుడిని గొలుసు అడిగితే చిన్న కూతురు సంసారం ఛిన్నాభిన్నమవుతుంది ఏ కన్ను పోయినా తనకే బాధ" అనుకున్నాడు

శంకరం తండ్రివంక చూస్తూ, "నా మార్గానికి మీరు అనుమతించకపోతే గత్యంతరం లేదు" అన్నాడు

విశ్వనాధం, శారద మౌనం వహించారు

* * * *

శంకరం చెల్లెలు ఇంటికి వచ్చాడు తేజోవతి మెళ్ళో గొలుసు లేనట్లు గ్రహించాడు "గొలుసు ఏది?" అని అడగలేదు అడిగితే తనపై అనుమానం వస్తుందని భయపడ్డాడు తేజోవతి పెట్టె ఎక్కడున్నదీ గమనించాడు దానికి తాళం వేసిలేదు

అర్ధరాత్రి సమయాన శంకరం కరెంటు మెయిన్ స్విచ్ కట్టివేశాడు అందరూ మత్తునిద్రలో ఉన్నారని గ్రహించి, ఇదే అదును అనుకొని సద్దుచేయకుండా పిల్లిలా అడుగులు వేసుకుంటూ ఓరగా వేసి ఉన్న తేజోవతి గది తలుపులు తోసి లోపలికి చూశాడు అంతా చీకటిగా కనిపించింది నెమ్మదిగా పెట్టె ఉన్న చోటకు వెళ్ళి పెట్టె తెరవబోతున్నాడు అతని తలమీద, భుజంపైన కర్రదెబ్బ తగిలింది శంకరం తృటికాలంలో వెళ్ళి తన మంచంమీద పడుకున్నాడు

తేజోవతి భర్త "దొంగ దొంగ" అని అరచి, మెయిన్ స్విచ్ దగ్గరకు వచ్చి అగ్గిపుల్ల వెలిగించి చూచేడు "దొంగ వెధవ మెయిన్ స్విచ్ కట్టివేశాడు" అని స్విచ్ వేసేడు

లైట్లు వెలిగాయి అందరూ మేల్కొన్నారు దొంగకోసం పెరడంతా వెదికారు శంకరంతోసహా

* * *

ఉదయాన్నే శంకరం ఇంటికి బయలుదేరేముందు తేజోవతిని ఒంటరిగా కలుసుకుని, "గొలుసు జాగ్రత్త చెల్లాయ్! దొంగలు తిరుగుతున్నారు" అన్నాడు

"గొలుసు లేదు" అంది

"ఏమయింది?"

"ఏం చెప్పనురా! ఇన్నాళ్ళూ నాన్నగారికి తెలిస్తే బాధపడతారని కప్పెట్టుకున్నాం పొలం పనులకి డబ్బు కావాలసివచ్చి తాకట్టు పెడదామని మా మావగారు గొలుసు తీసుకెళ్ళారు ఈ వూళ్ళో తాకట్టు పెడితే పరువుపోతుందని పట్నం వెళ్లారు గొలుసు పర్సులో పెట్టుకొని ప్రక్కజేబులో పెట్టుకున్నారట బస్సులో దొంగలు పర్సు దొంగిలించారట" అని చెప్పింది తేజోవతి

శంకరం "అమ్మో!" అని శిరస్సుపై చెయ్యి పెట్టుకున్నాడు

"ఏవయ్యిందన్నయ్యా!" అని ఆదుర్దాగా అడిగింది

"ఈ విషయం నాన్నగారికి తెలిస్తే " అన్నాడు బాధగా

శంకరం తిరిగి ఇంటికి వచ్చాడు అక్కడ' విషయం తనవారితో చెప్పగానే అందరూ తెల్లబోయారు శారద శంకరం దెబ్బలకు మందు రాసింది

కథ మరో మలుపు తిరిగింది

* * *

శారద అత్తింటికి వచ్చింది భర్త దగ్గర ఏడుస్తూ వెక్కిళ్ళమధ్య చెప్పింది, "మేరన్నట్టు గొలుసు సినిమా హాలులో దొంగలు దొంగిలించారట క్షమించమంది త్వరలో గొలుసు కొని యిస్తానని చెప్పింది మా స్నేహితురాలు" అని చెప్పింది భర్త నమ్మేటట్లు

భార్యను క్షమించగలిగాడు కాని తల్లి గుర్తుకొచ్చేసరికి భయం కోపంగా మారింది శారద మనసు గాయపడేటట్లు మాట్లాడేడు నరేంద్ర ఎన్నడూ పరుషవాక్యం పల్కని

## ఇ''వేమన'' పద్యాలు "అ" జాతకం

రాముడొకడు పుట్టి రవికుల మీడేర్చె
కురుపతి జనియించి కులము చెఱిచె
నిలను పుణ్యపాప మీలాగు గాదకో
విశ్వదాభిరామ వినురవేమ



# “బోడో”లు ఎవరు?

అస్సాంలో తామే అతి ప్రాచీనుల మని బోడో ల వాదన- అక్కడ తమ జాతి క్రీస్తుపూర్వం 5 వేల సం ల నాటి నుంచి వుంటున్నదని వారంటారు- అస్సాం రాష్ట్రంలోని కోక్రాఝార్ జిల్లా దారాంగ్ సబ్ డివిషన్‌కి చెందిన

ఉదయగిరిలో కొంత బాగం వీరు అదిక సంఖ్యలో నివసిస్తున్న ప్రాంతం వీరంతా మైదానవాసులు గా వానికెక్కారు అహూంస్ (1228 క్రీ శ) యీ మధ్యనే వచ్చారంటారు వీళ్ళు అటు తరువాత బ్రాహ్మణులు మొదలయిన అగ్రవర్ణాలవారు ఉత్తర ప్రదేశ్ నుంచి 13 14 శతాబ్దాలలో వచ్చారని వీరి నమ్మకం - తమ జాతిని



ఆందోళనకారులు

కొండం ఏది వారు అణగదొక్కు తున్నారన్న భయభ్రాంతులు వీరికి చాలా కాలంగా ఉన్నాయి 1960 లో అస్సామి బాషని ఏకైక అదికార ప్రాంతీయ బాషగా ప్రకటించినప్పుడే వీరు తిరుగబడ్డారు

1967 లో మైదాన ప్రాంత వాసులు బ్రహ్మపుత్రానదీ తీర లోయ ప్రాంతీయులు- మైదాన జాతి మండలి గా ఎర్పాటై ప్రత్యేకంగా తమకు ఉదయాచాల్ రాష్ట్రం కావాలని కోరడం మొదలుపెట్టారు- 1978 లో వీరు రాజకీయ ప్రాబల్యం సంపాదించారు జనతాపార్టీ గవర్నమెంట్‌లో వారు కూడా బాగస్వామ్యం సంపాదించారు కాని ఆ పార్టీ ప్రభుత్వం నిలబడలేదు ఎ టి ఎ ఎ పార్టీలోని అతివాదులు వేరైపోయి 1978 లోనే యు టి యన్ యల్ యఫ్ పేరిట ఉద్యమం ప్రారంబించారు అంటే యునైటెడ్ ట్రయిబల్ నేషనల్ లిబరేషన్ ఫ్రంట్ అన్నమాట విద్యార్థి విబాగం వేరే ఏర్పడ్డది దాని పేరు ఆల్ బోడో స్టూడెంట్స్ యూనియన్- ఈ అఖిల పక్ష విద్యార్థి యూనియన్- వెనుకటి అఖిలపక్ష అస్సాం విద్యార్థి యూ నియన్- ఎదతిలోనే ఆందోళన ప్రారంబించింది ప్రత్యేక బోడోలాండ్ కావాలన్నదే వీరి లక్ష్యం వీరి నాయకుడు ఉపేంద్రనాద్‌బ్రహమ 1987 మార్చి 2న వీరి ఉద్యమానికి అంకురార్పణ జరిగింది- వీరి కోరికల ప్రణాళికలో 92 అంశాలు ఉన్నాయి- 1988 అక్టోబరు నుంచి 1989 ఎవరి దాకా వీరు తమ ఆందోళనను- కొండ జాతి ప్రజలు సాగు చేసుకొనేటందుకు వీలు కల్పిస్తూ ఆపు చేశారు- తిరిగి 1989 ఫిబ్రవరి 16 నుంచి వీరి ఆందోళన ద్విగుణీకృతంగా రాజుకుంది- బ్రహ్మపుత్రకి ఉత్తర తీరంలో బోడోలాండు ప్రత్యేక రాష్ట్రం ఏర్పడాలన్నదే వీరి ప్రదానమైన కోరిక యిప్పుడు- దీనికిగాను వీరు రక్తపాత సహిత అస్సాం బంద్‌లు మొదలు పెట్టారు 45 గంటల బంద్ మొదలు 15 రోజుల నిర్విరామ బంద్ దాకా రకరకాల బందులు వీరు నిర్వహించడంతో జననష్టం ఆస్తి నష్టం కూడా బాగా సంబవించాయి- తమ కోరికల సాదనకి అస్సాం రాష్ట్ర ప్రభుత్వంతో గాక కేంద్ర ప్రభుత్వంతో మాత్రమే వీరు చర్చలు జరుపుతామంటున్నారు ●

## అందరూ దొంగలే!

భర్తమాటలు శారద గుండెను గాయపర్చాయి ఆమె భయం పౌరుషంగా మారింది “ఎలా గయినా నా స్నేహితురాలు యిచ్చేలోపున మీ గొలుసు మీ కిస్తాను కష్టపడి సంపాదిస్తాను” అంది శారద

“ఎలా సంపాదిస్తావు ”

“చదువుకున్నదాన్ని ఏదో ఉద్యోగం చేసి సంపాదించి” ఆమె అహం దెబ్బతింది

“పౌరుషం ఉన్నంత మాత్రాన ఉద్యోగంరాదు అర్హతలుండాలి రికమండేషన్ కావాలి ” అన్నాడు నరేంద్ర

“నా మరో స్నేహితురాలు పద్మిని, వాళ్లమావయ్యకు చిట్‌ఫండ్ కంపెనీ ఉంది దాంట్లో గుమాస్తాపని చేస్తాను తీరిక సమయంలో బట్టలు కుడతాను ”

పద్మిని రికమండేషనుతో శారద చిట్‌ఫండ్ కంపెనీలో గుమాస్తాగా చేరింది తీరిక సమయాల్లో బట్టలు కుడుతూంది

రోజులు నెలలుగా మారిపోతున్నాయి శారద అత్తగారు వస్తోంది వెళుతోంది కాని ఎన్నడూ గొలుసు ప్రస్తావన తేలేదు శారద బ్యాంకు పుస్తకంలో సొమ్ము పెరుగుతోంది

నరేంద్ర తల్లి వచ్చింది కొడుకు కోడలు గదిలోలేని సమయంలో కోడలుపెట్టె తెరవడం నరేంద్ర గమనించాడు తల్లికి గొలుసు పోయిందని తెలిసి ఉండవచ్చునని కంగారు పడ్డాడు తల్లి బయటకు వెళ్ళిన తరువాత నరేంద్ర శారద పెట్టె తెరిచి, అందులో ఉన్న చిన్నపెట్టె తెరిచాడు తన కళ్ళను తాను నమ్మలేకపోయాడు మిలమిల మెరిసిపోతూ బంగారు గొలుసు కనిపించింది

“భార్య సాధించింది లేకపోతే ఈ వేళ కొంప అదిరిపోవును” అనుకొని, భార్యను పిలిచి, “మొత్తానికి సాధించావు” అన్నాడు

శారదకు అర్థం కాలేదు

“నీ పెట్టెలో గొలుసు చూసేను ”

పెట్టె తెరచి చూచి కనురెప్ప వేయడం మరచింది ఆ ఇద్దరి ముఖాలు ఒకరి నొకరు ప్రశ్నించుకుంటున్నట్టు మారిపోయాయి శారద గొలుసు మెళ్ళో వేసుకుంది తల్లికి భర్త జడిసి గొలుసుకొని ఉంటాడని శారద అనుకొంది

శారద అత్తగారు తేజోవతి పెళ్ళి చూపుల ముందే తన కూతురుకి డబ్బు అవసరంవచ్చి ఇబ్బందిలో ఉంటే సహాయపడటానికి వేరే మార్గం లేక, శారద గొలుసులాంటిదే రోల్డు గోల్డు గొలుసు పెట్టెలో పెట్టి, బంగారు గొలుసు పట్టుకు వెళ్ళి కూతురికిచ్చింది ఆమె తన అవసరాన్ని తీర్చుకొని తాకట్టు విడిపించి తిరిగి గొలుసు తల్లికి యిచ్చింది ●

# పొలాల్లో దిగుబడి పుష్కలం
# జై కిసాన్ సామ్రాట్ శక్తి అపారం.

**జైకిసాన్ సామ్రాట్ 18 46 0**
**కళకళలాడే మొక్కలు, చక్కగా**
**కట్టే గింజలు**

ఎందుకంటే జైకిసాన్ సామ్రాట్‌లో పోషక పదార్థాలు అత్యధిక పాళ్ళలో ఉన్నాయి మొక్క తొలి దశలో అవసరమైన ఫాస్ఫేట్ జైకిసాన్ సామ్రాట్‌లో పుష్కలంగా ఉంది అంచేత దీని శక్తితో ఒ మైన వేళ్ళు ఏపుగా పెరిగే మొక్కలు

అంతేకాదు ఈ ఎరువులోని 18 శాతం నత్రజని అమోనియా రూపంలో ఉండటం వల్ల ఎరువు నీటితోపాటు కొట్టుకుపోదు– అత్యధికంగా మొక్కలకు అందుతుంది

అంటే తొందరగా పెరిగేందుకు శక్తి కళకళలాడే మొక్కలు చక్కగా కట్టే గింజలు

గుర్తుంచుకోండి జైకిసాన్ సామ్రాట్ దొరికే చోటు జ వారి వారి పసుప్పచ్చ దుకాణం









**పుష్కలమైన దిగుబడుల కోసం శక్తితో నిండినవి!**

బొమ్మల సీరియల్

# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము ...అయిదవ భాగము



















నాకుతాదిక నిష్కృతి
నరకమే గతియుంచును
తాను చేసిన దుష్కృతి
తలచి ఏడ్చెను బ్రాహ్మణి


ఇష్ట మృష్టాన్నంబులు
సుష్టుగా తిని త్రేన్చుచు
తుష్టినొందిన విప్రుడు
హృష్టుడై చనుదెంచెను


"నూకలివిగో తెచ్చితే,
రూకలివిగో తీసుకో"
అనెడు భర్తకు బ్రాహ్మణి
వినిచె జరిగినదంతయు


"అయ్యయో అని
విప్రుడు
కొయ్యబారగ
నిలిచెను
ముంగిబావున
కాతడు
క్రుంగిపోయెను
పాపము।


"అయిదు రూకల కోసమూ
ఆశపడి ఆ పెండ్లికో
అరుగకుండిన ఇంతయూ
జరుగకుండెడిదే గదా।"


వల్లమాలిన ఆశచే
తొల్లి విప్రుండొక్కడు
మోసపోయిన వైనము
భూసురా। వినవెయిగూ,
ఎవరా
విప్రుడు?
ఏమా కథ?
10



(ఇంకా వుంది)

# వారఫలం

## 16-6-1989 శుక్రవారం మొదలు 22-6-1989 గురువారం వరకు

**మేషం** రాశీ చక్రమున అనేక మార్పులు రానే వచ్చాయి రాజకీయమందు అనుభవంగల వారికి అనుకూలం శుభదాయక వారం శక్తియుక్తులతో ఒకానొక వ్యవహారం సాదించుగోగలరు అది సామాన్యమా? స్త్రీలకు ఉద్యోగ రీత్యా అనుకూలవారం గ్రహించాలి

**వృషభం** శుక్ర గ్రహానుకూలత గల వారం వారాంతంలో ఎదో మేలు చేకూరగలదని గ్రహించాలి విద్యార్థులకు అనుకూల వారం యత్న కార్యానుకూలం దూర బారాల నుండి బంధు మిత్రులు రానున్నారు గమనించాలి ఆస్తి వ్యవహారమందు ఏదో యిబ్బంది రావచ్చు గ్రహించాలి స్త్రీలకు ఉద్యోగవృద్ధి ఆరోగ్యాబివృద్ధి

**మిదునం** పదిమందిలో ప్రతిష్ఠ అధికమవుతుంది అవకాశవాదులు దాపునకు రాగలరు బహు జాగ్రత్తగా గమనించి మెలగాలి సబా రంగాన ప్రసిద్ధి ఏర్పడనున్నది అయినవారి సంబందం నిశ్చయం కానున్నది గ్రహించాలి స్త్రీలకు ఎవిదంగా మేలు గాదు అదికారులవలన యిబ్బంది రాకుండా చూచుకోండి

**కర్కాటకం** శుబదాయక దినం చాలా దూరాన్నుండి కొందరు యింటికి రానున్నారు ఒకవేళ వివాహ సంబంద చర్చ లుండవచ్చు ప్రయాణం చేయవలసి రావచ్చు గాని బహు జాగ్రత్తగా సంచరించాలి స్త్రీలకు అదిక లాబం ముఖ్యంగా 22 తా బహు అనుకూలదాయకం

**సింహం** విద్యావేత్తల పరిచయం ఎర్పడనున్నది సుఖశాంతులుంటాయి గృహాన కీర్తికి ఆకరం అప్పులు వసూలు కానున్నవి అది ఎంతో లాబదాయకం ఇష్ట బంధు సమాగమం స్త్రీలకు సుఖ శాంతులు వ్యాపారం చేసేలాగైతే అనుకూల సమయంగా గుర్తించాలి

**కన్య** ఆదాయ లోపం లేదు రవి బుదుల అనుకూలత యున్నది విద్యావేత్తల పరిచయ మేర్పడుతుంది వ్యవహార విజయం వ్యాపార లాభం నూతన బంధు సమాగమం ఉద్యోగ యత్నాలు సానుకూలం కాగలవు స్త్రీలకు అనుకొనని రీతిని ధనలబ్ది వస్తు వాహన సేకరణకు అనుకూలం

**తుల** గతంలో చేసిన తప్పుల బాధను ఎదుర్కొనవలసి రావచ్చు ఇచ్చిన డబ్బును వసూలు చేసకొనే వరకూ యిబ్బందులే ఒక్క శని భగవానుడు బాగుండబట్టి పెద్దగా అనానుకూలత లేక తప్పించుకొనుటకు ఆస్కారం స్త్రీలకు శుబదాయకం దన లోపం లేదు ప్రయాణమున్నది

**వృశ్చికం** క్రమంగా శని మేలు చేయనున్నాడు వ్యాపార రీత్యా ధైర్యం వహించటం ముందుకు సాగటం న్యాయం చలన చిత్ర రంగావకాశాలకు యత్నించువారికి కొంతలో కొంత మేలున్నది బందు సమాగమం నూతన వస్తు సేకరణ ఆరోగ్యవృద్ధి స్త్రీలకు పదిమందిలో ప్రతిష్ఠ బందు సమాగమం రాజకీయాలందు పెంపు

**దనుస్సు** ఇష్ట బందు సమాగమం శుబ వ్యవహారాలను గూర్చిన చర్చలు అదికాదాయం అనుకొన్న విదంగా కార్యసాదన కొందరకు చిరకాలంగా వాంచించే వాహన వసతి అమరనున్నది వృత్తి వికాసం చెప్పదగిన ముఖ్యాంశం స్త్రీలకు సబా మర్యాద ఉద్యోగరీత్యా కళారంగ రీత్యా పెంపు చెప్పనైన వారం

**మకరం** సమీప గ్రామాలకు వెళ్ళవలసిన అగత్యం ఎర్పడుతుంది వారాంతాన అతిధి అబ్యాగతులను ఆదరించవలసిన అగత్యమున్నది సుఖశాంతులు ఆదాయం ఆనందానికి ఆకరమైన దినం అయితే బందు వత్తిడిని తట్టుకోవలసి రావచ్చు పదిమందిలో కీర్తి ప్రతిష్ఠలకు లోటు లేదు స్త్రీలకు నూతన వృత్తి వికాసం కొందరకు ఉద్యోగ రీత్యా పెంపు కొందరకు

**కుంబం** దన లోపం ఎమాత్రం లేదు వ్యాపారం లాబదాయకంగా సాగుటకు ఆక్షేపణ లేదు దూర ప్రయాణాలు చెప్పదగిన సమయం శని గురు గ్రహాలు అనుకూలించనున్నారు విద్యార్థులకు బహు అనుకూలం యత్న కార్యసిద్ధి అదిక విద్యకు ఆస్కారం కొందరు విద్యా నిమిత్తంగా దూర ప్రాంతాలకు వెళ్ళనున్నారు స్త్రీలకు చిరకాల వాంచాసిద్ధి ఆరోగ్యవృద్ధి

**మీనం** సబా మర్యాదకు ఆస్కారం వారమంతా లాబదాయకం సుఖ శాంతులు దనవృద్ధి ప్రయాణ లాబం చెప్పదగిన సమయం కొందరు నూతనోత్సాహంతో నూతన వ్యాపారాలకు దిగవచ్చు రాజకీయంగా కాలం వ్యయించే వారికి అనుకూల సమయం గాదు ఇంటికి బందువులు రానున్నారు స్త్రీలకు శ్రమకరం అదికారులతో యిబ్బంది ఉద్యోగం బాదాకరం కానున్నది కొందరకు ఈ వారం

-విద్వాన్ కోటసత్య రంగయ్యశాస్త్రి

సీరియల్

# ఈ అబ్బాయికి పెళ్ళవుతుందా?

కె గోదావరి శర్మ

(గత సంచిక తరువాయి)

17

రెండు రోజులు గడిచాయి కృష్ణకి ఏమి తోచడం లేదు అయితే ఈ అమ్మాయి మిద ఆశ వదులుకోవలసిందేనా? అంత నిశ్చయంగ పెళ్ళి చేసుకోనని చెప్పిన తర్వాత ఇంకా అనుమానం ఎమిటి? పద్మావతిగారు పిలిచి ఎమైనా అడుగుతారేమో ఎం చెప్పాలా అని మదనపడాడు గాని ఎందుచేతనో ఆవిడ ఆ ప్రసక్తి ఎమీ ఎత్తలేదు

ఈ అమ్మాయి ఇంకా చదువుతుందట ఆ తర్వాతైనా చేసుకుంటుందిగా? ఇప్పటి నుంచీ చేసుకోను అందంతే తనమీద మంచి ఇంప్రెషన్ లేదనలేదు వాళ్ళ వదినకి ఉందని చెప్పడంలో అర్థం ఎమిటి? బహుశా కొన్ని అభ్యుదయ బావాల ప్రబావం వల్ల ఆవేశంగా ఆలోచిస్తుందేమో! వ్ర వివాహం లేకపోతే బ్రతకలేదా అనీ ఇలా జీవితం అంతా చదువుకుంటూ ఉండిపోతే ఏం అనీ కాని పెళ్ళి మొగుడు సంసారం అవసరమని గుర్తించే రోజు రాకపోదు తను ప్రయత్నించి నచ్చ చెప్పగలడా?

పద్మావతిగారి సహాయం కోరితే? ఆవిడకీ తనమీద సదబిప్రాయం ఉంది ఇందిర దగ్గర చనువూ అదికారమూ ఉన్నాయి తన కోసం ఇందిరని ఒప్పించడానికి ప్రయత్నించ వచ్చు కాని ఇందిర ఆ త్రోవని ఇదివరకే మూసేసిందేమో! వదినగారు చెపితే వింటుందా? మొన్న కూడా వదినగారి అబిప్రాయం తెలిసీ తనని తిరస్కరించింది తనంటే ఇష్టంలేక కాదు ఆమె పెళ్ళికి సిద్ధంగా లేదట సిద్ధపరిస్తే

హఠాత్తుగా కృష్ణకి గతం గుర్తొచ్చింది తనూ శైలజని ఇలాగే తిరస్కరించాడు ఆమె అంటే అయిష్టత వల్ల కాదు తను అప్పటికి సిద్ధంగా లేడు కనక! తర్వాత చాలా విచారించాడు ఇందిర కూడా ఇప్పుడు తనని చేజార్చుకుంటే తరవాత విచారిస్తుందా? విచారించి ఏం లాభం? తనని దక్కించుకోవడానికి అప్పుడు శైలజకి ఏ మార్గమూ లేకపోయింది హఠాత్తుగా తను ఆఖరి ఉత్తరం రాసేసి విరమించు కున్నాడు ఇప్పుడు తను

ఇందిరని దక్కించుకోవడానికి ఏ మార్గము లేదా వెతకాలి మన ఇంది కాబట్టి మార్గమూ ఉంటుంది జరిగిన తప్పు మళ్ళీ జరగకుండా చూడాలి లేకపోతే అనుభవానికి ఫలితం ఏమిటి

ఇందిర ఇంకా ఇక్కడే ఉంది డైరెక్ట్‌గా మాట్లాడి ఆమె ఆశయాలు ఏర యాలు మార్పితం కష్టం అంయిలో మా తమ ఆమె యుంయి కోరెత్త లేక



పోతున్నాడు పద్మావతి గారిని ఎప్రోచ్ అవడం మంచిదేనా? ఎలా అడిగించాలి ఆవిడ చేత?

ప్రసాద్ గుర్తొచ్చాడు కృష్ణకి ఇలాంటి విపత్కర పరిస్థితుల్లో అతడుంటే సమయోచితంగా సలహాలిచ్చి ఆదుకొనేవాడు హాయిగా పెళ్ళి చేసుకుని సుఖంగా ఉన్నాడు అతనికి ఇలాంటి సమస్యలేవీ రావు చాలా మందికి రావు అదృష్టవంతులు

ఇందిరని చూచినప్పటి నుంచి ఇంతవరకు జరిగిన సంఘటనలు తన అనుబవాలు అనుబూతులు స్పష్టంగా ప్రసాద్‌కి ఉత్తరం రాశాడు ఈ పరిస్థితుల్లో ఏ పద్ధతి అవలంబిస్తే పని జరుగుతుందో సలహా ఇవ్వమని తిరుగు టపాలో యమర్జెంటుగా జవాబు రాయమనీ రాశాడు

* * * * * * *

మద్యాహ్నం నిద్రపోయి లేచి మొహం కడుక్కుంటూ ఉంటే ఇందిర మేడ మీదకి వచ్చింది

డాక్టరుగారు సాయంకాలం నన్ను బీచ్‌కి తీసుకెళ్ళరూ అంటూ

మళ్ళీ ఆశ్చర్యపోయాడు కృష్ణ బీచికి ఆమెని తను తీసుకెళ్ళడం ఏమిటి? గట్టిగా నడిస్తే పది నిముషాల దూరం అంటే మళ్ళీ ఏదో మూవ్ అన్నమాట! అక్కడికి తీసుకెళ్ళి ఏదో మాట్లాడుతుందన్న మాట!

అలాగే అన్నాడు ఇంకేమనాలో తెలియక

కాగల కార్యం గందర్వులే తీర్చారన్నట్టు తను చెప్పకుండానే పద్మావతి గారు ఈ అమ్మాయికి బ్రెయిన్ వాష్ చేసిందా? ఇందిర తనని అంగీకరించడానికే బీచ్‌కి రమ్మందా? మరి పద్మావతి గారు తనతో ఏమీ చెప్పలేదే! ఆ అమ్మాయిని తనతో పెళ్ళికి ఒప్పించే ముందు తనతో మాట మాత్రంగానైనా చెప్పకుండా చేస్తుందా? లేకపోతే తన మనసు గ్రహించి మరి అడగక్కర్లేదనుకుందా? అంతా అగమ్యగోచరంగా ఉంది కానీ సాయంకాలం అయితే సమస్య అదే విడిపోతుంది

* * * * * *

సాయంకాల మైంది కృష్ణ ఇందిర బీచ్‌కి వెళ్ళారు కాలినడకనే నీటికి ఎగువగా పొడి ఇసుకలో కూర్చున్నారు ఇద్దరూ

డాక్టరుగారూ నేనేం చెప్తాననుకుంటున్నారు? అనడిగింది ఇందిరే మొదట

కృష్ణకి గెస్ చేసే ఓపిక లేదు మీ ఇష్టం

**జరిగిన కథ-12** విశాఖలో వున్న కృష్ణ తన స్నేహితుడు ప్రసాద్ సహాయంతో ఖమ్మంలోని శైలజకు ప్రేమలేఖ వ్రాస్తాడు తండ్రి ఆరోగ్యం సరిగా లేదని తెలిసి వాళ్ళ వూరు వెళ్ళి వచ్చిన అనంతరం స్నేహితు లిద్దరూ కలిసి ఖమ్మం వెళ్ళి శైలజ అబిప్రాయాన్ని తెలుసుకున్న కృష్ణ ఎటువంటి నిర్ణయం తీసుకోలేకపోతాడు. ఆఖరికి తనను మరచిపొమ్మంటూ శైలజకు లేఖ వ్రాస్తాడు కాని ఆమె జ్ఞాపకాల నుంచి బయట పడలేక పోతాడు. ఈలోగా తాను అద్దె కుంటున్న యింట్లో రెప్రజెంటేటివ్‌గా పని చేస్తున్న సుబ్రమణ్యం చెల్లెలు ఇందిరతో పరిచయమవుతుంది

చెప్పండి మీరేం చెప్పినా వింటాను అన్నాడు

నన్నొక స్నేహితురాలు అనుకోండి నా సలహా వినండి అంది

కృష్ణ మాట్లాడ లేదు

మా వదిన చాలా తెలివైనది మీ అభీష్టాన్ని గ్రహించింది కాని మిమ్మల్ని అడగకుండా మి పర్మిషన్ లేకుండా మీకు పెళ్ళి ఖాయం చెయ లేదు కదా! మిమ్మల్ని అడిగితే బాధ్యత భుజాల మీ వేసుకున్నట్టు అవుతుంది నన్ను ఒప్పించడానికి మీ తరఫున వకాల్తా పుచ్చుకున్నట్టు అవుతుంది తీరా నేను ఒప్పుకుంటానో ఒప్పుకోనో! అందుకని నా దగర ఈ విషయం హింట్ చేసింది నేను స్వయంగా మీతో మాట్లాడతానన్నాను

మా వదిన నాకు పరాయిదని కాదు కాని ఇలాంటి విషయాలు మూడో వ్యక్తి ప్రమేయం లేకుండా స్వయంగా తేల్చుకోవడం మంచిది

నా నిర్ణయం మొన్న జూలో చెప్పాను- ఇప్పట్లో పెళ్ళి చేసుకునే ఉద్దేశ్యం లేదని ఆగింది ఇందిర

అవును చెప్పేరు కాని మళ్ళీ ఆలోచించండి పెళ్ళి మానేసి ఎం సాధిస్తారు? నచ్చ చెపుతున్నట్టు అన్నాడు కృష్ణ

ఇందిర తలఎత్తి అతడి కళ్ళలోకి చూసింది ఆ చూపులో ఏవో భావాలు కెరటాల్లా తలయెత్తాయి ఆ రెండు కళ్ళూ రెండు నీలి సముద్రాలని ఎంచింది కృష్ణకి

నా స్వార్థం కోసమే చెప్పడం లేదు మీరు కూడా తగిన వయస్సులో పెళ్ళి చేసుకోకపోతే తరవాత పశ్చాత్తాప పడవలసి వస్తుంది నేను కాకపోతే ఇంకొకరు కాని పెళ్ళి మాత్రం మానెయ్యకండి అన్నాడు సిన్సియర్‌గా

ఇందిర ఆశ్చర్యంగా చూసింది అలా చెప్తున్నారేం? అంది

కృష్ణ గంభీరంగా అన్నాడు నేను ఒకప్పుడు అదే తప్పు చేశాను కాబట్టి ఇప్పుడు మిమ్మల్ని చెయ్యొద్దంటున్నాను

ఆమె అతడికేసి నిశ్చలంగా చూసింది తప్పు చేసి పశ్చాత్తాప పడ్డారా? దిదు కోవడానికి ప్రయత్నించారా?

లేదు కృష్ణ తలవంచుకున్నాడు

అంటే? ఏం? ఎందుకని?

అది చెప్పాలంటే అప్పటి నా మనఃస్థితీ పరిస్థితీ మీకు చెప్పాలి అంతకు ముందు జరిగిన కథ చెప్పాలి అన్నాడు ఇందిర ఈ క్షణాన అతడికి ఎంతో ఆత్మీయురాలిలా తోచింది శైలజ విషయంలో తన ప్రవర్తన తత్ఫలితంగా తను పడిన మదన ఇలాంటి సహృదయురాలికి చెప్తే గుండె బరువు తగ్గుతుంది ఆ క్షణాన తాను చాలా బలహీనుడై ఏదో ఒక ఆసరా కోసం ఇందిర మీద ఆధారపడ్డట్టు అనిపించింది శైలజని తిరస్కరించిన తర్వాత తను పడిన మానసిక వేదన సహజమో న్యాయమో తన బలహీనతో ఇంకా తనకా శిక్ష చాలదో తనకి తెలియడం లేదు

జరిగినదంతా పూసగుచ్చినట్టు చెప్పాడు ఇందిరకి

క్రమంగా వాతావరణం బరువెక్కింది సంధ్యారుణిమతో ఆకాశం బరువెక్కింది సముద్రం మించి వస్తున్న తేమతో కలిసి గాలి బరువెక్కింది





ముసురుకుంటున్న చీకట్లతో శూన్యం బరువెక్కింది గత పునశ్చరణతో కృష్ణ హృదయం బరువెక్కింది

చీకటి పడుతున్నా ఆకాశం ఇంకా అలంకరించుకోలేదు ముఖాన బొట్టు లేదు తలలో పువ్వులు లేవు సముద్రం మాత్రం వాహ్యాళికొచ్చిన వాళ్లని వెనక్కి పొమ్మని తాను నిశారాణితో సరసాలకి సిద్ధమైంది

చాలా పొరపాటు చేశారు కృష్ణగారూ అంది ఇందిర నిరంగా

కృష్ణ మాట్లాడ లేదు

అసలు తప్పు మీది కాదు అంతకన్న మిమ్మల్ని మిస్‌లీడ్ చేసిన మీ ఫ్రెండ్‌ది

ప్రసాదా? ఆశ్చర్యంగా అడిగాడు కృష్ణ

అవును మీరు చేసిన తప్పల్లా అతని సలహామీద ఆధారపడడమే సందిగ్ధావస్థలో ఊగిసలాడుతున్న మిమ్మల్ని అంగీకారం వైపు కాక తిరస్కారం వైపు మరల్చింది అతనే మీరు చెప్పినదాన్నిబట్టి ఆ అమ్మాయి మిమ్మల్ని ఎంతో ఇష్టపడి ఉంటుంది ఆ అభిమానాన్ని చేతులారా వదులుకున్నారు మీరు అసలు అంతకంటే ఇంకేమిటండీ కావాలి మీకు? కోపంగా అడిగింది ఇందిర

కృష్ణ దీనంగా చూశాడు

అవును కన్నువంకా? కాలువంకా? ఫోటో చూసి అమ్మాయి బాగుందనుకునే కదా ఉత్తరం రాశారు? చదువుకుంది వీటన్నిటికంటే ముఖ్యం మీరంటే ప్రేమ చూపుతున్నది! ఆ అమ్మాయిని కాదని ఇంకెవర్నో చేసుకుని ఏం బావుకుందామనుకున్నారు మీరు? అంతకన్నా ఎవరైనా ఏమివ్వగలరు మీకు? మీ ఇష్టా యిష్టాలు తేల్చుకోలేక వాయిదా వెయ్యడానికి అవకాశంలేక స్వంతంగా నిర్ణయం తీసుకోలేక స్నేహితుడి సలహాతో నచ్చలేదన్న నెపంతో పలాయన మంత్రం పఠించారన్న మాట! మీకు ఆ అమ్మాయి నచ్చడం కాదండీ ముఖ్యం– పది రోజులు కలిసి తిరిగితే ఎలాంటి వాళ్లకైనా దగ్గరవుతాం– కాని మిమ్మల్ని ప్రేమించే అమ్మాయి మీకు మళ్లా ఎక్కడ దొరుకుతుంది? ఆమె ప్రేమని మీరు అంగీకరించి ఉంటే ఆమె మీకు నచ్చి ఉండేది మీ |ఫ్రెండ్‌ని| అనాలి మిమ్మల్ని తప్పుదోవ పట్టించినందుకు ఇందిర ఇంకా కోపంగా వుంది

కృష్ణకి దిగులుగా ఉంది గుండె బరువుగా ఉంది ఇందిర చెప్పేవన్నీ నిజమే అనిపిస్తోంది అప్పుడు శైలజని చేసుకుంటే హాయిగా సుఖపడి ఉండేవాడు ఆ అమ్మాయి మనసు కష్టపెట్టి తను మాత్రం ఏం సుఖపడుతున్నాడు మరి ప్రసాద్ ఎందుకలా సలహా ఇచ్చాడు అప్పుడు? ప్రసాద్ సలహా ఒక్కటే కాదు– అప్పుడే ఆ అమ్మాయెవరో పోవడం– అన్నీ అలాగే సమకూడేయి అప్పుడు

హఠాత్తుగా గుర్తొచ్చింది కృష్ణకి– క్రితం రోజు ఇందిర విషయంలో కూడా సలహా ఇమ్మని ప్రసాద్‌కే ఉత్తరం రాసిన సంగతి ఆ మాట ఇప్పుడు పైకి చెప్తే ఇంకేమన్నా ఉందా? కొట్టినా కొడుతుంది ఈ పిల్ల అనుకున్నాడు కృష్ణ

ఇది జరిగి ఎన్నాళ్లవుతూంది సరిగ్గా? అనడిగింది ఇందిర

రెండేళ్ల తొమ్మిది నెలలు విధేయతతో చెప్పాడు కృష్ణ

అప్పటికా అమ్మాయికి ఎన్నేళ్లు?

పందొమ్మిది ఉంటాయి

ఫర్వాలేదు!

అంటే?

ఇప్పటికీ మించి పోయింది లేదని ఆ అమ్మాయికి తర్వాత పెళ్లయిపోయిందేమో వాకబు చెయ్యండి అయిపోతే ఏమీ చెయ్యలేం ఒకవేళ ఏ కారణం వల్లనైనా అవకపోతే మీ అదృష్టం జరిగిన దానికి క్షమాపణ చెప్పి ఇప్పుడు పెళ్లి చేసుకోండి

కృష్ణకి ఈ సలహా ఏమంత రుచించ లేదు మళ్లీ ఏ ముఖంతో ఆమె ఎదుట పడడం? ఒకవేళ ఇంకా అవివాహితగానే ఉన్నా ఇప్పుడు తను అడిగితే అంగీకరిస్తుందా? అప్పటి తనమీద ప్రేమ ఇంకా అలాగే ఉందా? తను తిరస్కరించాక మనసు విరిగి పోయిందా? అసలు పెళ్లయి పోయిందేమో! తల్లీ తండ్రీ నచ్చ చెప్పి ఒప్పించే ఉంటారు ఏదో సంబంధం తీసుకొచ్చి మరి ఇందిర మళ్లీ ప్రయత్నించ మంటూందే!

ఏమిటి ఆలోచిస్తున్నారు? అప్పుడు తిరస్కరించి ఇప్పుడు మళ్లీ వెళ్లడం బాగుంటుందా అనా?

ఔనన్నట్టు తల ఊపాడు కృష్ణ

మరేం పర్వాలేదు బెటర్ లేట్ దేన్ నెవ్వర్ ఇప్పటికి వృధా చేసిన కాలం చాలు మరి వేస్ట్ చెయ్యకండి మీ అదృష్టాన్ని పరీక్షించుకోండి వీలైతే చేసిన తప్పు దిద్దుకోండి అంది ఇందిర

కృష్ణ ఆలోచిస్తున్నాడు

ఇద్దరూ లేచి మౌనంగా నడుస్తున్నారు బాగా చీకటి పడిపోయింది కొద్దిగా చలి గాలి వీస్తుంది రోడ్డు మీదకి వచ్చేశారు సముద్రపు హోరు దీనంగా వినిపిస్తూంది నీళ్లు చీకటిలో కలిసిపోయి ఒడ్డున కెరటాలు విరిగిన నురుగు మాత్రం స్పష్టంగా కనిపిస్తూంది దూరంగా పడవల్లో దీపాలు ఏవో మిణుగురు లోకాల్లా ఉన్నాయి మంత్ర నగరాల్లో మానవుల్ని ఆకర్షిస్తాయి కాని మధ్యలో సముద్ర మంత చీకటి అగాధం

రేపు వెళ్లిపోతున్నాను నేను అంది ఇందిర

రేపే?

అవును అందుకే ఈ రోజు మాట్లాడేశాను మిత్ర

ఆమె మరికొన్నాళ్లుండి తనకో దారి చూపిస్తే

## కపిల్, చేతన్‌ల బీచ్ స్నానాలు!



వెస్టిండీస్‌లో పర్యటన కోసం వెళ్ళిన మన క్రికెట్ క్రీడాకారులు అన్ని పోటీల్లోను ఓటమి చవి చూసిన విషయం అందరికీ విదితమే కదూ! ఓడిపోతే ఓడిపోయాం లే ఎలాగూ వెస్టిండీస్‌కు వచ్చాం కాస్త సరదా తీర్చుకు పోదామనుకున్నారు కాబోలు ఆ సరదాలో భాగంగానే మన టీమ్ క్యాప్టెన్ కపిల్‌దేవ్ ఫాస్ట్ బౌలర్ చేతన్‌శర్మ అక్కడి బీచ్‌లో ఈత కొట్టి అర్ధ నగ్నంగా తిరిగివస్తున్న దృశ్యాన్ని తన కెమెరాలో బంధించాడు ఫొటోగ్రాఫర్ షార్ట్ డ్రాయర్‌తో వున్న చేతన్ తన పర్సనాలిటీ చూసుకుంటున్నాడో లేక సిగ్గుపడుతున్నాడో తలదించుకొని వస్తుండగా కపిల్ మాత్రం కట్ డ్రాయర్‌లో నిస్సంకోచంగా నిర్భయంగా సిగ్గు పడకుండా నడుస్తున్నాడు ఈ సీరీస్‌లో అతని బౌలింగ్ ఫిగర్స్ చాలా బాగుండటమే అందుకు కారణమా!



# న్యాయపీఠం



బి.బి రావు. ఎమ్ ఏ.ఎల్ఎల్.బి.

## చిన్న కారు రైతు అంటే ఎవరు?

చిన్న కారు రైతు అంటే ఎవరు అన్న విషయం మీద మస్తానయ్య అంధ్ర ప్రదేశ్ హైకోర్టుకు అప్పీలు పెట్టుకున్నాడు చిన్నకారు రైతు అంటే ఎవరు అన్న విషయం మీద 1982లో అంధ్రప్రదేశ్ హైకోర్టు ఫుల్‌బెంచీ తీర్పును ఇచ్చారు ఫుల్‌బెంచీ తీర్పును కొట్టివేస్తూ ఐదుగురు జడ్జీలు గల హైకోర్టు ధర్మాసనం 1987లో తీర్పు చెప్పారు 1977లో అంధ్రప్రదేశ్ శాసన సభ వారు అంధ్రప్రదేశ్ వ్యవసాయ దారుల ఋణ విముక్తి చట్టం ఆమోదించారు వ్యవసాయ కూలీలు గ్రామీణ వృత్తుల వారు మరియు చిన్నకారు రైతులకు ఋణవిముక్తి కలిగించడానికి ఈ చట్టము చేశారు సెక్షన్ 3 (బి)లో వ్యవసాయ కూలీ అనగా వ్యవసాయ భూమి లేని వాడని వ్యవసాయ భూమిమీద కష్టపడి పని చేసి జీవనాధారం కలిగి వున్న వాడని వివరణ ఇచ్చారు గ్రామీణ వృత్తి పనివాడు అనగా వ్యవసాయ భూమిలేని వాడని వ్యవసాయమునకు ఉపయోగించు పనిముట్లు తయారు చెయ్యడం లేదా మరమ్మత్తులు చేసుకొని జీవనాధారం కలిగి వున్నవాడని వివరణ ఇచ్చారు ఇక చిన్న రైతు అనగా వ్యవసాయ భూమి మీద వచ్చు ఆదాయం జీవనాధారంగా కల వ్యక్తి అని మరియు వ్యవసాయ భూమి కలిగి వుండి మరియు స్వయముగా వ్యవసాయము చేసుకొను వ్యక్తి అని వివరణ ఇచ్చారు ఆ వ్యవసాయ భూమి పల్లపు భూమి అయితే ఒక హెక్టారుకు మించ కూడదని మెట్ట అయితే రెండు హెక్టారులు దాటకూడదని వున్నది ఇక షెడ్యూల్డ్ జాతివారు అయితే పల్లపు భూమి రెండు హెక్టారులు మించకూడదని మెట్ట అయితే నాలుగు హెక్టారులు దాటకూడదని సెక్షన్‌లో వివరణ వున్నది ఈ వివరణలు ప్రకారం వ్యవసాయకూలీలు గ్రామీణవృత్తుల వారు వ్యవసాయ భూమిలేనివారని స్పష్టమైనది చిన్న రైతు అనగా వ్యవసాయ భూమి కలిగి వుండి మరియు స్వయముగా వ్యవసాయము చేసుకొను వాడు అని స్పష్టముగా వున్నది ఈ వర్గముల వారికి ఋణ విముక్తి కలిగించడానికి ఈ చట్టము చేశారు అని హైకోర్టు ఫుల్ బెంచ్ (ఐదుగురు జడ్జీలు) 1987లో తీర్పు ఇచ్చారు ఇక చిన్న రైతు ఎవరు అన్న విషయం మీద 1987 ముందు హైకోర్టు భిన్నాభిప్రాయములు వ్యక్తము చేశారు చిన్న రైతు అనగా వ్యవసాయ భూమి కలిగి వుండి మరియు స్వయముగా వ్యవసాయము చేసుకొను వాడు అని చదువ వలెనా వ్యవసాయ భూమి కలిగి వుండి లేదా స్వయముగా వ్యవసాయము చేసుకొనువాడు అని చదువ వలెనా అన్న ప్రశ్న మీద హైకోర్టు బిన్నాభి ప్రాయములు వ్యక్తము చేశారు 1979లో కోటేశ్వరమ్మ కేసులో సంగిల్ జడ్జి వ్యవసాయ భూమి కలిగి వుండి లేదా స్వయముగా వ్యవసాయము చేసుకొనువాడు అని చదువవలెను అని తీర్పు చెప్పారు దీనికి విరుద్ధంగా సుబ్రహ్మణ్యం కేసులో మరొక సంగిల్ జడ్జి తీర్పు చెప్పారు 1982లో హైకోర్టు ఫుల్‌బెంచ్ కోటేశ్వరమ్మ కేసులోని తీర్పుతో ఏకీబవించారు హైకోర్టు ఫుల్‌బెంచ్ చిన్న పాపయ్య కేసులో తీర్పు చెప్తూ వ్యవసాయ భూమి లేనప్పటికి ఒక వ్యక్తి స్వయముగా వ్యవసాయము చేసుకున్నప్పుడు అతడు చిన్నకారు రైతు అనబడతాడు అని వివరించారు 1987లో అంధ్రప్రదేశ్ హైకోర్టు దర్మాసనం (ఐదుగురు జడ్జీలు) 1982లో హైకోర్టు ఫుల్‌బెంచ్ ఇచ్చిన తీర్పుతో ఏకీబవించ లేదు చిన్నకారు రైతు అనగా వ్యవసాయ భూమి కలిగి వుండి మరియు స్వయముగా వ్యవసాయము చేసుకొనువాడు అని 1987లో హైకోర్టు ఫుల్‌బెంచ్ (ఐదుగురు జడ్జీలు) తీర్పు చెప్పారు ●

## ఈ అబ్బాయికి పెళ్ళవుతుందా?

బాగుండునని తోచింది కృష్ణకి కాని ఆ మాట పైకి అంటే తెలివితక్కువ తనంగా ఉంటుందని ఊరుకున్నాడు

* * * * * * *

మర్నాడు సాయంత్రం ఇందిర ప్రయాణమైంది చెప్పడానికి వస్తే ఆమెతో బాటు తనూ మెట్లుదిగి వచ్చాడు కృష్ణ

మీ శైలజ దొరికితే నాకు రాయండేం! మీ పెళ్ళికి నన్ను ఎలవడం మరిచి పోకండి

బలేవారే మిమ్మల్ని ఎలా మరిచి పోతాను? అన్నాడు కృష్ణ నొచ్చుకుంటూ

అందరి దగ్గరా వీడ్కోలు తీసుకున్నాక కృష్ణ వైపు తిరిగి వెళ్ళొస్తానూ అంది ఆప్యాయంగా ఆ పెద్ద కళ్ళలో వాత్సల్యం తొణికిసలాడింది కృష్ణ కళ్ళు చెమ్మగిల్లాయి మౌనంగా తల ఊపాడు

ఇందిర వెళ్ళిపోయింది

### 18

చీకటి పడుతున్నా కృష్ణ గది వదల లేదు బాల్కనీలో కుర్చీ వేసుకుని కూచుని ఆకాశం వైపు చూస్తున్నాడు రేడియో ఎదో వాగుతూంది కాని అతడి మనసు ధానిమీద లేదు

తనకి జీవితంలో అందరూ మంచివాళ్ళే తారసపడు తున్నారు అందరూ తనకంటే ఉన్నతుల లాగా కనిపిస్తున్నారు తల్లి తండ్రి శైలజ ఇందిర పద్మావతిగారు ప్రసాద్ రెడ్డి వదిన చివరకు శ్రీనివాస్- అందరూ తనని అబిమానించారు అందరూ తనకోసం అంతో ఇంతో కష్టపడ్డారు తనొక్కడే వీళ్ళందరి మధ్యా అసమర్థుడిగా మిగిలి పోతున్నాడు తను సుఖపడలేదు తన వల్ల ఇంకెవరూ సుఖపడ లేదు ఎందుకని? ఏమిటి తనలో లోపం?

ఈ ప్రేమ బంధాలన్నీ మనని కట్టిపడేసే తాళ్ళనీ తప్పించుకోవాలనీ అనుకున్నాడు తను కాని ఆ బంధనలో ఎంత తీయదనం ఉంది! అందరికీ ఎందుకు తనంటే అభిమానం? వీళ్ళందరికీ తనేమివ్వ గలడు?

నీటి కుండలో కవ్వంపెట్టి చిలికితే ఏమీ రాదనుకున్నాడు కాని ఏ గుండె నీటికుండా ఓటికుండా కాదు ఒక్కొక్క హృదయం ఒక క్షీరసాగరం క్షీరసాగర మథనంతో అమృతమూ పుట్టింది హాలాహలమూ పుట్టింది అయితే హృదయ సాగర మదనంలో కష్టసుఖాలు వేరేవేరే రావు కలిసే ఉంటాయి ప్రతి సంఘటనా ఉగాది పచ్చడిలా తీపి చేదుల సంఘటన అలాగే సృష్టిలో స్వేచ్ఛ నియతి కూడా ఒకదానిలో ఒకటి ఇమిడే ఉన్నాయి పైకి నిర్బంధంలా కనిపించే దానిలో ఒక స్వేచ్ఛ ఆనందం ఉంటుంది పైకి ఏ కట్టడీ లేనట్టు కనిపించేదాని గుండె దేనికో కట్టుపడే ఉంది గాలిలో ఎగిరే పక్షిని భూమిమీద పురుగు ఆకర్షించి బందిస్తుంది గడియేని ఆగని కాలాన్ని గడియారపు బాహువులు బందిస్తాయి ఎల్లప్పుడూ కల్లోలంగా ఉండే కడలి తరంగాల్ని చెలియలి కట్ట బందిస్తుంది అదూ ఆపూ లేని గాలిని చెట్టుకొమ్మలు బందిస్తాయి ఆకాశంలో ఎత్తుగా ఎగురుతూ పల్టీలు కొట్టే గాలిపటానికి దారపు కొస భూమ్మీద ఎల్లవాడి చేతిలో ఉంటుంది అనంతమైన ఈ వెతుకులాటని అగోచరమైన గమ్యం నడిపిస్తుంది కవి ఇస్మాయిల్ రాసినట్టు ఆ మనిషి ఈ మనిషిని బందిస్తాడు ఇద్దరినీ కలిపి బందిస్తుంది మనీష ఇది ప్రకృతి ఇది అజేయం

(ఇంకాఉంది)

# యువత! కవిత!

## అసూయ!

హృదయం లేని మనిషికి (మనిషా?!)
హృదయ ముంటుంది
కానీ
ఆ హృదయానికి
హృదయమున్న మనిషిని చూస్తే
హృద్రోగ మొస్తుంది!

—దగాని సుద

## కాలం గుండె

మోసాలకు మీసాలు మెలివేస్తూ
ద్వేషాల కురులు పెంచేస్తూ
కాలాన్ని కాటేస్తావెందుకు
పూల పరిమళమై వ్యాపించు
కాలం గుండె గుబాళిస్తుంది
నిన్ను ప్రేమతో ముద్దాడుతుంది
నీ ముందు నిలువుటద్దమై మెరుస్తుంది!

సి బి కృష్ణ

## నగ్నత్వం!

సృష్టిలోని
ఓ నగ్న సత్యానికి నిదర్శనంగా
నగ్నంగా నిను కని
తన నగ్న స్తన్యాన్ని కుడిపి
అవిఘ్నంగా నిను సాకిందో తల్లి!
అంతకు మించిన
ఏ నగ్నత్వం కోసం
అమ్మాయిల వంక
పదే పదే ఆబగా చూస్తావ్???

ఉమాశివ

## అమీబా

నాకు కాళ్ళు లేవు నడవడానికి
నాకు గళం లేదు పాడడానికి
నాకు రాగంలేదు శృతి చేయడానికి
నాకు కళ్ళు లేవు వీక్షించడానికి
అందరిపై ఆధారపడే నేను
అస్వతంత్రుడ్ని అమీబాని!

విద్వాన్ వి ప్ర శ్రీ

## పాడియావు

ఈ దేశంలో
పాడియావుల్లాంటివి పథవులు
లేగదూడల్లాంటివారు ప్రజలు
పొదుగు చేపుకు వచ్చాక
గుదియకు కట్టివేయబడతాయి దూడలు
పదవులు చేతికందాక
ప్రక్కకు నెట్టివేయబడతారు ప్రజలు

పైల కృష్ణారావు

## పోస్టుమ్యాన్

ఎండనక వాననక
కాళ్ళు అరిగేలా
ఇల్లిల్లూ తిరిగి
యోగక్షేమాలు అందించి
తన సంగతిమాత్రం
మరచిన మహామనీష

— పాటిబండ్ల శ్రీమన్నారాయణ



# సీరియల్ సూపర్ గర్ల్

## వింజమూరి విజయ శాంభవి

(గత సంచిక తరువాయి)

మద్రాసు పోలీసు కమీషనర్ గారిని కలుసుకుని వారి సహాయం అర్థించి వారికి కార్తీ ఫోటోని అందజేసి పోలీసులు వెంటనే కార్తి కోసం వేట ప్రారంభించడంతో సంతృప్తి పడకుండా స్వయంగా తమ ప్రయత్నం ప్రారంభించిన చైతన్య - అర్జున్‌లు మెడ్రాస్‌లోని కొన్ని ప్రాంతాలు గాలించి బాగా అలసిపొయ్యి నిరాశగా ఆ రాత్రి తమ హోటల్ రూమ్‌కి తిరిగివచ్చారు

అప్పుడు తెలిసింది వారికి కార్తీ ఆచూకీని తెలిపే చిన్న క్లూ!

అర్జున్‌తోపాటు మెడ్రాస్ వచ్చి తమ బంధువుల యింట్లో దిగివున్న అతని ఫ్రెండ్ ఒకతడు అర్జున్ రూమ్‌కి వచ్చాడు కబుర్లకోసం! అతడితో మాట్లాడే ఇంట్రెస్టు ఓపికా లేకపోయినా ఫార్మాలిటీకోసం అతడితో మాట్లాడుతున్నాడు అర్జున్ మాటల సందర్భంలో ఆ కుర్రాడు అన్నాడు

అన్నట్టు ఉదయం పరిచయంచేసిన మీ ఎ యాన్సీ ఈ మధ్యాహ్నం హోటల్ సుదార దగ్గర కనిపించార్రా అని

అంతే ఈ మాట వినగానే ఉలిక్కిపడారు చైతన్య అర్జున్‌లు

వాట్? నిజమా నువ్వు చెబుతున్నది? అతడి భుజం పుచ్చుకుని కుదిపేశాడు అర్జున్

ఆ స్నేహితుడు తెల్లబొయ్యి అదేమిట్రా అర్జున్ అలా అంటావు? నాకు అనుమానాలు చెప్పాల్సిన అవసరం ఏమిటి? ఆ అమ్మాయే అదే రెండు జడలు అదే పంజాబీ డ్రెస్ చేతిలో రెడ్ సూట్‌కేస్ అతడి మాట పూర్తి కానేలేదు

కమాన్ అర్జున్ లెట‌జ్‌గో టు సుదారా హోటల్! అర్జంటుగా అక్కడికి చేరుకోవాలి మనం ఒక్క ఉదుటున లేచి రూమ్ బయటికి పరుగెడుతున్నట్టే నడుస్తున్న చైతన్య వెంట అదే వూపుతో నడిచాడు అర్జున్

అర్జున్ మిత్రుడు వారి ఖంగారూ ఆ పరుగూ చూసి తెల్లబొయ్యాడు! ఏమయింది వాళ్ళకి? తను చెప్పినమాటల్లో అంత ఖంగారు పడాల్సిన విషయం భయపడాల్సిన విషయం ఏముంది? తెల్లమొహంతో చూస్తూండిపొయ్యాడు అతడు

కానీ ఆత్రతగా ఆశగా ఖంగారుగా కార్తీ కోసం పరుగడుతున్న వారికి తెలీదు అప్పటికి కార్తి పడకూడని వారి చేతుల్లోకే వెళ్ళిపోయిందని

* * *

కస్తూరీబాయి చెప్పిన కథని ఆవిడని పూర్తిగా నమ్మి ఆవిడకి రెడ్ సూట్‌కేస్‌ని అప్పగించడానికి సిద్ధపడిన కార్తీకి ఆఖరి క్షణంలో కొన్ని అనుమానాలు కలిగాయి

రాణి పట్ల తమ కెంతో అభిమానం అని చెప్పిన కస్తూరీబాయి కనీసం రాణి ఎలా వుంది? ఎక్కడ వుంది? ఏ పరిస్థితుల్లో వుంది? అని అయినా అడగకపోవడం గుర్తువచ్చి కార్తీకి ఎంతో ఆశ్చర్యం కలిగింది

అంతేగాక వారికోసంగా యింత రిస్క్ తీసుకుని రాక్షసుల్లాంటి శత్రువుల్ని ఎదుర్కొంటూ వారిచేతుల్లోనుండి తప్పించుకోవడానికి పడరాని పాట్లు పడుతూ చివరికి ఎలాగో క్షేమంగా యిక్కడికి చేరుకోగలిగిన తనపట్ల అభిమానం ఆవిడ మాటల్లో కురిపించినప్పటికీ మర్యాదకోసమైనా ఒక్కసారి తనని వాళ్ళ యింటికి ఆహ్వానించకపోవడం విచిత్రంగా వుంది! పైగా తనే సూట్‌కేస్‌తో వాళ్ళ యింటికి వస్తానని అన్నప్పుడు ఆవిడ మొహంలో హఠాత్తుగా నవ్వు మాయమైన విషయం యిప్పుడు గుర్తువస్తోంది తనకి

ఆవిడ వాళ్ళ యింటికి తన రాకను యిష్టపడకపోవడానికి కారణం ఏమిటి?

ఒక అనుమానం అన్నది తలెత్తాక ఒకదాని వెంబడి ఒకటిగా అనేక సందేహాలు పాము పిల్లల్లా తలెత్తసాగాయి కార్తీ మనసులో! నిన్నటి రాత్రి ఫోన్‌లో తనతో అంటీ ముట్టనట్టు మాట్లాడిన ఆ వ్యక్తి కస్తూరీబాయి చేత తన కొడుకని చెప్పబడుతున్న ఆ వ్యక్తి కూడా పొరబాటుగానైనా రాణి విషయం తన మాటలో రానీయకపోవడం రంగనాయకిని సైతం మద్రాస్ రావద్దనడం తననే స్వయంగా పంపమని చెప్పడంలో గల ఉద్దేశ్యం ఏమిటి?

సూట్‌కేస్‌తో రంగనాయకి మెడ్రాస్ రావడం తను రావడంకంటే ప్రమాదమా? ఆమెకంటే ఎక్కువగా శత్రువులకి తనని గుర్తించే అవకాశమే అధికం పైగా కస్తూరీబాయి తన కొడుకు పేరు సుకుమార్ అంది తనతో మాట్లాడిన వ్యక్తి తనపేరు నిఖిల్ అని చెప్పాడు మరి అలా ఎందుకు చెప్పాడు?

మరో విషయం ఏమిటంటే రాత్రి తను మాట్లాడినప్పుడు రంగనాయకిని శత్రువులు ప్రమాదానికి గురిచేశారన్న విషయం తెలీని వారికి తెల్లవారేసరికి ఆ విషయం ఎలా తెలిసింది రంగనాయకి తల్లి ఫోన్లో ఆ విషయం చెప్పిందన్న మాట ఎంతవరకు నిజం కూతురు చావు బ్రతుకుల్లో వున్న సమయంలో వీరికి ట్రంకాల్ చేసి మాట్లాడే ఓపిక స్థిమితం ఆ తల్లికి ఎక్కడున్నాయి? కస్తూరీబాయి మాటలు నమ్మవచ్చా?

హఠాత్తుగా మరో విషయం గుర్తువచ్చింది కార్తీకి రాణి తల్లి బంధువైన దుర్మార్గుడు అని చెప్పబడుతున్న వ్యక్తి అమెరికన్ ఎంతలేదన్నా అతడు నడివయస్కుడై వుంటాడు కానీ తనవెంటబడ్డ సంజయ్ పార్టనర్ కాదే? పైగా యంగ్ ఫెలో! రంజన్ అంతే!

సంజయ్ బృందానికి నాయకురాలు సోనియా అన్న వనిత! మరి ఈ రెండో గ్రూప్ రంజన్ బృందం ఎవరి మనుషులు? ఈ గాంగ్‌కి చెందిన వ్యక్తులే ఆ రోజు రాణిని హత్యచేసింది వారికేం పగ రాణిపట్ల? ఈ రెండు ముఠాలకి ఒకరిపట్ల ఒకరికి శత్రుత్వం దేనికి? సూట్‌కేస్ లోని ఆ సంపదకోసమా? ఈ రెండు ముఠాలలో రాణి తల్లి ఎందువుకి సంబంధించిన అసలు ముఠా ఏది? రాణిని బంధించి వుంచినది ఈ యిద్దరిలో ఎవరు?

ఈ గజిబిజి ఆలోచనలతో అనుమానాలతో చికాకుగా తయారయింది కార్తీ బుర్ర లోతుగా ఆలోచించే కొదీ కార్తీకి కస్తూరీబాయి మీద అనుమానం కలగసాగింది

రాత్రి తనతో ఢిల్లీ నుండి ఫోన్లో మాట్లాడిన వ్యక్తి కస్తూరీబాయి కొడుకయి వుంటాడా? ఇక్కడ కూడా తనకోసం రెండు గాంగ్‌లు ఎదురుచూస్తున్నాయా? అందుకేనా అతడు తన సూట్‌కేస్ పట్టుకుని మెడ్రాస్ రమ్మన్నది? అయితే అసలు సూట్‌కేస్ తాలూకు మనుషులు ఎవరు?

జరిగిన కథ 21 రాణికి సహాయం చేద్దామనుకున్న కార్తీని అడుగడుగునా శత్రువులు వెంటాడుతుంటారు కార్తీని వెతుక్కుంటూ విజయవాడ చేరిన చైతన్య స్పృహ కోల్పోయి పడివున్న రోజ్‌ను గమనించి ఆమె ద్వారా సమాచారం తెలుసుకొని కార్తీ కోసం మద్రాసు వెళ్తాడు మద్రాసు చేరిన కార్తీకి అనుకోకుండా బావ అర్జున్ తటస్థపడి తనున్న లాడ్జికి తీసుకు వెళ్తాడు అర్జున్ కళ్ళు గప్పి ఆ లాడ్జి నుంచి తప్పించుకొని వచ్చి వేరే హోటల్ గదిలో వుంటుంది కార్తీ రాణి అత్తగారినంటూ ఒకావిడ వచ్చి రాణి తాలూకు రెడ్ సూట్‌కేసును యివ్వమంటుంది

ఇంకా తనని ఎందుకు కలవలేదు వాళ్ళు?

ఈ కస్తూరీబాయి మోసగత్తా? అస లీ సూట్‌కేస్‌లో ఏముంది? తొలిసారిగా అనిపించింది కార్తీకి తను ఈ బాధ్యతని నెత్తిన వేసుకుని చాలా పొరపాటు చేసిందేమోనని

ఈ ఆలోచన ఆమెకి విజయవాడలో నే వచ్చివుంటే బాగుండేది చాలా ఆలస్యంగా ఈ అనుమానం వచ్చింది కార్తీకి అయితే అప్పటికే చాలా ఆలస్యమైందని గ్రహించలేకపోయిందామె

తను రెడ్ సూట్‌కేస్‌ని ఆవిడకి అప్పగించెయ్యనందుకు ఎంతో సంతోషించింది కార్తి! కస్తూరీబాయి తిరిగివస్తే ఏం చెప్పాలా అని ఆలోచించసాగిం దామె కొద్ది నిముషాల తరువాత ఒక నిర్ణయానికి వచ్చిందామె సూట్‌కేస్ కోసం ఆవిడ మళ్ళీ వచ్చినప్పుడు తనూ ఆవిడ వెంట వస్తానని అనాలి

కార్తి మంచం క్రింద దాచిన రెడ్ సూట్‌కేస్ బయటికి తీసింది సరిగా అదేసమయంలో కాలింగ్‌బెల్ మ్రోగింది కార్తి ఒళ్ళు పులకించి చప్పునవచ్చి తలుపుతీసింది తీసినవెంటనే అప్రయత్నంగా అడుగు వెనక్కివేసింది కార్తి ఆ వచ్చిన వ్యక్తి కస్తూరీబాయి కాదు

హల్లో బేబీ! హౌ డూ యూ డూ నోట బంగారు పన్ను తళుక్కుమంది అతని పెదవుల కదలికకి

అతను నల్లగా ఆరడుగుల ఎత్తున్నాడు బలిష్టంగా వున్నాడు గ్రేకలర్ సఫారీ సూట్ ధరించాడు అతడి వయసు నలభై ఏళ్ళుంటుంది కుడి బుగ మీద గాటుంది ఒత్తయిన మీసాలతో ఎర్రని జీరల కళ్ళతో మొహం కర్కశంగా అనిపిస్తున్న పెదవులు నవ్వుతున్నాయి ఆ నవ్వులో సైతం కృత్రిమత్వం గోచరిస్తోంది అప్రయత్నంగా ఓ అడుగు వెనక్కివేసింది కార్తి మళ్ళీ

అప్రయత్నంగానే అడిగింది హూ ఆర్ యూ అని

మళ్ళీ నవ్వా డతను! తళుక్కుమంది బంగారు పన్ను!

నే నెవర్నో చెబితే భయపడిపోతావు బేబీ! నేను రెడ్ సూట్‌కేస్ కోసం వచ్చాను! ఇంగ్లీషులో అన్నా డతను! గరగరమంది అతని కంఠం!

ఉలికిపడి చూసింది కార్తి మళ్ళీ ఇత డెవరు

నేను అసలు ఈ సూట్‌కేస్‌కి హక్కుదారుడైన వ్యక్తికి బాగా కావలసినవాడ్ని కస్తూరీబాయి మోసగత్తె! అంటూనే లోపలికి అడుగు వేశా డతను!

తెల్లబోయి చూ సింది కార్తి! నవ్వా డతను ఆ నవ్వు సైతం వక్రంగా ఉంది

ఐ నో మై డియర్ కస్తూరీబాయి విషయం నా కెలా తెలుసా అనుకుంటున్నావుగదూ ఈ ప్రపంచంలో నాకు తెలీనిది నా నుంచి దాచగలిగినదీ ఏదీ వుండదు! నీ మనసులోని ఆలోచనల్తో సహా అతను నవ్వుతూ ఆ మాట



## సూపర్‌గర్ల్

అన్నా అందులో బెదిరింపు స్పష్టంగా అర్థమైంది కార్తీకి

ఎప్పుడు లేనిది అతన్ని చూస్తుంటే కార్తీకి ఏమిటోగా కాస్త బెరుగా అనిపించింది! అయితే దాన్ని పైకి ప్రకటించలేదామె! అతి మామూలుగా ధైర్యంగా చూసిందతడి వైపు!

మీరు రావటం ఏమిటి? అసలీ సూట్‌కేస్ అందుకోవాల్సిన ఆ వ్యక్తి రావచ్చుగదా ? అన్నది!

ఆమె మొహంలోకి చూసి నవ్వాడతను యు ఆర్ రియల్లీ ఇంటలిజంట్ బేబీ! నీ కింత అపనమ్మకం అక్కర లేదు! సూట్‌కేస్‌తో నా వెంట బయలుదేరు! స్వయంగా నీ చేతుల్తో మా బాస్‌కి దాన్ని అప్పగిద్దువు గానీ అంటూనే తన జేబులో నుండి బేటరీతో పనిచేసే ఓ మినీ టేప్ రికార్డర్‌ని తీసి అక్కడ సోఫాలో కూర్చుని దాన్ని ఆన్ చేసి కార్తీ వైపు వినమన్నట్టు చూశాడు!

మరుక్షణం ప్రారంభమయిన ఆ సంభాషణని విని నిశ్చేష్టురాలైంది కార్తీ! గంట క్రితం కస్తూరీబాయికీ తనకీ మధ్య జరిగిన సంభాషణ ఆవిడ చెప్పిన కథ పొల్లుపోకుండా రికార్డ్ చెయ్యబడి వుంది! కార్తీ మొహం చూసి నవ్వి టేప్ రికార్డర్‌ని బటన్ నొక్కి ఆఫ్ చేసి మళ్ళీ తన జేబులో దాచేసుకుంటూ

ఇప్పటికైనా నమ్ముతావా బేబీ నీ దగరున్న రాణీ సూట్‌కేస్ చెందాల్సింది అందాల్సింది మాకని? అందుకే అన్ని ఏర్పాట్లతో నీ కోసం ఎదురుచూస్తూ రెడీగా వున్నాం! నువ్వు నిజంగా చాలా తెలివైనదానివి! కస్తూరీబాయిని నమ్మి వెంటనే సూట్‌కేస్‌ని అప్పగించలేదు అంటూ వంకరపళ్ళు కనబడేలా నవ్వేడు

చిరాగ్గా అనిపించింది కార్తీకి దాన్ని పైకి కనపడనీకుండా

సో మనం బయలుదేరుదామా? అంది!

ఈ విషయం ఏమిటో వీలయినంత తొందరగా తేల్చేసుకోవాలని వుంది ఆమెకి!

ఓ పది నిముషాలు ఆగు బేబీ! కస్తూరీబాయి వస్తుంది దాని సంగతి కాస్త తేల్చుకుని వెళదాం తాపీగా సోఫాలో వెనక్కి వాలి కూర్చుని డన్‌హిల్ సిగరెట్ వెలిగించుకున్నాడతను!

ఉలిక్కిపడి చూసింది కార్తీ! ఏదో అనబోయి అంతలోనే ఆ ఆలోచన విరమించుకుని మౌనం వహించిందామె! ఆమెకి అనిపించింది రోజ్ అన్నట్టు నిజంగా ఇదేదో విష వలయం లాగ వుంది! ఇక్కడ కూడా ఈ సూట్‌కేస్ కోసం రెండు గాంగ్‌లు కాచుకుని వున్నాయా? వీళ్ళే ఇంకా వున్నారా? వీళ్ళలో అసలు రాణీ మనుషులు ఎవరు? ఎవర్ని నమ్మి తను సూట్‌కేస్‌ని అప్పగించాలి?

గట్టిగా అనుకుంది కార్తీ ఇతనితో వెళ్ళి వీళ్ళ బాస్ అయిన ఆ వ్యక్తిని చూసి తనకి నమ్మకం అన్నది కుదిరితేనే ఆ సూట్‌కేస్‌ని అప్పగిస్తుంది! లేదా ఎలాగో తప్పించుకుని పారిపొయ్యి వచ్చి వెంటనే హైదరాబాదు బయలు దేరుతుంది! ఇదేదో తను వూహించినట్టు అతి మామూలు వ్యవహారంలా లేదు! తను అన్ని సాహసాలు చేసి ఇంతదూరం రావడం తప్పేమో అనిపిస్తోంది!

తను హైదరాబాదు వెళ్ళిపోయి అంకుల్‌ని కలుసుకుని విషయం అంతా ఆయనతో చెప్పి ఈ బాధ్యతని ఆయనకి అప్పగించేస్తే అదేదో ఆయనే చూసుకుంటారు తను అసలు ఈ విషయం అంకుల్ చైతన్యకి చెప్పకపోయినందుకు పశ్చాత్తాపపడింది కార్తీ

మరో అయిదు నిముషాల తరువాత ఆ హోటల్ రూమ్‌లో అడుగుపెట్టిన కస్తూరీబాయి అతడ్ని చూసి ఉలిక్కిపడింది

ఆమెని చూడగానే వికటంగా బిగరగా నవ్వాడు అతడు హల్లో కస్తూరీబాయి ఉరఫ్ కనకం? హౌ ఆర్ యూ? అంటూ!

వేగంగా రంగులు మారసాగాయి ఆమె మొహంలో ఆవిడనే చూడసాగింది కార్తీ! ఈవిడ పేరు కనకమా?

నువ్వా! అంది ఆవిడ!

అంటూండగానే ప్రత్యక్షమైంది ఆవిడ చేతిలో నల్లగా నిగనిగలాడుతున్న రివాల్వర్! ఆవిడ మొహంలోని సౌమ్యం మంచితనం చక్కని చిరునవ్వు మంత్రం వేసినట్టు మాయమై కర్కశంగా ఎబ్బెట్టుగా మారింది ఆ మొహం

యూ సన్నాఫె బిచ్! ఇక్కడా ప్రత్యక్షమయ్యావా? నిన్ను ఒక్క క్షణంకూడా బ్రతకనీయను చావు అంటూ ట్రిగ్గర్ నొక్కబోయింది కనగా

ఇంతలో ఎప్పుడు ఎక్కడి నుంచి తీశాడో అతడి చేతిలో రివాల్వర్ ఆమెకంటే క్షణం ముందుగానే ట్రిగ్గర్ నొక్కాడతను సైలెన్సర్ అమర్చబడిన ఆ రివాల్వర్ నిశ్శబ్దంగా నిప్పులు కక్కింది వరుసగా నాలుగు గుళ్ళు కనకం గుండెల్లోకి దూరిపొయ్యాయి ఆవిడ వికృతంగా అరవబోయింది అప్పటికే ఆవిడదగ్గరకి చేరుకున్న అతడు ఆమె నోరు నొక్కేసి లోపలికి లాగేసి తలుపు మూసేశాడు తరువాత ఆమెని ఆ రూమ్‌లోని డబుల్‌కాట్ క్రిందకి లాగేశాడు

నిశ్చేష్టురాలిలా చూస్తుండిపోయింది ఆ భయంకర దృశ్యాన్ని కార్తీ!

వాట్ బేబీ? భయపడ్డావా? మరేం ఫరవాలేదు ఆ దుర్మారురాలికి తగిన శిక్ష అది కమాన్ మనకోసం బాస్ ఎదురుచూస్తుంటారు లెట్జ్ గో అంటూ కార్తీ చెయ్యి అందుకున్నాడతను

కార్తీలో చలనంవచ్చింది. ధైర్యం తెచ్చుకుంది

ధైర్యంగా చూసింది అతడివైపు ఒక్క క్షణం అంటూనే ఎయిర్‌బాగ్‌ని హేండ్‌బాగ్‌ని అందుకుని రెడ్ సూట్‌కేస్‌ని తీసుకుని పదండి అంది

గుడ్! అలా వుండాలి భయపడకూడదు నీ ధైర్యం చూస్తుంటే నాకెంతో ముచ్చటేస్తోంది అంటూ బయలుదేరాడతను

చకచక అతన్ని వెంబడిస్తూ బైదిబై మీ పేరు అడగడం మర్చిపొయ్యాను అంది కార్తీ

చండీ చండీరాజ్ అంటూ నవ్వాడతను

అతడి నవ్వు చాలా క్రూరంగా వుంటుందని అర్థమైంది కార్తీకి

ఎక్కడ వుంటారు మీ బాస్? అడిగింది కార్తీ

శ్రీరామ్ నగర్ చెప్పాడతను

హోటల్‌కి 25 గజాల దూరంలో రోడ్డువారగా ఆగివుంది అతడు తెచ్చిన ప్లిమత్‌కారు ఇద్దరూ అతడి కారుదగ్గరకి వచ్చారు అతడు స్టీరింగ్‌ముందు కూర్చున్నాడు అతడి ప్రక్కనే కూర్చుంది కార్తీ అతడు హుషారుగా ఇంజన్ స్టార్ట్‌చెయ్యబొయ్యాడు

హల్లో చండీ ఎవరో పలకరించారతడ్ని

ఉలిక్కిపడి తల తిప్పి చూశాడు చండీరాజ్

## టిట్ ఫర్ టాట్

**(20) రేటింతో తెల్సుకోకుండా యింటర్వ్యూ తీసేసుకోడమేనా? (20)**

మరికొన్ని వాగ్బాణాలు

ఎవమౌంట్ మీ యింటి దగ్గరే —అల్లం శ్రీనివాసరావు (పాలకొల్లు)

అందుకనే చెక్ బుక్ తెచ్చానుసార్! —ఎం శివరామకృష్ణ (అనకాపల్లి)

రేటింతో బోర్డులు తగిలించుకు రావలసింది —బి శ్రీనివాస్ (కొత్తగూడెం)

పని కావాలంటే రేటుకోసం చూడకూడదు మరి! —జి ఎస్ ఎన్ మూర్తి (పెదపాడు)

రేటు చెప్తే రూటు మారేలా వుంది కన్నా! —ఎ సత్యనారాయణ (కొత్తవాడ)

ఎర్రగా పొట్టిగా వున్న వ్యక్తి నవ్వుతూన్నాడు అతడి చేతిలో రివాల్వర్ వుంది అతడ్ని చూడగానే ఛండీరాజ్ మొహం భయంకరంగా మారిపోయింది చటుక్కున జేబులోనుండి రివాల్వర్‌ని తియ్యబోయ్యాడతను

నో యూజ్ ఫ్రెండ్! నీ చాప్టర్ క్లోజ్ అయిపోయింది అంటూండగానే ఆ పొట్టివ్యక్తి చేతిలోని రివాల్వర్ ఛండీరాజ్ కణతకి ఆనడం నిశ్శబ్దంగా పేలిపోవడం అతడి నోట్లోనుండి అరుపు సైతం బయటికి రాకుండా అతడి తల వెనక్కి వాలిపోవడం క్షణాల్లో జరిగిపోయింది

అప్పుడు చూశాడా పొట్టివ్యక్తి కార్తిని

హల్లో బేబీ! అన్నాడతను ఆమెని అప్పుడే గమనించినట్టు!

ఎవరు నువ్వు? అని అయినా నువ్వు ఎవరైతే నా కెందుకులే ఇప్పుడు నువ్వు చూసిన దృశ్యాన్ని చూడనేలేదు! నీ కళ్ళముందు వీడు చావలేదు! వీడ్ని నేను చంపనేలేదు అని అవునా? అని అడిగాడు

ఇంకా షాక్ నుండి కోలుకోని కార్తి అలాగే అతడివైపు చూడసాగింది

కామ్‌గా కారు దిగి ఓ వందగజాల దూరం సూటిగా నువ్వు ముందుకి నడుస్తావు అక్కడ ఓ రెడ్‌కలర్ డాట్సన్ వుంటుంది బుద్ధిగా దాంట్లో ఎక్కేస్తావు దిగమ్మా అన్నాడతను లాలనగా

అప్పటికి కోలుకున్న కార్తి విషయాన్ని పరిస్థితిని అర్థంచేసుకుంది సముద్రపు తుఫానుబారి నుండి బయటపడి భయంకరమైన తిమింగళం నోట్లోకి వెళ్ళబోతోందన్నమాట తను కానీ! ఏమవుతుందో అదవుతుంది అన్న తెగింపు వచ్చింది కార్తిలో ఇక పెదవి విప్పకుండా కార్లో నుండి దిగేసిం దామె

ఆమె వెనకనే వస్తూ హెచ్చరించా డతను నా చేతిలో రివాల్వర్ వుంది అన్న విషయాన్ని మర్చిపోకుండా నడుచుకుంటూ వెళ్ళాలి నువ్వు బీ కేర్ ఫుల్ వెనకనుండి హెచ్చరించాడతను

అతడి కంఠం మృదువుగా వున్నా కర్కశంగా కూడా వుందనిపించింది కార్తికి కార్తి నిశ్శబ్దంగా నడుచుకుంటూవెళ్ళి అతడు చెప్పిన డాట్సన్ కారులో కూర్చుంది ఇంజన్ స్టార్ట్‌చెయ్యబడి రెడీగా వారికోసమే ఎదురుచూస్తున్నట్టున్న ఆ డాట్సన్ కార్తి ఆ వ్యక్తి ఎక్కగానే బయలుదేరింది

కార్తికి అనిపించింది నిజంగా తనేదో విషవలయంలోకే వచ్చిపడిందని అప్పుడే అనిపించిం దామెకి యిక తను దీంట్లోనుండి క్షేమంగా బయటపడగలదా? అని

ఆమెకి అంకుల్ చైతన్య గుర్తువచ్చాడు ఎక్కడున్నాడు అంకుల్? ఇప్పుడు తనకి అంకుల్ కనిపించకూడదూ? దిగులుగా అనుకుంది కార్తి

కానీ కార్తికి తెలీదు చైతన్య తనకోసం మద్రాసు మహానగరాన్ని జల్లెడవేస గాలిస్తున్నాడని

కార్తి ప్రక్కన కూర్చున్న ఎర్రని పొట్టివ్యక్తి తన కోటు జేబులో నుండి డబుల్‌డెక్కర్ బ్రాండ్ చాక్‌లెట్ బార్ తీశాడు తరువాత రేపర్ విప్పి కార్తికి ఓ రెండు చాక్లెట్లు యివ్వబోయాడు

నో థాంక్స్ అంది కార్తి

ఫర్వాలేదు తీసుకో బేబీ! మృదువైన అతడి కంఠంలోని కమాండింగ్‌కి లొంగిపోయింది కార్తి

డ్రైవర్‌కి రెండు చాక్లెట్స్ యిచ్చి తను రెండు తీసుకున్నా డతడు నిశ్శబ్దంగా చాక్లెట్‌ని నోట్లో పెట్టుకుంది కార్తి చాక్లెట్లంటే కార్తికి చాలా యిష్టం అందులో ఈ బ్రాండ్ అంటే మరీను అయిష్టంగా తీస నోట్లో పెట్టుకున్న ఆ చాక్లెట్ రుచికి అలవాటుపడిన జిహ్వ ఎంతో యిష్టంగా చప్పరించసాగింది

ఓరకంట కార్తినే గమనిస్తున్నాడు ఆ పొట్టివ్యక్తి రెండే రెండు నిముషాల్లో కార్తి కనులు వాలిపోసాగాయి అది గమనించి సంతృప్తిగా నవ్వాడతను అప్పుడు అరిచింది కార్తి

మోసం దగా ఈ చాక్లెట్‌లో మత్తుమందు చేర్చబడింది అంటూనే తుపుక్కున ఉమ్మేసిందామె చాక్లెట్‌ని కోపంగా అక్కసుగా పొట్టివ్యక్తివైపు తిరిగి ఏదో అనబోయింది

అనవసరంగా ఎగ్జయిట్ అవ్వకు బేబీ! నిశ్చింతగా నిద్రపో! ఇప్పుడు నీ కొంపేం మునిగిపోవటంలేదు అంటూనే నవ్వేడా పొట్టివ్యక్తి

కసుగా తిట్టబోయింది కార్తి అతన్ని అప్పటికే కార్తి అవయవాలు ఆమె స్వాధీనం తప్పాయి ఆమె నోరు పెగల్లేదు మత్తుకి లోబడిపోయిన ఆమె శరీరం ప్రక్కకి వొరిగి అతడి ఒళ్ళో వాలిపోయింది

గులాబీరేకుల మెత్తదనంతో వున్న కార్తి బుగ్గలు నిమురుతూ ఇది ఎల్ల కాదు మినీ బాంబు! మన బాస్ గారికి ఈ మినీ బాంబుని అప్పగించే వరకూ యిలా స్పృహలేకుండా పడివుండడం ఎంతైనా మంచిది మనకే అన్నా డా పొట్టివ్యక్తి డ్రైవర్‌తో

డ్రైవర్ కార్తి వైపు కుతూహలంగా చూసాడు

ఆ వ్యక్తి మళ్ళీ అన్నాడు హైదరాబాద్‌లో సూట్‌కేస్‌ని చేజిక్కించుకున్న క్షణం నుంచి ఈ ఎల్ల సోఎయా గాంగ్‌ని పాండే గాంగ్‌ని పెట్టిన తిప్పలు ఎన్నో ఇవన్నీ తెలిసి మనం జాగ్రత్తపడకపోతే మూర్ఖులమే అవుతాం ఆ తరువాత ఈపిల్ల దయ్యం మన కళ్ళల్లో కారంగొట్టి మన కాళ్ళూ కీళ్ళూ విరిచేసి ఎస్కేప్ అవగలదు

అంటున్న అతడివైపు కార్తివైపు మార్చి మార్చి చూస్తూ అనుకున్నాడు డ్రైవర్ తనలో తనే రాక్షసుడి లాంటి చండీరాజ్‌కి సైతం బయపడని యితను పట్టుమని నిండా పదిహేడేళ్ళు లేని ఈ అమ్మాయికి బయపడుతున్నాడంటే ఈ అమ్మాయి చాలా టక్కరిపిల్లలాగుంది అని

(ఇంకావుంది)

## బాల సాహసం

12 5 89 సంచికలో మా అమ్మ చేసిన సాహసం వేశారు ఈ సారి నేను మా స్కూలు దగ్గర చేసిన సాహసం మా బాబాయిగారిచేత రాయిస్తున్నాను

నేను నాల్గవ తరగతి చదువుచున్నాను మా యింటి దగర నుంచి కాన్వెంటు దగ్గర కావటంతో రోజూ నడచి వెళ్లి నడచివస్తుంటాను



ఒక రోజు స్కూలు నుంచి వస్తుంటే రోడ్డు ప్రక్కగా వీధి కుళాయి దగ్గర ఒక చిన్న అమ్మాయి కూచొని ఏడుస్తోంది నేను ఆగాను ఎందుకు పాపా ఏడుస్తున్నావ్? అని అడిగాను ఊ ఊ అంటోందే తప్ప ఏం చెప్పటం లేదు 'రా నాతోటి' అని ఆ పాపను తీసుకొని బయలుదేరాను మా ఇంటికి ఇవతలే పోలీస్ స్టేషన్ ఉంది పోలీస్ స్టేషన్ దగ్గర ఆగి 'అంకుల్ ఈ అమ్మాయి అక్కడ కూచొని ఏడుస్తోంది' అని అంటున్నంతలో 'పాపా' అంటూ స్టేషన్ లోపలినుండి ఒక వ్యక్తి పరుగెట్టుకుంటూ వచ్చాడు ఈ పాప ఏడుపు ఆపి 'డాడీ!' అంటూ ఆయన్ను అల్లుకుపోయింది "ఈ పాప ఎక్కడుందమ్మా" అని అడిగి అంతా తెలుసుకొని మా ఇంటికి వచ్చి మానాన్నగారితో మాట్లాడారు

తనది బాలాజీనగర్ అట ఈ మధ్య మావూర్లో ఒకతను ఒంటెను త్రిప్పుతూ డబ్బులు తీసుకుంటూ బ్రతుకుతున్నాడు అలా అలా ఆ ఒంటెను చూస్తూ తప్పిపోయి, దిక్కుతోచక అక్కడ కూచుందట వాళ్ల నాన్నగారు బుజ్జగించేసరికి ఆ పాప చెప్పింది ఆయన పోలీస్ రిపోర్టు ఇవ్వటానికి వచ్చారట నాకు థాంక్స్ చెప్పి ఎత్తుకుని ముద్దాడి, తన జేబులో నుండి వంద రూపాయలు తీసి ఇచ్చారు నేను బిత్తరపోయాను

మా నాన్నగారు వద్దని వారిస్తున్నా వినకుండా మరోసారి కృతజ్ఞతలు తెలిపి విజిటింగ్ కార్డ్ ఇచ్చి, వాళ్ల యింటికి రమ్మని ఆహ్వానించి వెళ్లిపోయారు

— కోలపల్లి సుప్రజ




## జూలై నుంచి యువచిత్ర ఆర్ట్స్

''బాలకృష్ణ సరసన రాధిక చెల్లెలు నిరోషా ఒక నాయిక. సీత మరో నాయిక,'' అన్నారు గతంలో పలు విజయవంతమైన చిత్రాలు నిర్మించిన కె. మురారి. యువచిత్ర ఆర్ట్స్ వారి ఈ తాజా చిత్రంలో 'ఊర్వశి' శారద, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, నారాయణరావు, అల్లు రామలింగయ్య, సుధాకర్, వేలు, బ్రహ్మానందం, అంజలీదేవి, రమాప్రభ, వై. విజయ ఇతర పాత్రధారులు. సత్యమూర్తి రచన, కె. వి. మహాదేవన్ సంగీతం, రాజు శిల్పం, జార్జి ప్రసాద్-యోగానంద్ ప్రొడక్షన్‌తో కె. నరసింహం నాయుడు సమర్పించే ఈ ప్రతిష్ఠాత్మక చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి.

“తాతయ్యా పెళ్లి-మనవడి శోభనం”లో

## బాలకృష్ణ ''అశోకచక్రవర్తి'' జూన్‌లో

బాలకృష్ణ, భానుప్రియ, సుపర్ణ (వైశాలి ఖ్యాతి), సత్యనారాయణ, పి. ఎల్. నారాయణ, రంగనాథ్, జె. వి. సోమయాజులు, గొల్లపూడి మారుతీరావు, ప్రదీప్‌శక్తి, వేలు, నర్రా, ఈశ్వరరావు, వంకాయల, అంజలీదేవి, శరత్ సక్సేనా, మోనీషా, జ్యోతి, శైలజ నటించిన వెంకటేశ్వర ఆర్ట్ ప్రొడక్షన్స్ ''అశోక చక్రవర్తి'' చిత్రం జూన్ 16న విడుదలవుతుందని నిర్మాణ సారథి కోగంటి హరికృష్ణ తెలిపారు. పరుచూరి సోదరుల రచన, ఇళయరాజా సంగీతం, నందమూరి మోహనకృష్ణ ఛాయ, శివసుబ్రహ్మణ్యం· శివశంకర్ నృత్యాలు, శ్రీనివాసరాజు శిల్పం, కె. ధర్మరాజు, శివప్రసాద్. సంయుక్త దర్శకత్వం, సాయిరత్న మనోహర్ ప్రొడక్షన్, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో కాజా వెంకటరావమ్మ నిర్మించిన ఈ చిత్రానికి ఎస్. ఎస్. రవిచంద్ర దర్శకుడు.

### ''ఆఖరిఘట్టం'' జూన్‌లో

“అధికార దాహంతో స్వార్థపూరితంగా ప్రవర్తించే దుష్టశక్తులకు- మానవత్వం, దేశ సౌభాగ్యం కాంక్షించే వర్గానికి మధ్య జరిగే సంఘర్షణ ప్రధాన ఇతివృత్తం'', అన్నారు జి. శేఖరన్. ఈయన కథ, దర్శకత్వంలో సినిమాస్కోప్- స్టీరియోఫోనిక్ సౌండ్ సిస్టమ్‌లో జి. చాముండేశ్వరి నిర్మించిన రేణుకా ఫిలిమ్ డిస్ట్రిబ్యూటర్స్ వారి ''ఆఖరి ఘట్టం'' చిత్రంలో భానుచందర్, రాధిక, మంజుల, జె. వి. సోమయాజులు, జె. వి. రమణమూర్తి, వేలు, రవిబాబు, బాలంకినాయర్, సాగరిక, పండరీబాయి, జనార్ధన్, బేబీ సుజిత, ప్రతాప్‌చంద్రన్ పాత్రధారులు. సంగీతరాజా, రవి, విజయన్, బాలు, రాజేంద్ర, ప్రకాష్, శరవణన్ తెర వెనుక కృషి చేసిన ఈ చిత్రం తమిళ, మలయాళ భాషల్లో కూడా తయారైంది.

## శ్రీ రాఘవేంద్ర ఆర్ట్స్ చిత్రం

"బంధం కంటే నీతి గొప్పది. అనే ప్రాతిపదికపైన రసవత్తరంగా అల్లబడిన కథ. మే 21 నుంచి సెప్టెంబర్ నెలాఖరు వరకు నాలుగు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది." అన్నారు ఎస్. ఎస్. రవిచంద్ర. ఈయన దర్శకత్వంలో ఎం. కృష్ణ, శేఖర్ నిర్మిస్తున్న శ్రీ రాఘవేంద్ర ఆర్ట్స్ చిత్రంలో వెంకటేశ్, గౌతమి, అమల, సత్యనారాయణ, శరత్‌బాబు, ప్రసాద్‌బాబు, ఊర్వశి శారద వగైరా తారాగణం. పరుచూరి సోదరుల మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం, పి. ఎస్. ప్రకాష్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, శ్రీను నృత్యాలు, విజయన్ సాహసాలు, రంగారావు సంయుక్త దర్శకత్వం, ప్రసాద్ ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు.

## పెళ్ళయినవారికే

చంద్రమోహన్, మాధురి, చక్రవర్తి, సారథి, రావికొండలరావు, రమణమూర్తి, పల్నాటిపులి, శ్యాంబాబు, గోవిందరావు, కృష్ణవేణి, చందన, చంద్రిక, వరలక్ష్మి, సుగుణ నటించే విజయభవానీ ఫిలిమ్స్ "పెళ్ళయినవారికే" చిత్రానికి ఆర్. విజయలక్ష్మి కథ, కాశీ విశ్వనాథ్ సంభాషణలు, ఆర్. వి. రావు స్క్రీన్‌ప్లే, డాక్టర్ అలుకా జైహింద్‌రెడ్డి, పాటలు, కీ. శే. సత్యం సంగీతం, రఘునాథరెడ్డి ఛాయ, రమణబాబు నృత్యాలు, కొండవీటి సత్యం సంయుక్త దర్శకత్వం, ఎం. ఎస్. ఎన్. రాజు- శ్రీధర్ ప్రొడక్షన్, అనిల్ మల్నాడ్ కూర్పు, జె. సురేష్ నిర్వహణతో రాజాని వెంకటేశ్వరరావు నిర్మాత, ఉదయకుమార్ దర్శకుడు.

## "కొత్త పెళ్ళికూతురా-రా"లో రాజేంద్రప్రసాద్, రాధిక

"తొలి షెడ్యూల్ మే 15 నుంచి జూన్ 6 వరకు జరిగింది. మలిషెడ్యూల్ జులై 8 నుండి 16 వరకు" అన్నారు రవితేజ. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పంజా అరుణాచలం కథ-సమకూర్చి నిర్మించే "కొత్త పెళ్లి కూతురా-రా" చిత్రంలో రాజేంద్రప్రసాద్, రాధిక, అరుణ, గొల్లపూడి మారుతీరావు, రాళ్ళపల్లి, కోట శ్రీనివాసరావు, మల్లిఖార్జునరావు, సాక్షి రంగారావు, డాక్టర్ శివప్రసాద్, కె. కె. శర్మ, బడి తాతాజీ, బ్రహ్మానందం, తిరుపతినాయుడు, చిట్టిబాబు, సూర్యకాంతం, మనోరమ, పి. ఆర్. వరలక్ష్మి, డిస్కో శాంతి, భాగ్యలక్ష్మి, పాల్గొంటున్నారు. కాశీ విశ్వనాథ్, ఆత్రేయ, భువనచంద్ర, ఇళయరాజా, గోపిచంద్రన్, బాబు, సతీం, శివ సత్యనారాయణ సాలా సూర్యారావు, హేమరాజు ప్రభృత సాంకేతిక వర్గంతో ఆర్. విజయకుమార్, ఎ. ఆర్. సుబ్రహ్మణ్యాన్ సహ నిర్మాతలు. ఈ చిత్రానికి మాతృక తమిళంలో విజయవంతమైన "మన్‌మగళే వా" అనే చిత్రం.


"గురుశిష్యులు"లో ఖుష్బూ

## వీరబ్రహ్మేంద్ర కంబైన్స్ చిత్రంలో తాతినేని ప్రసాద్, సుమన్

"జూన్ నుంచి సెప్టెంబర్ వరకు షెడ్యూల్స్" అన్నారు తాతినేని ప్రసాద్. ఈయన దర్శకత్వంలో బి. ఎ. శేఖరరెడ్డి, బి. స్వరూప నిర్మించే వీర బ్రహ్మేంద్ర కంబైన్స్ చిత్రంలో సుమన్, రాధ, వాణిశ్రీ, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, బ్రహ్మానందం ప్రభృత నటవర్గం.రాజాఇలంగో కథ, సాయినాథ్-మధు మాటలు, వేటూరి పాటలు, రాజ్-కోటి సంగీతం, కబీర్‌లాల్ ఛాయ, కె. రామలింగేశ్వరరావు శిల్పం, రాజు సాహసాలు, గంగాధర్ సంయుక్త దర్శకత్వం, కె. మల్లిఖార్జునరావు ప్రొడక్షన్, అట్లూరి నాగేశ్వరరావు సహకార దర్శకత్వం, ఎన్. వి. ఆర్. సత్యనారాయణ నిర్వహణ తెర వెనుక హంగులు. ఈ కథలో ఫామిలీ సెంటిమెంట్ మెలోడ్రామా అన్నీ సమపాళ్ళల్లో ఉన్నాయి అన్నారు తాతినేని ప్రసాద్.




(గత సంచిక తరువాయి)

ధృష్టద్యుమ్నుడు గుడిసె వారగా వచ్చి నిలబడ్డాడు

చీకటిలో వున్నప్పుడు వెలుగును గురించి భావించి దానిని దర్శించగల వారే ధీరులు దిగులు పడకండి మనకూ మంచి రోజులు వస్తాయి లక్ష్మి అంశ మన ఇంట అడుగు పెట్టింది ఇక మీకు అన్నీ విజయాలే అంది తల్లి

ఔను మా బంగారు తల్లి నిజంగా లక్ష్మియే అనుకున్నాడు మనసులో ధృష్టద్యుమ్నుడు

ఇంకా కొంచెం చెవి వొగ్గి విన్నాడు

అన్నదమ్ము లందరూ రకరకాల ఆయుధాలు గురించి రథాలు గురించి దివ్యాస్త్రాల ప్రయోగం గురించి ముచ్చట్లాడుకుంటున్నారు

అడిగాడు ద్రుపదుడు కన్నీళ్ళతో మహారాజు చూపు మందగించింది

రేగిన జుట్టుతో కన్నీళ్ళు దారలు కట్టడం వల్ల గుంటలు పడిన కళ్ళతో దీనంగా వున్నాడు ద్రుపదుడు

ధృష్టద్యుమ్నా! నా కన్న తల్లికేం ఫరవాలేదు కదా! నా చిట్టి తల్లిని ఆ విప్ర కుమారుడు గెలుచుకున్నప్పుడే నేను సగం చచ్చిపోయాను స్వయంవరం ప్రకటించి నా కూతురికి నేనే అన్యాయం చేశాను నా తల్లి వెళ్ళినప్పటి నుంచీ నువ్వేం వార్త తెస్తావోనని నీకోసం ఎదురు చూస్తున్నాను నిజం చెప్పు! ద్రౌపదిని గెలుచుకున్న ఆ విప్రుడెవడు

**జరిగిన కథ –5: పాంచాల రాజపుత్రిక కృష్ణ స్వయంవరం అనంతరం ద్రుపదునికి తాను ద్రోణుడితో కలిసి చేసిన సాహచర్యం జ్ఞప్తికి వస్తుంది. పాంచాల దేశాధీశుడైన ద్రుపదుడి వల్ల అవమానం పొందిన ద్రోణుడు అర్జునుడి ద్వారా తన ప్రతీకారం తీర్చుకుంటాడు. యజ్ఞ యాగాల ద్వారా మహిమాన్వితుడైన కుమారుడిని సంపాదించి ద్రోణుడిపై పగ సాధించాలనుకుంటాడు ద్రుపదుడు యజ్ఞ గుండం నుంచి ధృష్టద్యుమ్నుడు సౌందర్యరాశి కృష్ణ ఉద్భవిస్తారు. అర్జునుడు స్వయంవరంలో సాధించి తెచ్చిన ద్రౌపదిని అన్నదమ్ములు సమంగా పంచుకొమ్మని ఆదేశించి తర్వాత బాధపడుతుంది కుంతీదేవి.**

ఆయుదాల ప్రసక్తి వచ్చినప్పుడు వాళ్ల మాటల్లో వీరావేశం కనిపించింది

ధృష్టద్యుమ్నుడికి వీళ్ళు సామాన్య విప్రకుమారులు కాదని రూఢైంది

అతని మనసు కొంచెం కుదుట పడింది

## ఆ అయిదుగురూ పాండవులే!

అంతఃపురంలో పాంచాల రాజు అన్యమనస్కంగా తిరుగుతున్నాడు

ధృష్టద్యుమ్నుడ్ని చూస్తూనే గబ గబ దగ్గరకు వచ్చి నాయనా! నా బంగారు తల్లి ఎలా వుంది? ఇంతకీ ఆ మత్స్య యంత్రాన్ని కొట్టిన వాడు విప్రకుమారుడేనా? వాళ్ళ వూరేమిటి? వాళ్ళ వివరాలేమిటి? అని గుక్క తిప్పుకోకుండా

ఇంక మాట్లాడ లేక పోయాడు

దుఃఖం పొంగుకొచ్చి గొంతు పూడుకుపోయింది

ధృష్టద్యుమ్నుడు తండ్రికి ఉపచారాలు చేసి అనునయ వాక్యాలు చెప్పి ఆసనం మీద కూర్చోబెట్టి

తండ్రీ! నా చెల్లెల్ని చేపట్టినవాడు సామాన్యుడు కాదనే నా నిశ్చితాభిప్రాయం అతనూ అతని అన్నదమ్ములూ తల్లీ ద్రౌపదిని దయతో చూస్తున్నారు ద్రౌపది కూడా సంతోషంగా వుంది మన నగరంలోనే ఊరి చివర ఒక కుమ్మరి గుడిసెలో వారు కాపురముంటున్నారు

ఆ ఇంట్లో అగ్ని తేజస్సుతో వున్న ఒక ముసలామెను చూసాను నేను

ఆమె కుంతీదేవిలా వుంది

విప్రకుమారులు అయిదుగురూ పాండు పుత్రులని నా అనుమానం

లక్క ఇంటి నుంచి తప్పించుకున్నాక దుర్యోధనాదులకు తెలియకుండా వుండేందుకు ఇలా మారు వేషాల్లో సంచరిస్తున్నారనుకుంటాను అన్నాడు

ఆ మాటలు వినగానే ద్రుపదుడి సంతోషానికి అవధులు లేకుండా పోయాయి

తను వింటున్నది నిజమేనా అనిపించింది కొడుకును గట్టిగా కౌగలించుకున్నాడు

వెంటనే రాజ పురోహితుల్ని పిలిపించి కుంతీదేవినీ పాండవుల్నీ సకల మర్యాదలతో రాజ భవనానికి తీసుకు రండని ఆజ్ఞాపించాడు పాండు కుమారులకు విలువైన ఆభరణాలూ పట్టు వస్త్రాలూ కానుకలుగా పంపాడు

రాచనగరు నడిబొడ్డున ద్రౌపదీ వివాహానికి ఏర్పాట్లు చేయవల్సిందిగా అప్పుడే మంత్రులకు ఉత్తర్వులు జారీ చేశాడు

ఇంతకీ వాళ్ళు పాండవులు కాకపోతే

ఎందుకు కారు! స్వయం వరం రోజున ఆ అయిదుగురు అన్నదమ్ములూ చూపిన శౌర్య సాహసాలను బట్టే వాడు వీర వంశంలో జన్మించిన పాండు రాజ తనయులని తను గ్రహించి వుండాల్సింది!

ద్రుపదుడిలో ఆశ చిగురించింది ఋషి వాక్కు వృధాకాదు – ద్రౌపదిని చేబట్టినవాడు ముమ్మాటికీ అర్జునుడే అయి వుంటాడనుకున్నాడు

## ద్రుపదుడి ధర్మసంకటం

ద్రుపదరాజు ఆహ్వానం అందుకుని కుంతీదేవి పాండవులు– ద్రౌపదిని వెంట బెట్టుకుని రాజ భవనానికి వచ్చారు ద్రుపదుడే స్వయంగా వాళ్ళకి స్వాగతం చెప్పాడు కుంతి ద్రౌపదిని తీసుకుని లోపలికి వెళ్ళింది అన్నదమ్ములు అయిదుగురూ ఎత్తయిన ఆసనాల మీద కూర్చున్నారు

సుఖాలలో పొంగకుండా కష్టాలలో కుంగకుండా ఎప్పుడూ ఒకే రకంగా వుండగల స్థిత ప్రజ్ఞులు వాళ్ళు

రాచ మర్యాదలూ రాజాసనాలూ రాజ ప్రాసాదాలూ వాళ్ళకేం కొత్త కాదు

చిరునవ్వులు చిందిస్తూ అన్నీ చూస్తూ కూర్చున్నారు

ద్రుపదుడు కావాలనే వాళ్ళకి రాజ సౌధాలన్నీ చూపి వర్ణిస్తూ ఆయుధాగారం లోపలికి తీసుకు వెళ్ళాడు అక్కడ రకరకాల ఆయుదాలు వున్నాయి వాటిని చూడగానే వాళ్ళ కళ్ళు మెరిశాయి ద్రుపదుడు అది పసిగట్టాడు అతిథి మర్యాద లయ్యాక ద్రుపదుడు వాళ్ళ దగ్గరకు వచ్చి నాయనలారా! మీరెవరో మాకు తెలీదు అయితే అసమాన ప్రతిభా వంతుల్లా కనిపిస్తున్నారు మీరు విప్ర కుమారులు కాదని మాత్రం మాకు తోస్తోంది మీ

రెవరో నిజం చెప్పండి అన్నాడు

మారు వేషాలు ఇంక పొసగవనిపించింది యుధిష్ఠిరుడికి నిజం చెప్పక తప్పదనిపించింది

మహారాజా! మీరు ఊహించినట్టే మేము విప్రకుమారులం కాము మేము క్షత్రియులం కురు వంశానికి చెందిన పాండు రాజు తనయులం పాండవులు అయిదుగురిలోకి పెద్దవాణ్ణి నేను నన్ను యుధిష్ఠిరుడంటారు నా తరువాతి వాడు భీముడు స్వయంవరంలో నెగ్గినవాడు అర్జునుడు ఆ తరువాతి వారిద్దరూ నకుల సహదేవులు మా పిన తల్లి మాద్రి కుమారులు ద్రౌపదిని గురించి మీరేం విచారించకండి మెట్టి నిల్లు కూడా వీరుల వంశానికి చెందిందే అన్నాడు

ద్రుపదుడుకి సంతోషంతో కాసేపు నోట మాటరాలేదు ఆ ఆనందంతో పరవశించి పోయాడు ధృష్టద్యుమ్నుడు వెళ్ళి భీముణ్ణి ప్రేమగా కౌగలించుకున్నాడు

ఆ తరువాత తాము లక్కయింటి ప్రమాదం నుంచి ఎలా తప్పించుకున్నదీ వివరంగా చెప్పారు పాండవులు

మీరేం విచారించకండి కౌరవులను చూచి భయపడాల్సిన దుర తేం మీకులేదు

నా రాజ్యం నాసైన్యం నా చతురంగబలాల్లు అన్నీ మీకు అండగా వుంటాయి మీకు రక్షగా పెద్దగా నేనుంటాను అన్నాడు ద్రుపదుడు

ఆ చల్లని మాటలతో పాండవులకు ఆనంద మయింది

అర్జునుడికీ ద్రౌపదికీ ఘనంగా పెండ్లి జరి పద్దాం మీకు కావల్సిన ఏర్పాట్లేమిటో చెప్పండి అన్నాడు ద్రుపదుడు

యుధిష్ఠిరుడు కాసేపు మౌనం వహించి ఆ తరువాత మహారాజా! క్షమించాలి దొరికింది ఏదైనా అయిదుగురం సమంగా పంచుకుందామని ఒక పెద్ద ఆపద సమయంలో మేం ప్రతిజ్ఞ చేసుకున్నాం ఆ ప్రతిజ్ఞను మేం ఉల్లంఘించలేం మా తల్లిగారు కూడా అలాగే ఆదేశించారు అన్నాడు

ఆ మాటలకు ద్రుపదుడు విస్తుపోయాడు ఇదే ప్రతిపాదన పాండవులు కాక మరెవరైనా చేసవుంటే వాళ్ళకు భూమి మీద నూకలు చెల్లివుండేవి

కోపాన్ని నిగ్రహించుకుని యుక్తా యుక్త జ్ఞానం కలవారు మీరు పైగా అందరూ నిన్ను దర్మరాజు అంటారు ఒక పురుషునికి చాలామంది స్త్రీలు భార్యలుగా వుండటం చెప్పబడిందేగాని ఒక స్త్రీకి అనేకమంది పురుషులు భర్తలుగా వున్నట్టు నేనెక్కడా వినలేదు ఎవరూ చెప్పలేదు లోకానికీ వేదానికీ కూడా విరుద్ధంగా నీవంటి ధార్మికుడు ఈ విధమైన అధర్మాన్ని నిర్ణయించకూడదు ఇది ఉచితంకాదు అయినా ఈ బుద్ధి మీదికాదని పిస్తోంది అన్నాడు ద్రుపధుడు

యుధిష్ఠిరుడు లేచి మహారాజా! మీ ఆవేదనను నేను అర్థం చేసుకోగలను ఇది చాలా అరుదైన విషయమే కాని ధర్మవిరుద్ధమైన పనేదీ మేము



చెయి ఒం లేదని నాకు అనిపిస్తోంది మా తల్లి మాకు చిన్నతనం నుంచి న్యాయాన్ని దర్మాన్ని బోధించింది అప్పనంగా వచ్చింది ఏదైనా అనుభవించమని మా తల్లి మాకు చెప్పలేదు మేము దర్మ దూరులమై చరిస్తే ఆవిడ సహించదు అయినా జటిల మహర్షి కుమార్తెకు ఏడుగురు భర్తలున్న సంగతి మీరు వినలేదా అన్నాడు యుధిష్ఠిరుడి వాదన ద్రుపదుడికి సంతృప్తి కలిగించలేదు

ఏం చెయ్యాలో పాలు పోలేదు

ఇంతలో వ్యాస మహర్షి వచ్చాడు అక్కడికి కృష్ణ ద్వైపాయనుణ్ని చూస్తూనే ద్రుపదుడు మహాదానందంతో ముందుకు వెళ్ళి ఆయనకు స్వాగతం చెప్పాడు పాండు పుత్రులు తాతగారికి పాదాభివందనం చేశారు ఆయన మనుమల్ని లేవనెత్తి ఆశీర్వదించాడు

మహర్షి సుఖాసీనుడయ్యాక మునీంద్రా మీ రాకతో మేము ధన్యుల మయ్యాం మీ బోధలవల్ల మా సంశయ లన్నీ నివృత్తి అయి నాకు శాంతి లభించగలదని ఆశతో వున్నాను దర్మ విరుద్ధమూ సంప్రదాయ వ్యతిరేకమూ కాని మార్గాన్ని మాకు సూచించండి అని వినయంగా అడిగాడు ద్రుపదుడు

వ్యాసమహర్షి ద్రుపదుణ్ని దీవించి నీ సందేహమేమిటో చెప్పు అన్నాడు

ద్రౌపదికి పాండవులు అయిదుగురూ భర్తలు కావటం దర్మ సమ్మతమేనా అని అడిగాడు ద్రుపదుడు

వ్యాసమహర్షి చిరునవ్వు నవ్వి నాయనా! నీకీ సందేహం కలగటం సహజమే ఒక స్త్రీకి అనేకమంది భర్తలుండటం ఇప్పటి ఆచారంకాదు అయితే గతంలో ఇటువంటి సందర్భాలు లేకపోలేదు ద్రౌపది శ్రీ మహాలక్ష్మి అంశతో పుట్టింది పాండవులు దర్మ వాయు ఇంద్ర అశ్వనీ దేవతల అంశలతో జన్మించారు సత్యం శౌచం సామర్థ్యం గురుభక్తి అప్రమత్తత విజ్ఞానం తపం దానం శమదమాలు కలిగి సత్కర్మలు చేసే పురుషులనే లక్ష్మి ఆశ్రయిస్తుంది ఈ జన్మలో పాంచాలికి అయిదుగురు భర్తలుంటారని పరమశివుడు దీవించాడు ఆ దేవరహస్యం నాకు తెలుసు నిస్సందేహంగా నీ కుమార్తెను పాండుపుత్రులకిచ్చి వివాహం చెయ్యి ఇది దర్మ విరుద్ధం కాదు అని పాంచాలి పూర్వజన్మగాధలు వివరించాడాయన

## అయిదుగురు ఎవరు?

మౌదల్యుడనే మహాముని వుండేవాడు కర్మవశాన మౌదల్యుడికి కుష్ఠ వ్యాధి సంక్రమించింది అతని భార్య నాలయాని ఆమెనే ఇంద్రసేన అని కూడా

శరవేగంతో వస్తున్నాడు "సూపర్ హీరో" మన్నెం శారద సీరియల్

ఎసస్తారు ఆమె పరమ పతివ్రత భర్త శరీరమంతా పుళ్ళుపడి దురందం వస్తుండేది అయినా నాలయాని భర్తనెప్పుడూ చీదరించుకోకుండా భక్తి శ్రద్ధలతో సేవలు చేస్తూ వుండేది!

ఒకసారి మౌద్గల్యుడు భోజనం చేస్తూ వుండగా శుష్కించిన అతని చేతి బొటన వ్రేలు వూడి విస్తట్లో తినే పదార్థాలలో పడిపోయింది రోజూ భర్త భోజనానంతరం ఉచ్ఛిష్టాన్ని భుజించే నాలయాని ఏ మాత్రం ఏవగించుకోక ఆ శరీరఖండాన్ని దూరంగా విసిరి తన అన్నం తిన్నది మౌద్గల్యుడు భార్య చేష్టకు చలించి పోయాడు నాలయాని పతిభక్తికి మెచ్చి నీకేం వరం కావాలో కోరుకో ఇస్తానన్నాడు

మహామునీ! పాంచ భౌతిక శరీరంతో మీతో సర్వసౌఖ్యాలూ అనుభవించాలని వుంది నాకు కామభోగేచ్ఛ తీరలేదు నీవు నీ తపశ్శక్తితో ఈ బీభత్సరూపాన్ని విడిచి మనోహరమైన ఆకారాన్ని పొంది నవయువకుడవై నాతో రమించి నా అభీష్టాన్ని నెరవేర్చు మని తన మనసులోని మాట సిగ్గువిడిచి చెప్పింది నాలయాని

మౌద్గల్యుడు చాలా సందిగ్ధంలో పడ్డాడు ఐనాసరే అన్నాడు అడిన్నమాట తప్పని ఆయన మహర్షి గనుక తన తపోబలంతో దేవలోకాలు దర్శించి దేవర్షులు బ్రహ్మర్షుల అనుగ్రహాన్ని పొంది ఆ తరువాత ఆకాశగంగలో మునిగి మన్మధాకారం ధరించాడు మిస మిసలాడే యవ్వనంతో వున్న నాలయానిని ముని అనేక విధాల సంతోషపెడుతూ మేరు పర్వతం మీద కైలాస పర్వతాల మధ్య రేయింబవళ్ళు భార్యతో క్రీడిస్తూ కొన్ని వందల ఏండ్లు సుఖసంసారాన్ని గడిపాడు

మౌద్గల్యుడు పర్వతరూపం ధరిస్తే నాలయాని ఆ వెంటనే నదిగా మారింది మౌద్గల్యుడు ఫలించే చెట్టయితే నాలయాని దానిని అల్లుకునే నాజూకు లతగా మారింది అలా వేన వేల సంవత్సరాలు జతగా అన్ని సుఖాలూ అనుభవించారు

రానురాను మౌద్గల్యుడికి విలాస జీవితం మీద వెగటు కలిగింది నాలయానిని విడిచి మళ్ళీ అరణ్యాలకు పోయి ఘోర తపస్సు చేసి చివరికి బ్రహ్మలోకం చేరుకున్నాడు

నాలయానికి మాత్రం యింకా సంసారసుఖం మీద మమకారం తీరలేదు భోగలాలసత వ్యామోహం తగలేదు కాని అది తీరని కోరికగానే జీర్ణించి కొన్నాళ్ళకి తనువు కాలధర్మంగా చాలించి కాశిరాజు అనే రాజర్షికి కూతురై పుట్టింది పెరిగి పెద్దదై విద్యాబుద్ధులు నేర్చుకుంది యవ్వనంతో పాటు కొత్త అందాలు సంతరించుకుని చక్కని చుక్కలాగ మరుదంతిలాగ తయారైంది

కాని ఎన్నాళ్ళకీ వివాహం కాలేదు ఈ జన్మలోనైనా కోరికలు తీరవా? అనుకుంటూ ఆ విచారంతో ఆమె పశుపతి నుద్దేశించి తీవ్రంగా తపస్సు చేసింది

కొంతకాలం పట్టి మంచినీరు సేవించి మరి కొంత కాలం అదీ లేకుండా కొంత కాలం ఒంటి కాలి మీద నిల్చి మరి కొంతకాలం పంచాగ్నుల మధ్య నిలబడి ఉగ్ర తపస్సు చేసింది

పరమేశ్వరుడు ఆమె తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమైనాడు వచ్చే జన్మలో నువ్వు మహోన్నత వంశంలో జన్మిస్తావు శౌర్య సంపన్నులు సౌశీల్యవంతులు బుద్ధిమంతులైన అయిదుగురు నీకు భర్తలుగా లభిస్తారు నీ తమి తీరుతుంది అని వరమిచ్చాడు

పరమేశా! సతికి ఒక్కరే పతిగ వుండాలికదా అటువంటిది నాకు నీవు వింత వరం యిస్తున్నావు భర్తలు అనేకమంది వుండటం వలన బ్రతుకులో కలతలు రావా? అని వినయంగా అడిగింది ఆ అమ్మాయి

తరుణీ! నువ్వు ఒకరికి భార్యగా వున్నప్పుడు మిగిలిన నలుగురూ నిన్ను పరదార గానే చూస్తారు ఇది నా మాట అంచేత కలతల ప్రసక్తి లేదు దీనికి తిరుగులేదు అన్నాడు పశుపతి సంతోషంతో కాశిరాజ కుమార్తె పార్వతీ వల్లభునికి శిరస్సు వంచి నమస్కరించింది

అదే సమయంలో నైమిశారణ్యంలో దేవతలందరూ పెద్ద యాగం చేస్తున్నారు కాలుడు కూడా అక్కడే వున్నాడు యాగ నిర్వహణలో తలమునకలుగా వుండి కాలుడు తన విధులను పూర్తిగ విస్మరించాడు దానితో మరణాల సంఖ్య తగ్గిపోయి భూభారం ఎక్కువైంది ఇంద్రాది దేవతలు కలవరపడి బ్రహ్మ దగ్గరకు వెళ్ళి ప్రభూ! మానవులకు మరణమే లేకపోతే ఇక మన గొప్పేముంది? వారికీ మనకీ తేడా ఏముంది? అని మొరపెట్టుకున్నారు

బ్రహ్మ ఇంద్రాది దేవతలను వెంట బెట్టుకుని కాలుడి దగరకు బయలుదేరాడు త్రోవలో గంగానదీ తీరంలో ఒకో అందమైన అమ్మాయి కనిపించింది ఆ అమ్మాయి పెదగా ఏడుస్తోంది ఆ ఎల్ల కన్నీళ్ళు బంగారు పుష్పాలై గంగానదిలో కొట్టుకు పోతున్నాయి! అది చూసి వేల్పులందరూ విస్తుపోయారు

ఇంద్రుడు ఆ అమ్మాయి దగరకు వెళ్ళి సుందరాంగీ! నువ్వెవరు? నీకొచ్చిన కష్టమేమిటి? ఎందుకు యిలా బంగారు పూలు రాలగా ఏడుస్తున్నావు అని అడిగాడు

ఆ అమ్మాయి మాట్లాడకుండా అక్కడ నుంచి బిరబిర వెళ్ళిపోయింది

ఆవిడ వెనకే ఇంద్రుడూ వెళ్ళాడు

ఆ అమ్మాయి వెళ్ళి వెళ్ళి ఒక చోట ఆగింది

అక్కడ మణిమయ రత్న వేదిక మీద పార్వతీ పరమేశ్వరులుమాయా రూపాల్లో సింహాసనాసనులై విలాసంగా జూద మాడుతున్నారు ఇద్దరూ సరస సల్లాపాలలో వున్నారు

ఇంద్రుడు శివ పార్వతులను గుర్తించలేదు

ఎవరు మీరు సమస పృధివీ నాకు చెందుతుంది త్రిలోకాలకూ నేనే పెద్దను నా చేతి వజ్రాయుధంతో ఈ ముల్లోకాలూ రక్షింపబడుతున్నాయి నేను సురపతిని దేవేంద్రుణ్ని

నా ఎదుటే మీరు సింహాసన మెక్కి జూద మాడుతూ కామభోగులై కన్నూ మిన్నూ గానకుండా ప్రవర్తిస్తున్నారు అంటూ ఇంద్రుడు వాళ్ళను తూలనాడాడు

ఆ మాటలకు రుద్రుడు మండిపడ్డాడు

మా ఆట పాటలకు అవరోధం కలిగించి మాకు ఏకాంత భంగం చేసిన ఆ దుర్మార్గుణ్ని పట్టి తీసుకురా అని పరమేశ్వరుడు కాశిరాజు కూతుర్ని ఆదేశించాడు

ఆ అమ్మాయి వెళ్ళి గట్టిగా పట్టుకోగానే ఇంద్రుడు ఆ స్పర్శకే నేలకూలాడు

## మేనక : ఒక రహస్యం!



వచ్చే ఎన్నికల్లో మీరు ఏ నియోజకవరం నుంచి పోటీ చేస్తున్నారంటే ఫలానా నియోజకవరం అని ఎవరైనా ధీమాగా చెప్తారేమో! కాని మాజీ ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ చిన్నకోడలు శ్రీమతి మేనకాగాంధీ మాత్రం అది సీక్రెట్! ఆ విషయం అడక్కండి అంటోంది కారణం ఏమిటా అని ఆరా తీస్తే ఆ నియోజకవరంలోని ఆఫీసర్లు బదిలీ అయిపోయి రాజీవ్ గాంధీకి అనుకూలురైన ఆఫీసర్లు పదవీ బాధ్యతలు స్వీకరించి తనను దెబ్బ తీస్తారని భయమట అందుకని ఆ విషయం రహస్యంగా వుంచిందట ప్రతిపక్షాలతో విసిగి వేసారి పోయి ఒకనాడు కాంగ్రెస్‌లో చేరిపోతానన్న ఈ మేనకా యిలా మాట్లాడుతోంది అంటున్నారు పెద్దలు

శివుడు నీకు నీవే అధికుడననీ బ్రహ్మాండ మంతా నీ సొత్తనీ ప్రకటించుకున్నావు నీ శక్తేమిటో తెలుసుకుందామని వుంది నీ భుజ పరాక్రమాన్ని కన్నులారా చూడాలని వుంది అదిగో చూడు ఆ కనబడే పర్వత గుహను తెరిచి దాన్ని రెండుగా బ్రద్దలు చెయ్యి అన్నాడు

ఇంద్రుడు పౌరుషంతో పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ ముందుకు వెళ్ళి పర్వత గుహలోకి ప్రవేశించాడు

ఆశ్చర్యం!

అచ్చంగా తన లాంటి వాళ్ళే మరో నలుగురు వున్నారక్కడ అందర్నీ మార్చి మార్చి చూశాడు అందరూ తనలా మన శరీరులే

తనతో పాటు మొత్తం అయిదుగురు ఇంద్రులయ్యారన్నమాట

పంచేంద్రుల్ని చూసి శివుడు బిగ్గరగా నవ్వాడు

శివుణ్ణి అనుసరించి వెళ్ళిన కాశీరాజ తనయకు ఇదంతా పరమేశ్వరుడి లీల అని అర్థమైంది

పంచేంద్రులారా! మహీతలంపై మీరు అయిదుగురూ మనుష్య రూపంలో జన్మించండి మద మాత్సర్యాలు ఈర్ష్య అతిశయం గర్వం విడిచిపెట్టి సుక్షత్రియులై దుష్ట శిక్షణ శిష్ట రక్షణకు ఉద్యమించండి దర్మం తప్పక ప్రవర్తించండి అని శివుడు నిజరూపంలో వారికి దర్శన మిచ్చాడు

ఆ తరువాత కాశిరాజు కుమార్తె వైపు తిరిగి సుందరాంగీ! విచారించకు ఈ అయిదుగురూ నీకు బర్తలవుతారు నీ మరుసటి జన్మలో నువ్వు పాంచాల రాజుకు పుత్రికగా జన్మిస్తావు అప్పుడు ఈ పంచేంద్రులు సూర్య వంశోద్భవులై నిన్ను చేపడతారు అని అభయ మిచ్చాడు

ఆమె సంతుష్టురాలై పరమశివుడికి పాదాభి వందనం చేసింది

పంచేంద్రులు పరమేశ్వరుడి చుట్టూ ప్రదక్షిణ చేసి ఆయన ఆశీస్సులు పొందారు ఆ తరువాత వారు శ్రీమహావిష్ణువు దగ్గరకు వెళ్ళి దేవకార్యాన్ని నిర్వర్తించేందుకు అవసరమైన శక్తినీ ఆత్మస్థయిర్యాన్నీ తమకు ఇవ్వవల్సిందిగా ప్రార్థించారు

## నాడు–నేడు

బ్రతకలేని బడిపంతుళ్ళు
వీధియరుగులానాడు
బ్రతుకనేర్పిన "అయ్యా"వార్లు
వీధియోసెంటర్లీనాడు!

– కాళిదాసు సుబ్బలక్ష్మి

ఆయన వారికి అబయ మిచ్చి తన తలనుంచి తెలుపు నలుపు వెంట్రుకలను రెండింటిని పెరికి నేల మీదకు విసిరాడు

ఆ కేశద్వయం నుంచి బలదేవుడు వాసుదేవుడు ఉద్భవించారు యమ వాయు ఇంద్ర అశ్వనీ దేవతలు తమకు ఆదార కర్తలుగా పంచేంద్రులు పంచ పాండవులుగా జన్మించారు

కుంతీదేవిని పాండురాజు ప్రేరేపిస్తే యముని ద్వారా దర్మరాజును వాయువు ద్వారా బీముణ్ణి ఇంద్రుని ద్వారా అర్జునుణ్ణి కన్నది తర్వాత మాద్రి అశ్వనీ దేవతల ద్వారా నకుల సహదేవులను పొందింది పాండునందనులకు కార్యసహాయం చేయడం కోసం కృష్ణుడు వాళ్ళ పక్షాన చేరాడు అని చెప్పి కృష్ణ ద్వైపాయనుడు ద్రుపదుడికి దివ్య దృష్టి ప్రసాదించాడు

* * *

ద్రౌపది పూర్వ దేహాన్నీ ఆమె నిశ్చల తపస్సునూ చూసి ద్రుపదుడు విస్మితుడయ్యాడు ఒకే ఇంద్రుడు అయిదు అంశలుగా మారి పుట్టేడు కనుక ద్రౌపది పంచభర్తృక అయినా ఒకే బర్తను పొందినట్టవుతుందని వ్యాసుడు ద్రుపదుడికి ధర్మసూక్ష్మం వివరించాడు ఇది దైవాజ్ఞ కాబట్టి ఇందులో అదర్మమేదీ లేదన్నాడు

(ఇంకా ఉంది)



ఆహార ధాన్యాలలో స్వయం సమృద్ధత
మూడు రెట్లకి పైగా ఉత్పత్తి పెరుగుదల



నాల్గింట మూడు గ్రామాలకు విద్యుత్తు సౌకర్యం కల్పన



సేద్యపు భూమి రెండింతలు




బలహీన వర్గాల ఉద్ధరణకు
ప్రత్యేక కార్యక్రమాలు

# పురోగతి పథంలో ఎన్నో మైలు రాళ్లను దాటాము



గత ఐదు సంవత్సరాలలో
ఎదికోట్ల మందికి పైగా ప్రజలు
దారిద్ర్య రేఖకి పైగా తేబడ్డారు



మశూచి ప్లేగు రోగాలు పూర్తిగా
నిర్మూలింపబడినవి ఆరోగ్య
సదుపాయాలు విస్తారంగా పెరిగాయి



మంచి ఆరోగ్యం-ఎక్కువ జీవిత
కాలం



విద్యా సంస్థలు విద్యార్థుల సంఖ్య
ఆరు రెట్లు పెరిగింది ఎక్కువ మంది
ప్రజలు వ్రాయటం చదవటం
నేర్చుకున్నారు



ఉత్పత్తి సంవత్సరానికి 9 శాతం వరకు పెరగటంతో అగ్ర
పారిశ్రామిక దేశాల కోవలోకి భారత దేశం చేరుకున్నది



సాధించిన పురోగతి మనకు గర్వకారణం

davp 89/61 Tel

## రచయితలకి సూచనలు

ఆంధ్ర సచిత్రవారపత్రికకి పరిశీలనార్థం తమ రచనలని పంపే వారు ఈ కిరది సూచనలని గమనించ కోరుతున్నాము

రచనలు కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి కాగితానికి రెండు వైపులా రాసి ఉన్న రచనలని పరిశీలించటం జరగదు

పరిశీలనకి పంపే రచనలు కథలైతే 10 అరరావు పేజీలకి మించకుండా ఉంటే మంచిది వ్యాసాలు 3 అరరావు పేజీలు మించరాదు వ్యాసాలు పంపేవారు వాటికి సంబంధించిన బొమ్మలు లేదా ఫొటోలు జతపరిచి పంపటం అవసరం

రచనలు స్వంత రచనలై ఉండాలి అనువాదాలు అనుసరణలు కాని రచనలు పంపరాదు ఆ మేరకి రచయిత(త్రి) హామీ పత్రం రాసి సంతకం చేసి రచనతో పాటే పంపాలి

రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే రాసి ఉండాలి వ్రాత ప్రతి మీద రచయిత(త్రి) పూర్తి చిరునామా స్పష్టంగా పిన్‌కోడ్‌తో సహా రాయాలి

కథల పరిశీలనకి 1–2 నెలలు నవలల పరిశీలనకి కనీసం 6 నెలలు పట్టవచ్చును పరిశీలన అయిన తర్వాత ఏ విషయం ఆయా రచయిత(త్రు)లకి తెలియచేయటం జరుగుతుంది ప్రచురణకి స్వీకరించని రచనలని తిప్పి పంపకోరేవారు తమ రచనతో పాటే స్వంత చిరునామా కల తగినన్ని తపాలా బిళ్ళలు అతికించిన కవరు జత పరచి పంపాలి లేకపోతే వాటిని తిప్పి పంపటం సాధ్యం కాదు రచనలు తిప్పి పంపే విషయంలో తగిన జాగ్రత్త తీసుకోటం జరుగుతుంది కానీ పోస్టులో పోయే వాటి విషయంలో మేము బాధ్యతని స్వీకరించలేము వాటిపై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ ఆవకాశం లేదు

రచనలు పంపిన వారు తమ చిరునామా మారిన సందర్భంలో వెంటనే ఆ విషయాన్ని మా కార్యాలయానికి తెలియ చేస్తూ ఒక కార్డు రాయటం అవసరం

ఉత్తరాలు తదితర పాఠకుల శీర్షికలకి రాసే వారు కూడా తమ పేరు పూర్తి చిరునామా ఇవ్వాలి రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే ఉండాలి లేకపోతే వాటిని పరిశీలించటం జరగదు

పరిశీలనకి పంపే రచనలని సంపాదకుడు ఆంధ్ర సచిత్రవారపత్రిక గాంధీనగరం విజయవాడ – 520003 అనే చిరునామాకి పంపాలి కవరు పైభాగంలో శీర్షిక పేరు రాయటం మంచిది

– సంపాదకుడు

# సాహితీ పజిల్

## గళ్ళ నుడి కట్టు –10

### బహుమతులు




వందలాది మంది పాఠకులు అత్యంత ఉత్సాహంతో ఈ పోటీలో పాల్గొన్నారు వారందరికీ మా అభినందనలు! సరియైన సమాధానం 60 మంది పంపించారు లాటరీ తీయగా ఈ క్రింది పదిమంది పేర్లు వచ్చాయి బహుమతి మొత్తం రు 200/–లను ఈ పదిమందికి సమానంగా పంచగా ఒక్కొక్కరికి రు 20/–లు చొప్పున వచ్చాయి త్వరలో ఈ బహుమతులు నగదు రూపంలో వారికి పంపే ఏర్పాట్లు జరుగుతున్నాయి ఒకరు ఎన్ని కూపన్లైనా పంపవచ్చును కాని తెల్లకాగితం మీద వ్రాసిన కూపన్లు చెల్లవు –సం

### బహుమతి పొందినవారు

ఎం శ్రీహర్ష (సిద్దిపేట) జి పద్మజ (మాచర్ల) రావి రమేష్‌బాబు(వట్టి చెరుకూరు) ఎన్ ఎస్ ఆర్ బట్టర్(కారుమూరు) కె శ్రీం వి చంద్రమూర్తి(ఎనుకూరు) ఎం సంజీవిని(తిరుపతి) బి శ్రీనివాస్(తిమ్మ సముద్రం) ఎస్ చంద్రశేఖరశాస్త్రి(నాగాయలంక) ఎ శ్రీదేవి(కడప) ఆర్ లక్ష్మీ నారాయణ(గుంటూరు)

## సరియైన జవాబులు

| నిలువు | | అడ్డం | |
|---|---|---|---|
| 1 | దురము | 1 | దుర్యోధనుడు |
| 2 | ధనదుడు | 4 | మవ్వము |
| 3 | డుఘుమే | 5 | మేనక |
| 4 | మనుచరిత్ర | 7 | పడుట |
| 6 | కన్యాశుల్కము | 9 | చమూపతి |
| 7 | పతిత | 10 | ముకనను |
| 8 | టముకు | 11 | తముకు |
| 12 | ముటరాపో | 13 | త్రచ్చుట |
| 14 | టక్కరి | 15 | బాణము |
| 15 | బాసట | 16 | రిత్తపోవుట |

సాహితీ పజిల్

గెల్చుకొండి రు 200/-

## గళ్ళ నుడి కట్టు – 12

### ఆధారాలు

**నిలువు**

1 కార్తీకమాసంలో దీని క్రింద భోజనం చేస్తారు
2 దుకిరా ఉపవాసం చేస గా ఇదే
3 ద్రోణుని బావమరది
4 పూర్వకాలపు ఆయుధం
ఈతని శరణాగతి గొప్ప రామాయణ ఘట్టం
7 ఇది ఎంత బాగ దున్నితే ఎంత అంత బగా పండుతుంది
9 గంగను భూమికి దించిన మునుడు
12 ాది పొంగితే ప్రమాదం
14 వీరములాంటిదే పర్రాక్రమం
కంచస్వామివ రి ముందున్నది వవాహం
16 నరము కొమ్ము కొయ్యండి దేవతా శునకం
17 గొల్లపడుచు

**అడ్డం**

1 ప్ర లకన్నుల్ని దీంతో పోలుస్తారు
3 మొదటి యుగం
పిరిపి లో పుష్పం
6 ఆనందం కలపాడు కృష్ణుడ్ని పంపాడు
8 అరటి మీకిష్టం లేకపోతే దేవంనం
10 ఆరు కాళ్ళతో పూలపై తిరిగేది
11 వంచేటప్పటి చప్పుడులో ున్న ఘట్టండి పరుస అవుతుంది
13 అటు నుండి పశువులు మేసే పొలం
15 ఇది వావి తప్పితే పశువు
17 దుఃఖము
18 అమాయక రాలే అందంగ పుంటుంది
1 ఆడు మేక

ఆధారాలున్నాయి నుడికట్టు గళ్ళు నింపండి! ఈ కూపన్ కత్తిరించి మీ చిరునామా రాసి పంపండి! ఆల్ కరెక్ట్ సొల్యూషన్ పంపినవారికి రు 200/- లు బహుమతి లభిస్తుంది– ఒకరికన్నా ఎక్కువమంది కరెక్టు ఆన్సర్లు పంపితే వారికి బహుమతి మొత్తం పంచడం జరుగుతుంది తుది నిర్ణయం సంపాదకునిదే! – సం

**గడువు తేది 20-6-'89**




కూర్పు ఎంగలి వి కృష్ణారావు

### ఆంధ్రసచిత్రవారపత్రిక

పంపిన వారిపేరు

పూర్తి చిరునామా

ఎన్‌కోడ్

# వీక్లీ పోస్ట్

## స్పెషాలిటీ

రాధ ముఖచిత్రంతో వెలువడిన 19 5 89 సంచికలో పంజాబ్‌లోని ఆరని చిచ్చుపై సంపాదకీయం చాలా బాగా వ్రాశారు ప్రయాగ రామకృష్ణగారి "ద్రౌపది" సీరియల్ చాలా ఇంట్రస్టింగ్‌గా ఉంది అయితే పదండి లోపలికిలో "ద్రౌపది" సీరియల్ కాలమ్‌లో కాకుండా ఈ వారం ప్రత్యేకం శీర్షికలో వేశారు సీరియల్ నవలల శీర్షికలో వేస్తే బాగుంటుంది కొత్త రచయితల కోసం "వర్క్‌షాప్"ను ప్రారంభించిన ఘనత ఒక్క ఆంధ్రసచిత్రవారపత్రికకే లభించినందుకు చాల గర్వకారణంగా ఉంది దంతాల జాగ్రత్తలు తీసికోవడంలో శ్రీమతి కె శ్యామలగారి ప్రత్యేక వ్యాసం చాల విజ్ఞానదాయకంగా ఉంది క్రికెట్ క్రీడాకారుల జీవిత భాగస్వాములతో కలసి తీయించుకొన్న ఫొటోలు వేసినందుకు చాల థాంక్స్ ఏదిఏమయినా ఆంధ్ర పత్రిక స్పెషాలిటి వేరు అని చెప్పక తప్పడం లేదు

వి రంగస్వామి, గుత్తి

## సంపాదకీయం

మా అభిమాన సచిత్ర వారపత్రిక ప్రతి వారం మమ్మల్ని ఆనంద డోలికల్లో ముంచెత్తుతోంది రాధ ముఖచిత్రంతో వెలువడిన 19 5 89 సంచికలో కథలు, ముఖ్యంగా సెంటర్ స్ప్రెడ్‌లో క్రీడాకారుల జీవిత భాగస్వాముల ఫొటోలను ప్రచురించినందుకు మీకు మా అభినందనలు పంజాబ్ పరిస్థితిపై




(4 వ పేజీ తరువాయి)

ఈ వారం సంపాదకీయం ప్రతి వొక్కరిని ఆలోచింప చేసేదిగా ఉంది నూతన పంథాలో పయనిస్తున్న ఆంధ్రసచిత్రవారపత్రిక ఆంధ్రుల అభిమాన పత్రికగా వర్ధిల్లుతోంది పాఠకుల హృదయాలపై వేసవిలో పన్నీటి జల్లులా, హేమంతంలో 'కొండమల్లి'లా సుగంధ పరిమళాలవంటి శీర్షికలతో పదికాలాలపాటు నిలిచిపోతుంది

కొత్తపల్లి కృష్ణారావు, ఖమ్మం

## టి వి సర్వే

19 5 89 సంచికలో టి వి ల గురించి మన రాష్ట్రంలో సర్వే చేస్తే బాగుంటుందన్నారు అలాంటి మంచి పనులు మనకు గిట్టవు ఆ సర్వేలో టి వి లకి వ్యతిరేకంగా వస్తే టి వి ల వ్యాపారం పడిపోదూ! అంతెందుకు కోట్ల కొలది రూపాయలు పోసి పాఠశాలల్లో టి వి సెట్లు పెట్టారు వాటి ఫలితం ఏమిటో ఇంతవరకు తెలియదు కర్మ చేయటం మనవంతు ఫలితం దేవుడికి వదిలేయాలి అని గీతలో చెప్పలేదూ!

కె రామారావ్ (హైద్రాబాద్)

## నవరసాల విశిష్టత

ప్రత్యేకించి ఏ పత్రికకూ ఏ రచయిత(త్రి)కి అభిమానిని కానటువంటి నేను (సగటు తెలుగు సాహితీ పాఠకుడిగా) –

నేటి పత్రికా ప్రపంచంలో విశిష్టమైన వినూత్నపోకడలతో తనదైన బాణీలతో తెలుగుపాఠకలోకాన్ని మహాద్భుతంగా తనవైపు ఆకర్షింపచేసుకుంటున్న మేటి పత్రిక ఆంధ్రసచిత్ర వారపత్రిక అని చెప్పడం నా కనీస కర్తవ్యంగా భావిస్తున్నాను

కారణం

నవరసాలకూ చక్కని ప్రాధాన్యతనిస్తూ నూతన రచనలకు రచయిత(త్రు)లకు సాహితీవిలువలననుసరించి తగిన ప్రోత్సాహాన్నిస్తూ విమర్శలను ప్రశంసలను ఏక దృష్టితో స్వీకరించి సునిశితంగా పరిశీలించి నిష్పాక్షికరీతిలో యిటు పాఠకులకు అటు రచయిత(త్రు)లకు తగిన న్యాయాన్ని చేకూరుస్తోందని చెప్పడానికి నిదర్శనంగా ప నిర్వహిస్తున్న చిన్న కథలపోటీలు నవ పోటీలు చక్కని వుత్తరాలకు విలువైన ప్రోత లాంటి పోటీలతో బాటు అన్ని శ్రేణుల పాఠకులనూ అలరించే శీర్షికాకోటిని ఎప్పటికప్పుడు ఎంతో ప్రత్యేకమైన పద్ధతిలో ప్రవేశపెట్టడమే

ముఖ్యంగా పత్రిక మెయిన్ టైటిల్ డిజైన్ చేసిన వారికి హృదయపూర్వక ధన్యవాదాలు పత్రిక యిప్పుడు ఆద్యంతమూ ఎ ఆకర్షణీయంగా వుండడమే కాకుండా ఎంతో ఎంతో యింట్రస్టింగ్‌గా కూడా వుంటోందంటే ఏ మాత్రం అతిశయోక్తి కాదు

– కె మాధవరావు సైదాబాద్




Printed and published by S Nageswararao for Nageswararao Estates Ltd
at the Andhra Patrika Press Gandhinagar VIJAYAWADA 520 003
Editor VEERAZEE Chief Editor S RADHAKRISHNA
Phones Editorial 75667 Business 61247 61248